మే 1975



# భారతి

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల రూపాయిన్నర

లలితా మూవీస



దర్శకత్వం:
కె. ఎస్. రామిరెడ్డి B.Sc., D.C.,

నిర్మాత:
జి. జగదీశచంద్రప్రసాద్ B.A.,



మాటలు. గొల్లపూడి సంగీతం. ఎస్ రాజేశ్వరరావు కెమెరా పి.ఎస్. సెల్వరాజ్ కూర్పు ఎమ్.ఎస్. మణి కళ చలం

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్

అన్నపూర్ణ పిక్చర్స

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

మే 1975

సంపుటము : 52 : సంచిక : 5 :

విడిప్రతిక వెల రూపాయిన్నర

3

# విషయానుక్రమణిక

## మే 1975

# ఎక్కడ నిను నిలుపు కునేది ?

శ్రీ కొడవంటి లీలా మోహనరావు

నింగీ నేలా
సరిహద్దులు చెరపి చెరపి
ఔన్నత్యానికి ఎగసి ఎగసి
గుండెల్లో కొండంత ఆశ నింపి
అంతలోనే
ఆశయాల తరగలు
ముక్క ముక్కలైతే
నిశ్చేష్టుడై
ప్రతి క్షణం ఒక సవాల్ కాగా
నిరంతర సమరంలో
నలిగి పోయే
యువకుని నిశ్వాసాలా ?
రంగుల హరివిల్లని
చల్లని పొదరిల్లని
జీవితాని కర్థం చెప్పుకుని
ఆశల గూడుల్లో
కమ్మని స్వప్నాల ఊపిరితో
ప్రాతఃకాల హిమబిందువులా
వెలుగుతూ
తన గిరిలో తానున్నా వీడని
రాబందుల నీడలో
ప్రాణానికి మానానికి
పెనగులాడి
నలిగి కడబట్టి
కుక్కలు చింపిన విస్తరిగా మారిన
తన జీవిత పర్యాలోకనలో
పెల్లుబికిన
ఆడగుండె మూలుగులా ?
దగా దోపిడీల పునాదులపై
ప్రభవించిన సమాజంలో
రెక్కలు ముక్కలు చేసుకున్నా
డొక్కైనా నిండక
నిత్య దారిద్ర్యంలో
కలుగుల్లో
మురికి వాడల్లో
బ్రతుకు ఈడ్వలేక
ఏడు రాడితే
నూకలు చెల్లిన
దగా పడిన తమ్ముల
ఆక్రందనలా ?
ప్రభూ
ఏది మరచి నిను ధ్యానించేది?
క్షోభించే నీ హృదయంలో
నీ బొమ్మ
కరగి మరు గౌతుంటే
ఎక్కడ నిను నిలుపు కునేది ?

# ప్రాకృత సాహిత్యంలో సామాన్య మానవుడు

శ్రీ తిరుమల రామచంద్ర

సంస్కృతం ప్రకృతి. దాని నుంచి పుట్టింది ప్రాకృతం. "ప్రాకృత భాషకు సంస్కృత శబ్దం ప్రకృతి" [1] అని వాచస్పత్యకారుడు చెప్పే వ్యుత్పత్తికాని, "సకల జగజ్జంతువులకు వ్యాకరణాదిసంస్కారం లేని సహజ వాగ్వ్యాపారం ప్రకృతి; దానివల్ల కలిగినదిగాని, అది గాని, ప్రాకృతం. ప్రాకృతం బాలురకు, మహిళలకు సుబోధమయినది, సకల భాషా నిబంధనభూతమయిన పలుకు. ఇది మేఘాలనుంచి పడిన నీరు వంటిది. అది దేశ విశేషాన్నిబట్టి, సంస్కారాదులనుబట్టి విశిష్టతను పొంది, సంస్కృతాదులుగా తర్వాత విభేదాలు పొందుతుంది" [2] అని రుద్రట రచిత కావ్యాలంకారాన్ని వ్యాఖ్యానించిన నమిసాధువు చెప్పిన వ్యుత్పత్తికాని నాకు అంతగా నచ్చడంలేదు. సంస్కృత ప్రాకృతాలలో ఏదీ ఒకదానిసుంచి మరొకటి పుట్టలేదు. ఇవి రెండూ ఒక పూవు కింది రేకు, పై రేకని, కాదు, ఒక రేకు కింది పై భాగాలని, ఒక నాణెం రెండువైపులని, ఒక కత్తి రెండు పక్కలని నమ్మేవారిలో నే నొకణ్ణి. సంస్కృతం ప్రాకృత భవమని, సామాన్య జనుల భాష అయిన ప్రాకృతం సంస్కరింపబడి సంస్కృతమయిందని అనేవారు మానవజాతి తొట్టతొలి ఛందోరూపమైన – రూపమని అనేకులు విశ్వసించే ఋగ్వేదం తొలి మండలం తొలిఋక్కు.

"అగ్ని మీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతమం"

వంటి దానిని ఒక్క ప్రాకృత గాథ నయినా చూపవలసి వుంటుంది. అప్పటివారు, ఋగ్వేదకాలంవారు మాట్లాడిన, సామాన్య వ్యవహారం చేసిన భాష ఏదో మనకు స్పష్టంగా తెలియకపోయినా, ఛందోబద్ధమయిన ఋగ్వేదం కొంత మేధావుల భాష అయి వుండి, సామాన్య ప్రజల భాష అంతకన్నా భిన్నంకాక చాల సన్నిహితమయివుంటుందని భావించడానికి అవకాశం వుంది. పిషెల్ అన్నట్టు ప్రాకృతానికి, వైదిక సాహిత్యానికి పోలికలు చాల వున్నాయి :– త్తణ–త్వన, ఆవి–ఆయ్యె, విహి–పవిభిః, హోహి–బోధి, విఊ–విదుః, ఘంసు–ఘ్రంస, రుక్ఖ–రుక్ష మొదలయినవాటిని ఆయన చూపారు. [3] పై వానిలో మొదటిది ప్రాకృతరూపం, రెండవది వైదిక రూపం. అందువల్లనే ప్రాచీన ఋగ్వేదకాలంనాటి సంస్కృతం, ప్రాకృతం ఒకే పూవు రేకు రెండువైపులని అన్నాను.

కాని, భాష, ఏ భాష అయినా, ప్రవాహిని. కనుక ఋగ్వేదపు సంస్కృతం కూడ జనం ముఖ యంత్రంలోపడి, మారక తప్పలేదు. ప్రాచీన భాషను పొల్లుపోకుండా కాపాడుకోవాలని నేడున్నట్లే, ఆనాడూ వైయాకరణులు వైదిక సాహిత్యంలోని ఋక్కులకు, పనసలకు పద పాఠాలు, ఉచ్చారణ రక్షణకు ప్రాతిశాఖ్యాలు పుట్టాయి; కాలక్రమాన వైదిక భాష కేవలం కర్మకాండ భాష కావడంవల్ల నిరుక్తాది నిఘంటువులు పుట్టాయి. అర్థరక్షణకు "వ్యాకరణం వేదాల రక్షణకు చదవాలి, లోపాగమ వర్ణ వికారజ్ఞుడే వేదాలను చక్కగా రక్షించగలడు" అని పతంజలి హితవు. పాణినికూడ "వేదేలోకే" అని విడదీయడంవల్ల సాహిత్యభాష, లౌకిక భాష వేరువేరయినట్టు స్పష్టపడుతుంది. మేధావుల మేల్మిభాషకు పోక, తథాగతుడు తన ప్రాంతపు పాలీ భాషతో ధర్మోపన్యాసాలు చేసినట్టు పరిశోధకులు చెబుతున్నారు. ఆ పాలీ భాష ఋగ్వేద బ్రాహ్మణాదుల సంస్కృతాన్ని కొంచెం ఏసతో కొంచెం ముఖయంత్ర సౌలభ్యంలో వ్యవహరించినప్పటి రూపమని ధమ్మపదంలోని మూడు పంక్తులు చూస్తే స్పష్టమవుతుంది.

"యో చ వస్ససతం జంతు అగ్గిం పరచరే వనే
ఏకంచ భావితత్తానం ముహుత్తం అపి పూజయే

సా యేవ పూజనా సేయ్యో యం చే వన్య సతం హుతం"
అందువల్ల ప్రాకృత సంస్కృతాలు రెండూ ఒక నాణెం రెండు వైపులని మరొకమారు మనవి చేసు న్నాను.

భాష ప్రవాహిని గనుక ఈ ప్రాకృతంకూడ మారక తప్పలేదు దీనిలోను సాహిత్య సంస్కారం గలది పై సాహిత్యమై, తక్కినది అపభ్రంశమయింది. ప్రాకృతమే అపభ్రంశమని కావ్యాలంకార వ్యాఖ్యాత నమి సాధుపు దబాయించి చెప్పి, [6] ఆ అపభ్రంశ ప్రాకృతమూ దేశ భాషలుగా వేయి చీలికలయింది. ప్రాకృత భాషల చర్చ నా యిప్పటి వినక్ష కాదు; బౌద్ధ ధర్మ గ్రంథాల జోలికిగాని,జైనాగమ ప్రాకృతం జోలికిగాని నేనిప్పుడు పోను: వాటిలో సామాన్య ప్రజల విషయాలు చాల వుండవచ్చు; కాని, నా ఇప్పటి వివక్ష సాహిత్య ప్రాకృతమయిన గాథాసప్తశతీ వజ్జాలగ్గం, సేతుబంధం , గౌడవహో అనే నాలుగు కావ్యాలలో, నగర ప్రసక్తి చాల తక్కువగా వున్న గ్రామీణ సామాన్య మానవుని సితిగతులు, జీవిత విధానం ఎలా చిత్రించబడినవో మనవి చేయడమే.

సాహిత్య ప్రాకృతం సాహిత్య సంస్కృతానికి నిజంగా భిన్నం కావడానికి ప్రధాన కారణం సామాన్య మానవుడే ననుకుంటాను. సామాన్య మానవుణ్ని ప్రాకృత సాహిత్యం ఆదరించినట్టు, అభిమానించినట్లు సంస్కృత సాహిత్యం ఆదరించలేదు. మన అది కావ్యమయిన రామాయణం కూడ రాగ రంజకమయినదే- అంటే కోర్టుపొయ్‌ట్రీ. కనుక ప్రాకృత సాహిత్యం ప్రజారంజకం, ప్రజా విషయకం అనడం పొరపాటు కాదు. ఈ దృష్టితో చూచినప్పుడు గాథాసప్తశతి ప్రజారంజక సాహిత్యంలో అగ్రస్థానం వహిస్తుంది. ఈ గాథాసప్తశతిలో కొంతయినా తెలుగుగడ్డపై వెలసినది. గాథ అంటే ఆర్యావృత్తభేదం. ప్రజారంజక కవులు రచించిన ఈ అమర గాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు కూర్చినవాడు హాల సాతవాహనుడు. హాలుని కాలం క్రీస్తుశకం మొదటి శతాబ్దమని, 68 ప్రాంతంలో వున్నవాడని పండితుల నిర్ణయం. ఇతడు తాను రాజయినా, గ్రామజీవన సౌందర్యం వెల్లివిరిసే గాథలను సేకరించి ప్రపంచానికే ముక్తకగ్రథనంలో మార్గదర్శకు డయ్యాడు. తెలుగువాని కల్పనా కమనీయతను దిగంతాలకు చాటాడు.

## గాథా సప్తశతి

అప్పటి దృష్టి రసరాజమయిన శృంగారానికి పట్టం కట్టినది గనుక, ఈ గాథలలో శృంగార రసచ్ఛాయ లేనివి తక్కువే అయినా, ఆ శృంగార రసధునినుంచి తొంగిచూచే సామాన్య మానవుని జీవితం, నేడూ- సామాన్యజనునికి పట్టాభిషేకం చేస్తున్నామని, అభ్యుదయ పథగాములమని చెప్పకొంటున్న నేడూ- ఆశ్చర్యం కలిగిస్తుంది, ఇంత సా న్య విషయం, ఇలాటి ఇంటి ముచ్చట్లు కవితా స్థాయికి ఎలా ఎక్కగలిగాయా అని. సామాన్య మానవునికి నా నిర్వచనం ప్రతి వృత్తిలోని సామాన్య గృహస్థు: రాజసేవకుడు మొదలు నాపితుని వరకు గలవారు. ఈ సామాన్య ప్రజల దైనందిన జీవితం, దారిద్ర్యం, కరువు కాటకాలు, వాగులు వరదులు, వానకాలపు బురదవీధులు, ఎండకాలపు మృగతృష్ణలు, దప్పిగొన్న బాటసారులు. చలివెందలి చపలాక్షులు, చలికాలపు నెగళ్లు, నెగళ్ల గొంగళ్లం అక్కరలేని నెరజాణల మొగుళ్లు, వసంతోత్సవాలు, మొగిళ్లను చూచి మూడు నిట్టూర్పులు విడిచే ముదితలు, ఫాలు ణోత్సవాలు, పెండ్లిండ్లు, పేరంటాలు. సతులు అసతులు, విధవలు వేశ్యలు, జారులు పూజారులు, వంటలు పంటలు, శిథిల దేవాలయాలు, ప్రశిథిల వలయాలు, నగలూ నాణేలు- ఒక్కటేమిటి గ్రామాలరోసి ప్రతిదీ కావ్యవస్తువయింది. ధర్మశాస్త్రం నిషేధించిన ఋతుమతీ సంస్పర్శన సంగమాలను కూడ ఈ కవులు వదిలిపెట్టలేదు ఈ రమణీయ జీవితానికి దిఙ్మాత్రంగా కొన్ని గాథలను ఉదాహరిస్తాను.

దారిద్ర్యాన్ని చిత్రించడంలో ప్రాకృతకవి నేటి అభ్యుదయ రచయితను కల్పనలో ఎలా మించిపోయాడో ఈ గాథలే సాక్షులు:-

> దుగ్గఅ కుటుంబఅ
> కహంణ మఏ ధోఏణ సోఢవ్వా,
> దసిఓసరంత సలిలేణ
> ఉఅహ రుణ్ణంవ పడవిణ గాథాః 1-18
> (దుర్గతకుటుంబాకృష్టిః
> కథన్ను మయా ధౌతేన సోఢవ్యా
> దశాపసరత్సలిలేన
> పశ్యత రుదిత మివ పటకేన?)

కటిక దరిద్రం. ఉన్న ఒక్క గుడ్డనూ దినమూ గుంజి పులిమి ఆరవేస్తున్నారు. గుడ్డ చీకిపోయి ఇక ఉండలేననుకుంది. ఆరవేసిన గుడ్డ అంచునుండి నీరు కారుతూంది. దానిని కవి ప్రాకృతకవి చూచాడు. అతని హృదయం కూడా నీరు కారింది. ఈ దరి ద్రపు సంసారం గుంజుకొని రావడం ఇక సహించలేనన్నట్లు ఆ గుడ్డ ఏడు

స్తున్నట్టు ఉంది అని అంటాడు కవి.

దరిద్రుని ఇళ్లాలు. వేవిళ్లు వచ్చాయి. వేవిళ్లలో ఎన్నో ఆశలు పుడుతాయి స్త్రీలకు. కాని, భర్త దరిద్రుడు. ఏమి తెచ్చిపెట్టగలడు! కనుక ఏమి కావాలి?'' అని అడిగినప్పుడల్లా ''మంచినీళ్లు కావాలి!'' అనేదట పాపం!

''దుగ్గ అఘరమ్మి ఘరిణీ
రక్ఖంతీ ఆఉలత్తణం పఇణో
పుచ్ఛిఅదోహల సద్ధా
పుణోవి ఉఅఅం విఅ కహేఇ.'' గాథా.స:–5–72

(దుర్గత గృహే గృహిణీ
రక్షంతీ ఆకులత్వం పత్యుః
పృష్ట దోహద శబ్దా
పున రపి ఉదక మితి కథయతి)

తాను ఏమి అడిగినా, భర్త తేలేడు. ఆతని ఆకులత్వం పోగొట్టడానికి పాపం మంచినీళ్లు తప్ప మరొకటి అడుగలేదు.

చలికాలం దరిద్రుడు పిడకల కుమ్మముందు చలికాచుకొంటు న్నాడు. అతడు కట్టుకొన్న గుడ్డ పిడకలకంపు కొడుతూంది; పొగ చూరి కావిరంగు ఎక్కి, నేత కూడ వదలయిపోయింది. ఎంత దైన్యం! ఇలా హేమంతఋతువు దరిద్రుణ్ని పట్టి చూపుతుంది లంటాడు కవి.

''సూఇజ్జఇ హేమంతమ్మి
దుగ్గఓ పుప్ఫుఆసుగంధేణ,
ధూమకవిలేణ పరివిరళ
తంతుణా జుణ్ణవడఏణ.'' గాథా.స:4–29

(సూచ్యతే హేమంతే
దుర్గతః కరీషాగ్ని సుగంధేన
ధూమకపిలేణ పరివిరళ
తంతునా జీర్ణపటకేన)

ప్రాకృత కవులు చిత్రించిన గ్రామీణ దృశ్యాలు రాజరంజక కవుల కల్పనలకు అతీతమైనవి. ప్రాకృత ప్రజారంజక కవి తన పరి సర సామాన్య విషయాలను మనోహరంగా అతి సహజమైన, ప్రయత్న పూర్వకంగా గ్రహించదగినట్లుగాక సులభగ్రాహ్యంగా ఉపమోత్ప్రేక్ష లతో చిత్రిస్తాడు.

''పాలేహి అచ్ఛభల్లం
వ ఉఅహ కుగ్గామ దేఉలద్దరే,
హేమంత అల పథిఓ
విజ్ఝాయంతం పలాలగ్గిం గాథాస: 2–9

(పాలయ తగచ్ఛభల్లం
ఇవ పశ్యత కుగ్రామదేవకులద్వారే,
హేమంతకాల పథికో
విధ్మాయమానం పలాలాగ్నిం.

ఈ గాథలోని చిత్రం; దాని వర్ణన అపురూపాలు—చలికాలం. పరె టూరి దేవాలయం ముందు ఒక బాటసారి గడ్డి నెగడు వేశాడు. చలికి గడ్డినెగడు ఎంతసేపు ఉంటుంది! ఆరిపోతుంది. కాని లోపల నిప్పు ఉంటుంది. కనుక నెగడును కర్రతో కెలుకుతున్నాడు. అది ఎలుగుబంటిని చీలుస్తున్నట్టు ఉన్నదట. కాలిన గడ్డి మంట ఆరి పోగానే, నల్లగా పెద్దగా రాశివలె కనిపిస్తుంది. కర్రతో కెలికితే లోపల ఎర్రగా నిప్పు కణకణమంటుంది. కవి పొట్ట చీల్చుతున్న ఎలుగుబంటిలో పోల్చాడు, దీనిని.

కవితకు పేరకురాలు పద్మినీజాతి స్త్రీయే కానక్కరలేదు. అనుక్షణం మన కళ్లెదుట మసలుతూ, ఇంటి పనులలో నిమగ్న రాలయిన ఇల్లాలయినా ప్రేరకురాలు కాగలదని ప్రాకృతకవి సిద్ధాంత మయివుంటుంది. లేకపోతే,

''రంధణకమ్మ నిఉణిఏ
మాజూరసు రత్తపాటలసు అంధం
ముహమారు అం పి అంతో
ధూమాఇ సిహీ ణ పజ్జలఇ'' గాథాస: 2-24
(రంధన కర్మనిపుణికే
మాకృధ్యస్య రక్తపాటల సుగంధం,
ముఖమారుతం పిబన్
ధూమాయతే శిఖీ న ప్రజ్వలతి.)

లిని అనిపుండడు. ఇల్లాలు వంట చేయాలి. పొయ్యి రాజవేసింది. పొయ్యి రాజలేదు. నిప్పు మండడంలేదు. భర్త అంటాడు: "వంటల్లో ఆరితేరిన గడసరిదానా, ఊదడం మాను. కోపగించుకోకు. నీ ఊర్పుల కమ్మతావిని ఆస్వాదిస్తూ, అగ్నిదేవుడు మరీమరీ ఆ తావిని గ్రోలుదామని మండడం లేదు." అని.

ప్రసూతి వైరాగ్యం. పురాణ వైరాగ్యం, శ్మశాన వైరాగ్యం— అని వైరాగ్యం మూడు విధాలని (ఇవి తాత్కాలికమయినవి కావడం వల్ల) పెద్దలు హాస్యం చేస్తుంటారు. పురాణం విన్నంతసేపూ మంచి పనులు చేయాలని, ఈ సంసారం రోత అని అనిపిస్తుంది. శ్మశానంలో ఏవరికన్నా దహన సంస్కారం జరుగుతుండడం చూచి నప్పుడు, ఏమిటీ దేహం, అనిత్యం ఎప్పటికయినా మనమంతా కాలి పోవలసినవారమే అనిపిస్తుంది. కాని, తర్వాత, ముందులాగే సంసారంలో పడుతాము. అలాగే ప్రసూతి వైరాగ్యమూ. స్త్రీలు ప్రసవ వేదన భరించలేక ఇక మగడు వద్దు, వాడి ముఖం చూడను." అని ఏడుస్తారు. కాని, మళ్లీ కాపురం సాగుతుంది. ప్రాకృతకవి తను గ్రామాలలో చూచిన ఇలాటి ఘటనను ముచ్చటగా వర్ణించాడు:— తొలికాన్పు. ఎంత వాగరకురాలయినా భయంగా వుంటుంది, ఏమవు తుందోనని. ప్రసవవేదన భరించలేక ఇక మగడు వద్దు. చాలు అని పదేపదే అనడం ప్రారంభించిందట. అందరూ నవ్వారట.

"హాసావిఓ జణో
సామలీఅ పఢమం పసూఅమాణాఏ,
వల్లహ వాహేణ అలం
మమత్తి బహుసో భణంతీఏ. గాథాస:—2–26

(హాసితో జనః
శ్యామయాః ప్రథమం ప్రసూయమానాయాః
వల్లభ వాదేన అలం
మమేతి బహుశో భణం త్యా.)

ఇటీవల 45 సంవత్సరాల వయస్సు తర్వాత పెళ్లాడి కాన్పు వచ్చిన ఒక అధికారిణి, భయపడుతూ ప్రతి తల్లినీ అడిగింది, "ఏమవు తుంది? ఎలా వుంటోంది?" అని. అయినప్పుడు, ఏమాత్రం వైద్య సౌకర్యాలూ లేని రెండువేల సంవత్సరాల క్రిందటి గ్రామాల అర్భకు రాలు భయపడడంలో ఆశ్చర్యమేమిటి?

తన భర్తను మరొక జాణ వలచింది. ఈమె నిలదీసింది. ఆమె కాదన్నది. కాని ఈమె ఒప్పుకోలేదు. "నాకు తెలుసు నీ ప్రవర్తన. నీవు రాత్రల్లా నావానితో కులకకపోతే ఎందుకలా ముర్రుపాలు తాగిన కొత్తగేదె దూడవలె పగలల్లా నిద్రపోతావు?" అని ప్రశ్నించింది, ఈమె.

"జఇ హోసి ణ తస్స పిఆ
అణుదిఅహం ణీసహేహి అంగేహిం
ణవసూఅ పీఅపేఊస
మత్త పాడివ్వ కిం సుఅసి?" గాథాస:1–65

(యది భవసి న తస్య ప్రియా
అణుదివసం నిస్సహై రంగైః,
నవసూత పీతపీయూష
మత్త మహిషీ వత్సేవ కింస్వపిసి?"

అప్పుడు పుట్టిన పిల్లలు 23 గంటలూ నిద్రపోయినట్లే, పశువుల దూడలు కూడ జున్నుపాలు తాగి మత్తుగా నిద్రపోతాయి. రాత్రల్లా రతివిలాసంలో అలసిసొలసి పగలల్లా నిద్రపోతున్న పడతిని ప్రాకృతకవి సహజసుందరంగా తను నిత్యం గ్రామాలలో చూచే కొత్తగేదెదూడతో పోల్చడం రాజరంజక కవికి ఊహాతీతమని నా విశ్వాసం.

పల్లెటూరి మడికయ్యలలో జరిగే శృంగార నాటకాలను పోలుడు ఎన్నో ఏరాడు. వాటలో ఒకటి విశిష్టమయింది ఇది :— పాలేరుకు, గృహస్వామినికి మనసు కలిసింది. పక్కలను, హంసతూలికా తల్పాలను తలదన్నే మడికయ్యలలోనే మన్మథుణ్ని ఆరాధించారు. ఆమె ఆనందపారవశ్యంతో చొక్కి కనులు మూసుకుంది. ఎంతసేప యినా తెరవలేదు. పాలేరు వెర్రిబాగులవాడు. యజమానురాలు చచ్చిపోయిందేమోనని భయపడుతాడు, కాలికి బుద్ధిచెబుతాడు. వాడి వెర్రికి గట్టుమీద అరవిచ్చి వంగిన పత్తికాయ నవ్విందట, ఆనందంతో వున్న ప్రియురాలిని వదలిపోతున్నాడే అని.

"అజ్జం మోహణసుహిఅం
ముఅత్తి మోత్తూ పలాయితే హలిఏ,
దరఫుడిఅ వేంటభారో
ణఅఇ హసిఅం వ ఫలహీఏ" గాథాస: 4–60

(ఆర్యాం మోహనసుఖితాం
మృతేతి ముక్త్వా పలాయితే హాలికే,

ఈషత్స్ఫుటిత వేంటభారా
నతయా హసిత మివ కొర్పాస్యా)

పత్తికాయ కొంచెంగా పగిలినప్పుడు, పగిలిన డిప్ప అంచులు ఎర్ర గాను, తడి పత్తి వెన్నెలరంగుతోను వుంటుంది అరవిచ్చిన పత్తి కాయను నవ్వుతో పోల్చినందుకు ప్రాకృత జనరంజక కవికి ఏమిచ్చినా తీరదు. రాజరంజక కవికి ఇలాటిది ఎందుకు తోచలేదో !

ఏతల్లికయినా తన పిల్లడు చేసిన చేష్టలు గొప్పగా కని పిస్తాయి. ఒక తల్లి పిల్లడికి అప్పుడే పాలపండ్లు వచ్చాయి. ఆ పాల పండ్లతో వాడు రేగుపండు కొరికాడు. ఆ రెండుగాటూ ఆమెకు ఏమనిపిస్తాయో ! అని పించాయో ! మహానందంతో భర్తవద కు వచ్చింది, "ఇదిగో తీసుకోండి. చూడండి దీనిని." అంటూ నవ్వుతూ పిల్లడు పాల్లతో కొరికిన–కొత్తగాపుట్టుకొని వచ్చిన రెండు పండ్ల గాట్లున్న–రేగుపండును భర్తకు చూపిందట.

"గేహ హ పలోఅహ ఇమం
పహసి అవఅణా వఇస్స అప్పేఇ,
జాఆ సుఅ పఢముబ్భిణ్ణ
దంతజాఅ లంకిఅం బోరం. గాథాస : 2-100
(గృహ్ణీత ప్రలోకయత ఏనం
ప్రహసిత వదనా పత్యు రర్పయతి. ।
జాయా సుత ప్రథమోద్భిన్న
దంతయుగళాంకితం బదరం)

దీనిలో ఒక వైద్యక శాస్త్ర రహస్యమూ ఉంది. పిల్లలకు పళ్ళు వచ్చే వరకు భార్యా భర్తలు తప్పనిసరిగా శయ్యాపథ్యం చేయాలి తర్వాత అక్కరలేదనికాదు. అంతలోగా కక్కుర్తి పడరాదని. అందుకనే భార్య భర్తతో "మహా తొందర పడేవారు. ఇక ఫరవాలేదు" అని నవ్వు ముఖంతో చూపడం.

ఏ వస్తువు నన్నా పగ్గం కట్టి పైకి లాగుతామనుకోండి. అది బరువుతో లేవనప్పుడు, అప్రయత్నంగా మన నోటినుంచి కేకలు, ఆర్భాటాలు బయలుదేరుతాయి. వర్షాకాలం పగ్గాలు పైనుంచి విసిరి నటు వర్షం కురుస్తూంది. ఉరుములు వినిపిస్తున్నాయి. ప్రజా రంజకకవి తమ సహజంగా బరువు లెత్తేవారని చూచిన దృష్టితో చూచాడు ఈ దృశ్యాన్ని. మేఘమనే కార్మికుడు సందులేకుండ భూమిని పగ్గాలుకట్టి పైకి లాగుదా మనుకున్నాడు. ఎంతో ప్రయ త్నించాడు. లాగలేక పోయాడు. అందుకోసం మూల్గుతున్నాడు; ఆ మూల్గులే ఉరుములు అని వర్ణించాడు.

"అవిరల పడంత ణవజల
ధారా రజ్జు ఘడిఅం పఅత్తేణ,
అపహుత్తో ఉక్ఖేత్తుం
రసఈవ మేహో మహిం ఉవహ" గాథాస:-5-36
(అవిరల పతన్న వజల
ధారారజ్జుఘటితాం ప్రయత్నేన,
అప్రభవ న్నుత్క్షేప్తుం
రసతీవ మేఘో మహీం పశ్యత.) ।

పిల్లలు మనం బలపంతో పలకమీద వ్రాసినది తుడిచి వేస్తుం టారు దీనిని ప్రాకృత కవి ఒక జీవిత సత్యానికి అన్వయించాడు. మనసు ఏవేవో కోరికలు కోరుతుంటుంది. మనస్సు ఆశ అనే బల పంతో హృదయమనే పలకమీద ఏవేవో పిచ్చి కోరికలనో గీతలు గీస్తుం టుంది. వాటిని విధి పిల్లవాడివలె నవ్వుతూ తుడిచి వేస్తుంటాడు అని. పిల్లవాడి ఇతరుల లాభాలాభాలలో ప్రసక్తిలేదు. ఎవరేమివ్రాసినా పిల్ల చేష్టలతో తుడిచివేస్తుంటాడు.

"జం జం ఆలిహఇ మణో
ఆసావట్టీహిం హిఅఅఫలఅమ్మి,
తం తం బాలోవ్వ విహీ
ణిహుఅం హసిఊణ పంహుసఇ
గాథాస : 7-56

(యద్య దాలిఖతి మన
ఆశావర్తికాభి ర్హృదయ ఫలకే,
తత్తద్బాలక ఇవ విధిః
నిభృతం హసిత్వా ప్రోంఛతి.)

పిల్లల చేష్టలు, వినోదాలు మనం ప్రతిక్షణంచూస్తుంటాము. ప్రాకృతంనుంచి ఒక నిత్య సత్యాన్ని అను సంధించాడు

వర్షాకాలంలో గ్రామంలోని దారులన్నీ బురదయిపోతాయి.

అప్పుడు నడవలేము. కాని, శరత్కాలం రాగానే బురద ఎండడం ప్రారంభిస్తుంది. దారులుపైన ఆరుతాయి. కాని తొక్కితే, పైన నడిస్తే మెత్తగా అణగిపోతూ, ఒత్తిడికి బుస్సుబుస్సుమనే ధ్వని కలుగుతుంది. దానిని చూస్తే, ఎలావుందంటే, జనం పైన నడయాడుతుంటే, దారులు ఊపిరి వదలుతున్నట్టు వుందట.

"అబ్భంతర సరసాఓ
ఉపిరిం వవ్వా అబద్ధ పంకాఓ,
చంకమ్మత్తమ్మి జణ్ణె
సముస్ససంతి వ్వ రచ్చా ఓ." గాథాస: 7–23
(అభ్యంతర సరసా
ఉపరి ప్రవాత బద్ధ పంకాః,
చంక్రమ మాణే జనే
సముచ్ఛ్వ సంతీత రథ్యాః)

మామిడిపండు పూర్తిగా మనదేశంది. బుద్ధుని కాలంలో ఆమ్రవనం, ఆమ్రపాలీ ఉన్నప్పుడు గాథాసప్తశతిలో మామిడిపళ్ళ ప్రసక్తిని ఏమి తక్కువ? ఊళ్ళలో శత్రుపక్షాలుంటాయి. ఒక శత్రుపక్షం వారికోరికను మరొకరుగాని, తటస్థులుగాని మన్నించరు. ఇలాటి ఒక శత్రుపక్షానికి చెందిన ఒక మహిళ పుత్రునితోపాటు ఒక చోట ఉంది. అక్కడ ఒక మామిడిచెట్టు దానిలో ఒకపండు మాగి వేలాడుతుంది. పిల్లవాడు ఆ పండు కావాలన్నాడు. ఏడుస్తున్నాడు. తల్లి దారినిపోయే ప్రతి దానయ్యనూ అడుక్కుంది; "పండుదూరంగా వుంది. అందుకోలేను. పిల్లడు ఏడుస్తున్నాడు, తెంపి ఇవ్వండి" అని. కాని, ఆ పథికులు ఎవరూ తెంపి ఇవ్వలేదు. "ఈమె ఒక శత్రుపక్షానికి చెందినట్టిది. మన పక్షంవారు ఏమనుకుంటారో!" అని ఇతర శత్రుపక్షంవారు వినకుండా. తటస్థులేమో "మనకెందుకు? ఎవరివాళ్ళు వాళ్ళకు సహాయం చేసుకుంటారు" అని ఊరుకున్నారు.

"విషమట్ఠియ పక్కే
క్కంబ దంగణే తుజ్ఝ సత్తుఘరిణీఏ,
కో కో ణ పత్థి ఓ పహిఅణం
ఢింభే రు అంతమ్మి." గాథాస: 6–95

(విషమస్థిత పక్వైకామ్ర
దర్శనే తవ శత్రుగృహిణ్యా
కః కో న ప్రార్థిత
పథికానాం డింభే రుదతి)

నీ శత్రు గృహిణి అని కవి చెప్పడంవల్ల ఒకరాజు ప్రసక్తవసవుంది. ఇది ఏరాజో పరిశీలించాలి.

ఎంతకాదనుకున్నా పట్టణచ్ఛాయలు దీనిలో లేకపోలేదు. నందుల కాలపు రాజవిప్లవాలు మరికొన్ని అరాచకాలు కొన్ని గాథలలో ధ్వనిస్తున్నట్లు కనిపిస్తుంది. గాథాసప్తశతి ఐదవ శతకం 17 గాథ నందవంశ మూలపురుషుని కథను ధ్వనింపజేస్తున్నదని శ్రీ ఎస్. ఎస్. కృష్ణమూర్తిగారు భావిస్తున్నారు. ఆ గాథ ఇది :-

"ఆమ అస ఇహ్మ ఓసర
పఇవ్వఏ ణ తుహ మఇలిఅం గోత్తం;
కిం ఉణ జణస్స జాఅవ్వ
చందిలం తా ణ కామేమో." గాథాస. (5–17)
(ఆమ అసత్యో వయం
అపసర పతివ్రతే న తవ మలినితం గోత్రం;
కింపున ర్వయం జనస్య జాయేవ
నాపితం తావన్న కామ్మయామహే.)

ఔను! మేము లంజలం. దగ్గరకు రాకు, తప్పుకో. నీ వంశం మయిలపడిపోయేని. కాని, మేము సామాన్య సంసారికి భార్యలం. నాపితుని కామించ లేదుగదా!- అని ఈ గాథ అర్థం. నందులకు పూర్వం భారపాలకులు శిశునాగులు. శిశునాగులలో కడపటిరాజు కాలాశోకుడు. కాలాశోకుని భార్యకు ఆస్థాన నాపితునికి సంబధం కలిగింది. ఈ నాపితుడు కాలాశోకుని భార్య సహాయంలో, అతనిని చంపి, రాజ్యం ఆక్రమించుకొని నందవంశానికి మూలపురుష డవుతాడు.[7] వీడిని నాపితదాసుడని కొందరన్నారు. మహావంశ నందులు అధార్మికులని, ఉన్నత కులులు కారని అంటున్నది.

ఇలాంటి రాజకీయ విషయమే మరొకటి ఒక గాథలో సూచిత మయింది. వసంత ఋతువు వచ్చింది. మామిడికొమ్మ మోసులెత్తింది. పాంథులు భయపడిపోయి ఈ విషయం ఏవో రాజద్రోహ వార్త చెప్పివట్టు గుసగుసగా ఒకరి చెవి మరొకరు కొరుకుతూ చెప్పినట్టు ఉందది.

"రాజవిరుద్ధం వ కహం
పహిఓ పహిఅస్స సాహఇ ససుంకం,
జత్తో అంబాణ దళం
తత్తో దరణిగ్గఅం కింపి." గాథాస.- 4-96
(రాజ విరుద్ధా మపి కథాం

పథికః పథికస్య కథయతి సశంకం,
యత ఆమ్రాణాం దలం
తత ఈషన్నిర తం కి మపి.)

నందుల మూలపురుషుని గాథలాగే ఇది కూడా ఏ అజాతశత్రువు తన తండ్రికి చేసిన ద్రోహాన్ని జనం గుసగుసగా చెప్పుకొన్న దానికి సూచక మయివుంటుందని నా అభిప్రాయం.

వీధిలోని ఆటలు కుస్తీలు ప్రాకృతకవి దృష్టిని దాటిపోలేదు. అవి సామాన్య మానవుని వినోదాలుగనుక. ఒక ముసలి మల్లుడు ఎన్నో మల్ల యుద్ధాలు చేశాడు. వాటిలో ఎదిరి మల్లులు కొట్టిన దెబ్బలకు అతని చెవులు చిట్లి చితికి బండబారిపోయ్యాయి. అలాటివాడు కాసె బిగించి కుస్తీకి సిద్ధమయ్యాడు. అతని కాసె బిగింపు చూడ గానే ఎదిరి వాడికి మల్లుని గుండెలు పెల్లగించుకొని వచ్చాయి, భయంతో.

జుజ్ఝ చవేడామోడిఅ
జజ్జర కణ్ణస్స జుణ్ణ మల్లస్స,
కచ్ఛాబంధో చ్చిఅ భీరు
మల్లహి అఅం సముక్ఖణఇ". గాథాస: 7–84
(యుద్ధ చపేటా మోటిత
జర్జర కర్ణస్య జీర్ణమల్లస్య,
కక్ష్యాబంధ ఏవ భీరు
మల్లహృదయం సముత్ఖనతి.)

మరొక వీధిలో మల్లుడు తప్పెట కొడుతున్నాడు. మల్లుని భార్య తప్పెట తాళానికి అనుగుణంగా నాట్యంచేస్తున్నది. ఒకతె ఆ మల్లిని–మల్లుని భార్యను ఎత్తి పొడుస్తుంది:" ఓ మల్లీ, ఎంత దురదృష్టమేనిది! భర్త డప్పుకొడితే ఆడుతావు సిగ్గులేక! అని.

"ఆ ణత్తం తేణ తుమం
వఇణో పహాఏణ పడహ సద్దేణ,
మల్లి ణ లజ్జసి ణచ్చసి
దోహగే పా అడి జంతే." గాథాస: 785
(ఆజ్ఞప్తం తేన త్వాం
పత్యా ప్రహాదేన పటహశబ్దేన,
మల్లి నలజ్జసే నృత్యసి
దౌర్భాగ్యే ప్రకటీ క్రియమాణే.)

[సశేషము]

# అ ధో జ్ఞా పి క లు:

1. ప్రకృతేః సంస్కృత శబ్దాదాగతః అచ్ ప్రాకృతః. ప్రాకృత భాషాయాః సంస్కృత శబ్ద ప్రకృతికత్వాత్–వాచస్పత్యమ్.

2. సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహిత సంస్కారః సహజో వచన వ్యాపారః ప్రకృతిః, తత్రభవం, సైవవా ప్రాకృతం. ప్రాకృతం బాల మహిళాది సుబోధం సకల భాష నిబంధన భూతం వచనముచ్యతే మేఘనిర్ముక్త జలమివైక స్వరూపం తదేవ దేశవిశేషాత్సంస్కార కరణాచ్చ సమాసాదిత విశేషం సత్ సంస్కృతాద్యుత్తర విభేదానాప్నోతి, – కావ్యా లంకార వ్యాఖ్య.

3. ప్రాకృత సాహిత్యకా ఇతిహాస్–డాక్టర్ జగదీశ్ చం దజైన్.

4. రక్షార్థం వేదానాం అధ్యేయం వ్యాకరణం. లోపాగము వర్ణ వికారజ్ఞోహి సమ్యగ్వేదాన్పరిపాలయతి.

5. ధమ్మపదః పుట 35.

6. ప్రాకృతమేవా పభ్రంశః–కావ్యాలంకార వ్యాఖ్య.

7. **History of Indian people and culture. Bharateeya vidya bhavan, Vol-2, PP 30-31.**

# నా అద్దం

## శ్రీ కేఎస్వీ

నా అద్దంలో నేను
అందంగానే కనిపిస్తాను
నా అద్దంలో నా కందరూ
అందంగానే కనిపిస్తారు

అందాన్ని చూపిస్తుందేగాని
అంచుల్లేవు నా అద్దానికి
ప్రేమించడమే తెలుసుగాని
ఫ్రేములో కుదించుకుపోవడం తెలీదు అ—ద్దానికి

మరకలు లేనిది నా అద్దం
అరమరికలు లేనిది నా అద్దం
ఉలిపిరి కాయితం లాంటిది వెలుతురు జీవితం లాంటిది
చీకట్లో అయినా నిఖిల లోకాల్నీ ప్రతిఫలించేది నా అద్దం.

ఆసరా లేకుండా నిలబడుతుంది నా అద్దం!
మోసాల్నీ ద్వేషాల్నీ చూసి పెదవుల వెనకే నవ్వుకుంటుంది నా అద్దం!!
"ఈ మనుషులంతా ఎప్పుడైనా బాగుపడతారా ?—" అంటే
ఎందుకో తెరలు తెరలుగా నవ్వుతుంది నా అద్దం!

చిత్రమైన ఈ అద్దం!
ఎక్కడుంది ఈ అద్దం? ఏది ఏది ఈ అద్దం?
ఎక్కడో లేదు – ఏదో కాదు –
నా మనసే నా అద్దం!!

# బ్రిడ్జి క్రింద...

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

'ఈ సోటో వుండి బాగుపడోడు ఎవడు? ఇరసాలు దున్ని గుంటకగొట్టి దున్నకం సేసుకుని యింటోవుండే యిత్తనాలు నేల జల్లి వానదేవుడా అంటా మబ్బుదిక్కు సూసుకుంటూ కూసునే వోడు బాగుపడేది ఏకాలానికి? మానాయన కట్టిపోయిన పద్దెనిమిది మార్ల అప్పు ఏకాలానికి తీరేది? టవునుకు బోయి యేపనన్నా సేసి మడిసిగా నిలబడతాను' అన్నాడు పోతప్ప. అతని తండ్రి చాప బోయేముందు ఎనిమిదెకరాలమడి కౌలుకు తీసుకున్నాడు. 'కొనమడి. దాన్ని చేత్తే బొమ్మిడీలు గొట్టుక పోవాల్సిందే' సని పోతప్ప ముందే చెప్పాడు. బతికేద్దామన్న ఆతంలో అతను కొడుకుమాట చెవినేసుకో లేదు. ఆర్నెల్లపాటు యింటిల్లపాదీ అందులో ఎద్దుల్లా చాకిరీ చేశారు. చివరికి చేతిదాకా వచ్చిన పైరు కళ్లముందే ఎండిపోయింది, నీళ్లు లేక. చారెడు గింజలు రాలేదు. ఎరువులకోసం, కూలోళ్లకోసం చేసిన అప్పులు తలచుకొని ఉరిపోసుకు చచ్చిపోయాడు పెద్దాయన అప్పులవాళ్లకు మొహం చూపించలేకుండా వున్నాడు పోతప్ప. పనికి ప్రాలు మాలే మనిషికాదు. రక్తం ధారబోసినా, కండలు కరిగించు కున్నా ఆ అప్పుతీర్చుకుని బ్రతుకులో నిల్రదొక్కుకోవాలన్న పట్టు దలతో పట్నానికి వచ్చాడు. బాడుగ రిక్షా తొక్కడంతప్ప మరో మార్గం కనిపించలేదు ప్రస్తుతానికి.

మూడోరోజు మధ్యాహ్నం బ్రిడ్జినీడలో కొత్తూరు ప్రక్కన రిక్షా ఆపుకున్నాడు. కొంచెందూరంలో చలపతి రిక్షా వున్నది. రిక్షాలో వాలుగాకూర్చుని సీటుమీద తలఆన్చి పెడలుమీద ఒక కాలు నిలిపి రెండోకాలు సైకిలుమీద ఆన్చి ముడుచుకుని వక్కపొడినములుతూ నడుంవాల్చాడు చలపతి. ఇద్దరమ్మాయిలు ఆగి 'మూడోరోడ్డుకు వస్తావా?' అన్నారు చలపతితో. 'డెబ్బై పైసలు యిద్దరికీ' అన్నాడు చలపతి. 'పావలా యిస్తాం' అన్నారువాళ్లు. చలపతి బదులు చెప్పకుండా వక్కపొడి నములుతూ కూర్చున్నాడు. పోతప్ప తన రిక్షా తోసుకుంటూ అక్కడికి వచ్చాడు, బేరం కడదామనే వుద్దేశ్యంతో.

'ప్రక్కనేగదోయ్ మూడోరోడు. నడిచిపోదాం' అని యిద్దరూ వెళ్లి పోయారు. పోతప్ప నిలబడ్డాడు.

'కొత్త మొగమే! ఎవూరుమన్ది?' అన్నాడు చలపతి.

'యర్రాయపాలెం'

'వూరు విడిచి వచ్చినావే'?

'అప్పుగట్టాల్సివుంది' ముక్తసరిగానే అన్నాడు పోతప్ప.

'రిక్షాదొక్కా?' చలపతి నవ్వాడు. 'అప్పుగట్టటానికి రిక్షా దొక్కుతావా?'

నవ్వులోని తిరస్కారానికి పోతప్పకు చిరాకు కలిగింది. సమా ధానం యివ్వలేదు.

'ఇల్లు దొరికేవరకూ యీ బ్రిడ్జి క్రింద వుండొచ్చు' అన్నాడు చలపతి.

ఈసారి పోతప్పకి కోపంవచ్చింది. 'ఛా, నేనేం కాటావాణ్ణా? మాకు మానం మరేదా వుండేవోల్లమే, వూరిడిసి వచ్చినాగానీ' అన్నాడు.

చలపతి మళ్లీ నవ్వాడు.

ఎర్రగా పొడుగ్గా బక్కపలచగా వున్నాడు చలపతి. వొంపు దిరిగిన సన్నని నాజూకైన పెదాలు, పెద్దకళ్లు, మొహంలో సంస్కారం. అతన్ని రిక్షావాడని ఎవరూ వూహించలేరు విడిగా చూస్తే.

పోతప్ప రిక్షా పట్టుకుని అట్లాగే నిల్చున్నాడు, బేరంకోసం చూస్తూ. చలపతి నవ్వు అతని బుర్రను తొలుస్తుంది, అర్థం కాకుండా.

'నువ్వొచ్చి ఎన్నాళ్లైంది?' అన్నాడు.

'ఆర్నెల్లు'

'ఏయూరునుండీ వొచ్చినావు ?'

చలపతి మళ్లీ నవ్వాడు. 'నాకు వూరులేదురా, అన్నా. అన్ని వూళ్లూ నావే. నేను కాటావాణ్ణి' అన్నాడు.

'తమాసగా మాట్టాడుతాడు' అనుకున్నాడు పోతప్ప.

ఆరోజురాత్రికి పోతప్పకి తనింట్లోనే అన్నంపెట్టాడు చలపతి.

ఇల్లు చూసుకుని పెళ్లాం లచ్చుమునీ కొడుకు ఉజ్జప్పనీ తీసుకొచ్చేవరకూ చలపతి యింట్లోనే వుండిపోయాడు పోతప్ప. తన ఖర్చుకిగాను ఎంతోకొంత చలపతికి ముట్టజెప్పుదామనే అనుకున్నాడు.

ఈవారం రోజుల్లో చలపతిని గురించి కొంతవరకూ తెలుసుకున్నాడు. అతను ఎక్కణ్ణుంచీ వచ్చాడో తెలియలేదుగాని చాలా వూళ్లు తిరిగినట్టూ, ఎన్నోరకాలపనులు చేసినట్టూ ఆర్నెల్లక్రిందట పెళ్లాన్నీ మూడేళ్లకూతుర్నీ తీసుకొని యీ పట్టణానికి వచ్చినట్టూ తెలిసింది. బ్రిడ్జిదగ్గర బంకు అంగట్లో రోజూ న్యూస్ పేపరు అడిగితీసుకుని చదువుతాడు. రిక్షా బేరాల్లో ఖరాఖండీమనిషి. తాను చెప్పిన బాడుగ అవతలిమనిషి యిస్తేనే తీసుకెళ్తాడు. రెండోబేరం లేదు. ప్రొద్దుట్నుంచీ రూపాయిడబ్బులు కళ్లజూడనినాడుకూడా దిగిరాడు. ఎంత చెప్తే అంతే. అట్లాంటి మనిషి! కాకా అంగట్లోనూ, కూరలమ్మికాడా, శెట్టికొట్లోనూ, పెరుగాయమ్మ దగ్గరా— అన్నిట్లో ఖాతాలున్నాయి. ఉన్నప్పుడు డబ్బుపారేస్తాడు. లేనప్పుడు అప్పు తీసుకుంటాడు. అందరితో సరదాగా మాట్లాడుతాడు. ఎవరిదగ్గర వారి భాష మాట్లాడినా, అతని సొంతభాష చదువుకున్నవాళ్ల పుస్తకాల భాషే. రాజకీయాల గురించీ సమాజంలోని స్థితిగతుల గురించీ ఉపన్యాస ధోరణిలో మాట్లాడటం అతనికి అలవాటు.

"మర్యాద అభిమానం అంటావు, ఆదేదో గొప్ప విషయం లాగా! అవన్నీ పాతకాలం ఆలోచనలన్నా. నీ సంగతే తీసుకో. మీవూరి షావుకారు ఏంజేస్తున్నాడు? సమయానికి ఎరువులు కొనలేకపోతే పడిన శ్రమంతా దండగౌతుందని పేదరైతులు క్రిందామీదా అవుతుంటే, సమయంచూసి పీకనొక్కమన్నట్టు మార్కెట్టు రేటులో సరిగ్గా సగం ఖరీదుకు నీ పంటంతా కొలవమనో, నూటికి నూటయిరవై వడ్డీయిమ్మనో అప్పులిస్తాడు. విధిలేక తీసుకుంటారు మీరు. కడుపుకట్టుకుని ఒళ్లు కరిగించుకుని డబ్బుచేర్చి ఆ షావుకారుకిచ్చి 'సమయానికి ఆయనే అడ్డుపడకపోతే ఏమైవుందును' అని గౌరవిస్తారు. కర్కోటపు ముండాకొడుకులు బాగుపడుతున్నారు; మానం మరేద అనుకునేవాళ్లు అడుక్కుపోతున్నారు. అవునా, కాదా? ఎందుకు యిట్లా జరుగుతున్నదంటావు? మీరు కాలం మారుతున్న విషయం అర్థంచేసుకోలేదు, అందుకు! ఈ కొత్తపద్ధతిలో మనుషులులేరు. డబ్బువుంది. డబ్బేదేవుడు. అది ఎవరి దగ్గరుంటే వాళ్లే గొప్పవాళ్లు. మనిషి, మంచితనం, నీతీ, నిజాయితీ—యివన్నీ లేవు. డబ్బు సంపాదించాలి. ఇంకా, ఇంకా సంపాదించాలి. అదే యీ కొత్త సమాజపు లక్షణం, లక్ష్యం.

'ఇప్పటి పరిస్థితుల్లో నిజంగా పనిచేసేవాడికి గుర్తింపు లేదు. సమాజం వాళ్లమీద ఆధారపడి నడవటంలేదు. పనిచేసేవాడు బ్రతకలేక బాధపడుతూవుంటే, సోమరులూ మోసగాళ్లూ అవినీతిపరులూ యింకా యింకా సంపాదించేద్దామన్న మోసాల కుమ్ములాటలో కష్టపడేవాళ్లని పురుగులకంటే హీనంగా నలిపేస్తున్నారు.

'నేనూ ఒక మనిషినన్న అభిమానంతో రేపటిమీది ఆశతో మనిషి ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోగలడు. కాని యిప్పటి పరిస్థితులు మనిషిలోని మూలాన్ని అభిమానాన్ని నేనూ ఒక మనిషినన్న జ్ఞానాన్ని తుడిచిపెట్టేస్తున్నాయి. సామాన్య మానవులు అవినీతి చేతిలో ఆటబొమ్మలై ఆత్మవిశ్వాసంకోల్పోయి బియ్యంమూటలోని తుట్టపురుగుల్లాగా దొంగ బతుకులు బతికేస్తున్నారు. విశాలమైన యీ ప్రపంచంలో బ్రతకటానికి అందరికీ హక్కు వున్నదన్నమాట మరచిపోతున్నారు.

'తాగి, పేకాడి, మంచీ చెడూ లేకుండా, ఈ క్షణం గడిపెయ్యడానికి ఏ దుష్కార్యానికీ వెనుదియ్యని వాళ్లని కాటావాళ్లంటున్నారు. ఇప్పటి పరిస్థితులు సామాన్యులందర్నీ కాటావాళ్ళుగా మార్చేసేట్టున్నాయి.

'ఇది కష్టపడేవాళ్ల సమాజంకాదు. సుఖపడేవాళ్లదీకాదు. ఇది నశించి పోయేది!..."

చలపతి ఆలోచన ఆవేదన పోతప్పకు అర్థంకావు. 'మడిసి మంచోడేగాని, రొవంత తిక్క' అనుకున్నాడు పోతప్ప.

వారంరోజులకి కొత్తూరులోనే నెలకి అయిదురూపాయిల అద్దెకి ఒక కొట్టం దొరికింది పోతప్పకి పల్లెకుబోయి రెండెకరాల

పొలం గుత్తకిచ్చి లచ్చుమునీ ఉజ్జప్పనీ తీసుకొచ్చేశాడు.

మెల్లగా పరిసితులు గ్రహింపుకు తెచ్చుకున్న లచ్చుముకి గుండె బేజారైంది. 'మావా, యీ రిచ్చాదొక్కి బాగుపడ్డోడు లేడంట. ఆకరికి టీబీ ఆస్పత్రికెల్లాల్సిందేనంట. ఎంతమందో రిచ్చాదొక్కేవోల్లు రగతం కక్కుకోని టీబీ అస్పత్రిపాలైనారంట. ఇంగేదవ్వాపనిసూడు' గోలెత్తింది.

'యాపని సేసేది ? అన్నీ అంతే. గవన్మెంటు పనులైతే నెలజీతం వొత్తది. సిన్నపనిగ్గూడా అయిదొందలు ఎ య్య లంచం పోత్తేనే పని. లేకుంటే లేదు. ఎంప్లాయిమెంటు ఆపీసోడి దెగ్గిర్నుంచీ పనిచ్చే దొరదాకా అందరికీ పొయ్యాలి. మనకట్టం అక్కర్లేదు గవన్మెంటోడికి. లంచంకావాలి...పోన్నే, యీ రిచ్చానే మనకి శాశివితవా? ఒంటో సత్తవవుంది గనక యిప్పటికి అప్పులు దీర్చుకోని, యింగా అంతబూవి గొనుక్కోనో పదిజీవాలు జతజేసుకునోమనూరెల్లిపోదాలి' అన్నాడు. ముందు అప్పుగ్గట్టి... దేనికైనా దుడ్డుకావాలి! దుడ్డు!

ఒచ్చిన్నాడు పదిరూపాయలు వచ్చింది. రానినాడు రెండు రూపాయిలే మిగిలింది. వేడి నీళ్లకు చన్నీళ్లుతోడు అన్నట్లుగా తనూ తమలపాకులగంప ముందుపెట్టుకుని బ్రిడ్జిక్రిందకూర్చుని రోజుకు రూపాయో రెండో తెస్తున్నది లచ్చుము. ఇట్లా మెల్లగా కొత్త జీవితంలో స్థిరపడ్డారు వాళ్లు.

## 2

పట్నానికి దక్షిణపు కొసన రైలుమార్గందాటితే కొత్తవూరు అంటారు. మొదట్లో అది ఒక ముచ్చటగొలిపే కాలనీ. కాని రైలు పట్టాలమీదుగా బ్రిడ్జి కట్టినప్పటినుండీ దాని ప్రత్యేకత మాసిపోయింది. ఎత్తుగా దర్పంగా ఏర్పడ్డ బ్రిడ్జి ప్రక్క పేదగా కళ తప్పి నిలిచింది.

నాలుగడుగుల మందపువి, గట్టి సిమెంటుగోడలు, రైలు లైనుకీ యీ ప్రక్కవదీ ఆప్రక్కవదీ ఆబ్రిడ్జిని ఎత్తిపట్టి మోస్తున్నాయి. గోడకీ గోడకీ నడుమ పదడుగుల సందు. ఇల్లూవాకిలీలేని బీదా బిక్కిజనం ఆసందుల్లో తడికలడ్డంపెట్టుకుని చెదపురుగుల్లా చేరిపోయారు. నిజమైన బలమైన గోడలు! నిజమైన కప్పు! కలలోకూడా ఆశించని అదృష్టం! పెద్దక్రపెట్టెల బంకుల్ని పెట్టుకుని పగలు వ్యాపారం సాగించుకొంటూ రాత్రికి నాటి వెనక బ్రతుకు గడుపుకునే చాకళ్ళు, మంగలి, ఇడ్లీల రాజమ్మ, కళాయి పనిచేసే దూదేకుల మస్తాను, సారా అంగడి, ఇతర చిల్లర వ్యాపారస్తులు ఆజనాభాలో వున్నారు. వీళ్ళు కాకుండా పదిహేను రోజులూ నెలా గడుపుకుపోయే జనమూ చాలామంది వుంటారు. రెండు తడికెల సహాయంతో అక్కడ సుఖంగా నిలబడదామని వారం వర్షం లేకుండా ఏ క్షణాన్నో వచ్చి దిగుతారు ఒక్కో కుటుంబం... ఒక గుడ్డపేలికల మూట, ఒక సంచీ, రెండు కుండలూ' ఒక లోటా, నీళ్లు ముంచుకునే డబ్బా తెచ్చుకుంటారు. ఎంత అకస్మాత్తుగా వచ్చారో అంత అకస్మాత్తుగా నామ రూపాలు లేకుండా మాయమైపోతారు. ఒక రోజున లుకలుకలాడి పోయిన సందు మర్నాడు ఖాళీగా శుభ్రంగా వుంటుంది. వాళ్ళు ఎందుకు వచ్చారో, ఎలా బ్రతికారో, ఎందుకు వెళ్లిపోయారో ఎవరికీ తెలియదు. పట్టించుకోరు.

ఇతర వ్యాపారస్థులతోపాటు బేరంకోసం ఎదురుచూసే రిక్షావాళ్ళూ ఆ బ్రిడ్జి నీడలోనే నిలుస్తారు. బారెడెత్తు నల్లని విగ్రహం కాయకష్టంతో కండలు తిరిగిన ఒళ్లు, పట్టుదలతో బిగుసుకున్న దవడలు నవ్వటానికి ఉబలాటపడుతూ మెరిసే చిన్న గుంటకళ్ళు, నూనెపట్టి దువ్విన నిగనిగలాడే క్రాపు, కట్‌బనీనూ, ఖాకీనిక్కరూ— వాడే పోతప్ప. ఆర్నెల్ల నుంచీ ఆ బ్రిడ్జీ క్రిందే రిక్షా ఆపుకుంటున్నాడు. కొత్త వూరిలోని గృహిణులు ఎక్కడికైనా వెళ్లవలసి వచ్చినప్పుడు 'బ్రిడ్జికింద పోతప్ప రిక్షా పిలుచుకురా' అంటున్నారు. స్టోరువాళ్ళు రేషను కార్డువారికివ్వకుండా దొంగగా అందించిన చక్కెర. గోధుమలు, రవ్వా, మైదా, బియ్యం వగైరాలను చురుగ్గా అమ్మిపారేసి లాభంలో వాటా పుచ్చుకుంటున్నాడు. కాలనీలో వాళ్లకి ఎన్నో విధాలా చిన్న సహాయాలు చేస్తూ మంచినమ్మకస్తుడని పేరు తెచ్చుకున్నాడు. లాడ్జీలకి ఆడవాళ్లని తీసుకెళ్తే ఎంత డబ్బు గుంజ వచ్చో, బేరం అడగడం నామోషీ అయి ఎక్కువ డబ్బులు పారేసే మారాజులెవరో కనిపెట్టాడు. ఇట్లా పట్నం పోకడలన్నీ అర్థమైనా టెర్లిన్ చొక్కాలు, వాచీ, మెడకి కర్చీపు ఆఖరికి కాకా అంగట్లో టీ నీళ్ళు కూడా అలవాటు చేసుకోలేదు. మట్కా కట్టలేదు. మూడదఫాలు పల్లెకుపోయి ఎనిమిదినూర్లు షావుకారికిచ్చి వచ్చాడు.

స్టోరువాళ్ల వస్తువులు పోతప్ప అమ్మిపెట్టటం చలపతికి సరి పడలేదు. గట్టిగా మందలించాడు. "మా కార్డుమీద పది కిలోల బియ్యం యివ్వమని నా భార్య వెళ్తే, గోడౌన్‌వాళ్లు బియ్యం తక్కువి

చ్చారు. అయిపోయిందే' అన్నాడు. అమ్మటానికి నీకు మూట బియ్యం యిచ్చాడు. ఆహా ఎక్కిర సంగతి చెప్పనక్కర్లేదు. నీ అయిదు రూపాయల లాభం నువ్వు చూసుకుంటున్నావు గాని అది ఎక్కణ్ణుంచీ వస్తున్నదినే? నీలాంటి నాలాంటివాళ్ల ఆకలిలో నుంచీ 'ఏడుపుం సుంచీ వస్తున్నది. తాసిల్దారుతోచెప్తే' ఆ స్టోరువాళ్ళు చాలా మంచివారే! 'ఏమీ కంప్లైంటులేదే' అని ఆశ్చర్యపోతాడు, తన వాటా తీసుకుని. పైనుంచీ కిందిదాకా అందరూ దొంగలే అయిపోయారు ఈ దేశంలో.

'మా వీధిలో పాలమ్మే ఒంటికంటి గంగమ్మ సంగతే తీసుకో. ఒక ఎనుముని వాకిటి ముందు కట్టేసుకుని' పాలపొడిపాలు రోజుకి పదిహేను లీటర్లు అమ్ముతూ పది రూపాయల వడ్డీకి ఆరువేలు తిప్పుతున్నది. పిల్లలకు పాలుకలిపి పొయ్యమని 'ఏ దేశంవారో ఉదారంగా యిచ్చిన పాలపొడిని చాటుగా అమ్ముకుంటున్న పంతులమ్మ కొడుక్కి డాక్టరుసీటు కావాలని అయిదువేలు లంచం యిచ్చింది. ఆ పాలతో బాగుపడివుండవలసిన వచ్చుపిల్లవాడికి రోగం వచ్చినప్పుడు వాడి అబ్బ యాభై రూపాయల లంచం యివ్వలేదని ఆస్పత్రిలో చేర్చుకోని డాక్టరు బాత్‌రూమ్ గోడల్లో మూడు లక్షలు దాచాడు. ఆ రోగం నుంచీ ఎట్లాగో బయటపడ్డ ఒక్క పీనుగులాంటి పిల్లవాడు పరీక్షల్లో కాపీచేసి పంతుల్ని కొట్టే దొంగనోట్లు మార్చేవాళ్ల తోనూ దొంగసారా కాచేవాళ్లలోనూ చేరిపోయాడు. ఆ సారా తాగటానికి డబ్బులేక తనకలాడుతున్న పదిమందికలిసి ఒక పొరుగూరి వాడిని చంపి జేబులోడబ్బు కొట్టేశారు. చీకట్లో ఒంటరిగా వెళ్తున్న ఆడపిల్లను చెరిచి చంపిపారవేశారు... కాటా వాళ్లు అంటావు. వాళ్లను ఎవరు తయారు చేస్తున్నారో చెప్పు!.

నీవు కూడా పోతప్పా! నీవూ నీలాంటి గొర్రెలూను. తాము ఏమిచేస్తున్నారో తమకే తెలియని గొర్రెలు! డబ్బూ అధికారం ఎక్కడుంటేవాళ్లకు దణ్ణాలు పెట్టే గొర్రెలు! ఒక మంత్రి అరవై లక్షలు కట్నమిచ్చి కూతురిపెళ్లి చేశాడు; ఒక ఆఫీసరు ఆరొందల జీతగాడు నెలకు రెండువేలు ఖర్చుపెడుతూ రెండొందల ఎకరాలు సంపాదించాడు; ఒక మామూలు పోలీసు అంతటి మేడకట్టాడు అంటే ఆహా ఓహో అని ఆనందపడిపోయే గొర్రెలు!...''

పోతప్పకి చాలా కోపం వచ్చింది. ''నువ్వు బతకలేవు. ఎవరన్నా బతుకుతుంటే ఊరుకోలేవు! లెచ్చర్లు దంచుకోవాలంటే దంచుకో. అయితే మాటలు జాగ్రత్తగారానీ. గొర్లు గొర్లు అంటే మరేదా గాదు' అన్నాడు.

చలపతి నవ్వాడు. మరీ అంతకోపమైతే ఎట్లాగన్నా. కాస్త విను... మనం ఏంచేస్తున్నామో మనకే తెలియటంలేదు, అదే పెద్ద ఆపదగా వున్నదన్నాను. కావటంవా ఆలోచించుకొని చెప్పు!

'సమాజంలో మనిషి మనిషిగా బతకాలంటే తిండి ఎంత ముఖ్యమో, చదువూ అంతముఖ్యం. తిండిలేని వాడికి బానిసత్వం తప్పదు. చదువులేనివాడు వచ్చిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోలేడు. ముఖ్యంగా నిర్దిష్టమైన విలువలులేని కాలంలో చదువులేని సామాన్యుడు అయోమయంలో కూరుకుపోతాడు...

చదువంటే యీ పుస్తకాల చదువులుకాదు. మనిషిని మనిషిగా నిలబెట్టగల చదువు. నేనెవరు? నాకేంకావాలి? నాచుట్టూ ఏం జరుగుతున్నది? నా పరిస్థితి ఏమిటి? నేనేం చెయ్యాలి? అన్న ఆలోచన పుట్టించే చదువు. సమాజం యొక్క మంచిలో తన మంచి ముడిపడివున్నదన్న జ్ఞానం కలిగించేది. అందరం కలిసే పైకిగాని పోలేమన్న సత్యం గ్రహింపుకు తెచ్చేది–ప్రతి ఒక్క మనిషి మంచి చెడ్డలకూ సమాజంలోని ప్రతిమనిషికీ బాధ్యత ఉన్నదనే మూల సత్యాన్ని కొంతవరకైనా గ్రహింపజేసేది...''

చలపతి మాట్లాడుతూ వుండగానే పోతప్పలేచాడు. వెళ్తానని చెప్పనైనా చెప్పకుండా వెళిపోయాడు.

ఎవరి తెలివి వారిది. ఎవరి బతుకు వారిది పేపరు. చదివే వోళ్లంతా వూరోళ్లకి నెత్తురులేదని ఆగుడుజెత్తన్నారా? ఈయిప్ప సావాసం చాలుసామి' అనుకున్నాడు.

## 3

వారం రోజులు చలపతి ముఖం చూడలేదు పోతప్ప. బ్రిడ్జి దగ్గర రిక్షా ఆపుకోలేదు. ఒకరోజున పోతప్ప ఆగిన చోటికి చలపతి వచ్చాడు. 'చాలా కోపంగున్నావే' అని నవ్వాడు. ఆ నవ్వుచూస్తే పోతప్పకు మండుకొచ్చింది 'ఎంత చదువుకున్నోడికైనా గొప్పోడి అంతలావు పొగరు పనికిరాదు' అన్నాడు వెటకారంగా. 'నను గొప్పోడి ననుకుని 'ఏమీ మాట్లాడటంలేదు. ఎంత హీనంగా వున్నానో తెలుసుకున్నానే యిన్నాళ్లూ ఉపదేశించుకున్నాను' అన్నాడు చలపతి. 'మాటలు చేపొట్లిలా పుగాని వాటి పసుంది పోదాం' అన్నాడు పోతప్ప.

'అన్నెల్లబటీ నువ్వు నాకు అన్నదమ్ముడిలాగున్నావు ఇప్పుడు కోపం చేసుకోవద్దు. రిక్షా యిచ్చినాక రాత్రికి మాయింటుక రా' అన్నాడు చలపతి.

వెళ్దామా వొద్దా అని ఆలోచించుకున్నాడు పోతప్ప, ఆలోచన తెగకుండానే అన్నం తిని చలపతి యింటికి వెళ్ళాడు.

ఇద్దరూ మూసేసిన పార్కు ముందరి దిమ్మెమీద కూర్చున్నారు. తానుగా ఏమీ మాట్లాడకూడదనీ, చలపతి సమాజం గురించిన ఉపన్యాసాలు ఎత్తుకుంటే నోరు మూయించాలని పట్టుదలగా ఉన్నాడు పోతప్ప. కొంచెం సేపు ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

'పకీరప్ప మేస్త్రీని చూశావుగా...మా నాన్న అచ్చంగాఅట్లాగే వుంటాడు' అన్నాడు చలపతి.

ఖాకీ చొక్కా ఖాకీ పాంటూ వేసుకొని తలచుట్టూ మఫ్లరు చుట్టుకుని చేతులు వెనక్కి కట్టుకుని రోడ్లాడ్డే వాళ్ళని అజమాయిషీ చేస్తూ తిరుగుతూ వుంటాడు పకీరప్ప పొద్దున్నే. ఆకలి వంటలో పొగచూరిపోయినట్లు నల్లగా నిటారుగా మసిపూసిన వెదురుబద్దలాగా వుంటాడు ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు. టపటప కొట్టుకులాడుతాయి కనురెప్పలు. - దేన్నో వెనక్కి తోసేసి దాచిపెట్టాలని ప్రయత్నిస్తున్నట్లు. మఫ్లరు కిందనుంచీ నల్లని మొహంమీద పడుతున్న బూడిదరంగు జుట్టు ప్రాణమున్న మనిషికి సంబంధించినదిలాగా కనబడదు. మంగలి షాపులో కత్తిరించి పారేసిన దాన్లా వుంటుంది. ఆ పకీరప్పలాంటి మరో పకీరప్పకు ఈ చలపతి కొడుకని ఊహించడం కష్టం.

'మాది ఏవూరని అడగొద్దు. మాది పెద్ద కుటుంబం. మా అవ్వ. అమ్మ. నాన్న, ముగ్గురు కొడుకులూ, ఒక కూతురూను. మా నాన్న కాలేజీలో స్వీపరుగా ఇరవై యేండ్లు పనిచేశాడు. ఇంకా చేస్తున్నాడేమో. దినదినగండం నూరేళ్ళాయుస్సు ఉద్యోగాలవి. ఎదుగూ బొదుగూలేని జీవితం. ఎన్నేళ్ళు ఎంత పనిచేసినా ప్రిన్సిపాలు ఏనిమిషాన్నైనా ఉద్యోగం పీకేసి యింటికి పంపించవచ్చును... ఆ ఉద్యోగం గురించి అప్పుడు పిల్లలం మాకు తెలియదుగాని, మానాన్న యింట్లో పులి అనుకో. అంతా సిస్టమ్ ప్రకారం జరగాలి. తప్పటానికివేల్లేదు. అంత స్ట్రిక్టుగా వుండేవాడు. ప్రొద్దునే అందరం చద్దీ తినాలి. మళ్లీ ఒంటిగంట కొట్టేనే అన్నం. పది నిముషాలు కూడా ముందు పెట్టకూడదు. మళ్లీ రాత్రి ఎనిమిది గింటలకే. పది గంటలకు అందరూ పడుకోవాల్సిందే. ఆదివారం పిల్లలందర వూరి బయటికి వెళ్ళి వారానికి సరిపడా పొయిలోనికి కంప తీసుకురావాలి. శనివారం అందరం తలకి నీళ్ల పోసుకోవాలి. అబద్ధం, దొంగతనం అన్న మాటలు చెవిన పడకూడదు. ఎవరన్న అబద్ధం చెప్పినట్లు తెలిస్తే తోలు ఒలిచేస్తాడు. పండగనాడు తప్పించి సినిమా లేదు. కాలేజీలో పార్టీ లున్నప్పుడు మేం ఎంత సంబరంగా ఎదురుచూసేవాళ్లమో! మా నాన్న వచ్చేవరకు కాచుకొని వుండేవాళ్లం. ఒక్కోనాడు మైసూర్ పాక్ ముక్కలు, బూంది, కారాలూ, పకోడీలూ అరటిపండ్లు ఏవైనా తెచ్చేవాడు. అందరం కూర్చుని ఎంత ఆనందంగా తినేవాళ్లమో! దసరాలో పండగ ఈనాములు తెచ్చేవాడు. ఆ డబ్బుల్తో తలోజతా బట్టలు కుట్టించేవాడు, ఆ సంవత్సరానికి. అబద్ధం ఆడటం, మోసం చేయటం ఒకరికి తలొంచటం మాకు తెలియదు. పట్టుదల, క్రమశిక్షణ బాగా తెలుసు. అట్లా పెరిగాం మేము. ఒక పద్ధతి ఒక న్యాయం జీవితాన్ని శాసిస్తున్నదన్న విశ్వాసం అందులో కష్టపడి పనిచేస్తూ సుఖంగా నిలువగలమన్న ఆశ నాలోని మూలం అయింది. ఏంతిన్నాం, ఎంతతిన్నాం అన్నది ముఖ్యం కాలేదు. మాకు ఏ మంచి తిండి లేకపోయిందో, ఏ గొప్ప అవకాశాలు లేకుండా పోయాయో అన్న చింత మాలోవి భాగం కాలేదు. ఏది యివ్వబడిందో దానిలో బ్రతికాం. యివన్నీ అప్పుడు నేను ఆలోచించుకోలేకపోయినా జరిగింది అది.

మా అన్న బి. ఏ. రెండో సంవత్సరంలో వున్నాడు. నేను యస్. యస్. యల్. సి. మంచి మార్కులతో పాసై పి. యు.సిలో చేరాలనుకుంటున్నాను. అప్పుడు కాలేజీలో స్వీపరుపని ఖాళీ పడింది. అన్ని వస్తువులకీ ధరలు పెరగడంతో యింట్లోజరుగుబాటుకష్టంగా వుంది. నెలకోసారి తినే మాంసం చేపల్లాంటివి ఒదిలేశాం, కొనలేక. పాలు. పెరుగు, గుడ్లు అన్నవి మాకు ఎప్పుడూ లేవు. ఇప్పుడు పచ్చిమిరపకాయలు, వంకాయలు,ఆకుకూరలు మాత్రం యింటికి తెస్తారు. అవి కొనటమే కష్టంగా వుంది. పప్పు పదార్థాలు అందకుండా పోయినై. పులుసులోకి తాలింపు మానేశాం, నూనెధర పెరిగాక.... నెలాఖరు వస్తుంటే ఒంటిపూట భోజనం, రెండోపూట రాగిగంజి అప్పుడు స్వీపరుపనిలో నన్ను చేరమని మానాన్న చెప్పాడు. 'ఈ కాలంలో బి. ఏ. చదివినా ఈ స్వీపరు పని కూడా దొరకని వాళ్లు వున్నారు. వుద్యోగాలు దొరకడంలేదు. ఇప్పుడు యిందులో చేరితే నిమ్మళంగా ఎటెండర్‌గా స్టోరుకీపరుగా, గుమాస్తాగా-యింత తెలివి

గలవాడివి నీ అదృష్టంకొద్దీ యింకా పైకే వెళ్తావు' అన్నాడు. అప్పుడు నాకు పదహారేళ్ళు. మా అన్నకు ఇంకో ఏడాది కష్టపడితే బి. ఏ. అవుతుంది. కాబట్టి నేను పనిలో చేరాలి. ఆఫీసు గుమాస్తాలు అయ్యవార్లు, ప్రిన్సిపాలు, ఎంప్లాయిమెంటు ఆఫీసు–అందర్నీ మంచి చేసుకుని అడుక్కొని ఆపని నాకు వేయించాడు. కొడుకు చేతికి అంది వచ్చాడని సంతోషించాడు.

మొదట నాకేమీ అనిపించలేదు. కాని కాలేజీ తెరిచాక మా స్కూల్లో నా కంటే తక్కువ మార్కులు వచ్చిన వాళ్ళు అదే కాలేజీలో చదవటానికి వస్తుంటే, నేను వాళ్ళు కూర్చునే కుర్చీలు బల్లలు దులపటం ఊడవటం మంచినీళ్ళందివ్వటం చాలా కష్టమనిపించింది. ఎవరితో చెప్పకోలేను. ఏమీ చెయ్యలేను. 'సరే' మేం పేదవాళ్ళం. పేదగాపుట్టాం. కాదనుకుంటే మారిపోతుందా?' అనుకున్నాను. అయినా నా గుండెలో కనపడని గాయం ఏర్పడింది. తిండికి జరగని వాళ్ళకి 'సమానత్వం; స్వాతంత్ర్యం' అనేవి ఉత్తమాటలు!.

ఇదివరలో నాతో చదివిన ఒక హరిజన విద్యార్థికి ఈ కాలేజీలో స్కాలర్‌షిప్పు వచ్చింది. అట్లా వచ్చినవాళ్ళు పావలా అరా సీపర్లు అడిగితే యివ్వటం మామూలట. ఆ అబ్బాయిని పావలా యిమ్మని వెంట వెళ్ళాడు మా నాన్న. 'నేను మాదిగోణ్ణని గవర్నమెంటువాళ్ళు నాకీ డబ్బిచ్చారు. నా కంటే కనాకష్టపువాడివా, నన్నడగటానికి ?' అనేసి యివ్వకుండా వెళ్ళిపోయాడు. అది చూచిన నాకు మా నాన్నమీద చాలా కోపం వచ్చింది.

ఇంతలో దసరా యినాముల కోసం వేట ప్రారంభమైంది. స్టూడెంట్ల దగ్గర, లెక్చరర్ల దగ్గర చిన్న ఉద్యోగులు అడుక్కుంటున్న తీరు చూశాను. ఇతరులకు ఏదైనా అందించటమే మహద్భాగ్యం అనుకున్నట్లు వాళ్ళ నోట్లోంచీ మాటరావటమే తడవుగా కాళ్ళకు కాళ్ళు కొట్టుకుంటూ పరుగెత్తి పనులు చెయ్యటం చూశాను. మా నాన్నను ఆ పరిస్థితిలో చూడటం నాకు షాక్ అయింది. మా బ్రతుకు యింకో రకంగా కనిపించింది. అసలు మా నాన్న జీతంలో ఇంత కుటుంబాన్ని ఎట్లా జరిపాడు?. కడుపుకట్టుకుని — ఒక సినిమాలేదు, ఒక బీడీలేదు, టీ నీళ్ళు కూడా లేవు — ఏ అలవాటూలేదు. ఎందరి మంచికోసం పాకులాడాడో, ఎందరి కాళ్ళు పట్టుకున్నాడో! ఎందరో విసిరేసిన పావలాలు. స్టూడెంట్ల దగ్గర ప్రాధేయపడి అదిరించి బెదిరించి సంపాదించుకున్న అర్ధాలు, అయ్యవార్ల అవసరాలకోసం పరుగెత్తి పాకులాడి తెచ్చుకున్న రూకలు ఆవిలేకపోతే మేం బ్రతకలేము! మేము చెయ్యవలసిన పని చేస్తున్నాం, మా బ్రతుకు మేం బతుకుతున్నాం అనుకోవటం మనిషి లక్షణం. అయితే మేము కుక్కలం!.

ఒకనాడు నేను యింటికి వెళ్తూ మా నాన్నతో ఏదో చెప్పాలనివెళ్ళాను. అప్పుడే స్టూడెంట్సు పార్టీ ముగించుకొని వెళి పోయినట్లున్నారు. వాళ్ళు వదిలేసి వెళ్ళిపోయిన పళ్ళాలు కప్పులు అక్కడే వున్నై. ఇద్దరు ప్యూన్లు మా నాన్న అక్కడ తిరుగుతున్నారు. సగం కొరికేసిన మైసూరు పాకులు ఒకరికంటే ముందు ఒకరు పోటా పోటీగా చేజిక్కించుకుని జేబుల్లో కుక్కుకుంటున్నారు. మిగిలిపోయిన మిక్చరు కాగితాల్లో పోగుపోసుకుంటున్నారు. గులాబ్‌జామ్ తిన్నపళ్ళాల్లో మిగిలిన చక్కెర పాకమంతా చేరలోకి ఒంపుకుంటూ గబగబా తాగేస్తున్నాడు మా నాన్న. నన్నుచూచి ఠక్కున ఆగిపోయాడు. అంతలోనే సర్దుకొని రారా, నువ్వుకూడా తాగు, మంచి బలపడేస్తుంది అన్నాడు. నాకు మతిపోయినట్లయింది. 'యివాళ కాలేజీలో ఏదో టీ పార్టీ వుందంట. మా నాన్న తీపితెస్తాడు! 'నాన్న ఏంతెచ్చావు, నాన్నా!' పొట్లంవిప్పి తెచ్చినవి మాకందరికీ తుంపి పెడుతున్న నాన్న. పెళ్ళింటి వెనుక పారేసిన విస్తళ్ళకోసం ఎగబడుతున్న కుక్కలు.

ఎవరిమీదో ఎందుకో తెలియని కసి నాలో పెరిగిపోయింది. నేరుగా ప్రిన్సిపాల్ రూమ్‌కి వెళ్ళాను. నేను చేరాక యీ అయిదు నెలల్లో రెండు ప్యూను పోస్టులు ఖాళీపడ్డాయి. ప్రిన్సిపాల్ ద్రాక్ష తోటలో ఆర్నెల్లనుండీ ఉచితంగా పని చేస్తున్నవాడికి ఒకటి ఇచ్చేరు. మూడు వందలు లంచం యిచ్చిన వాళ్ళకి రెండోది యిచ్చారు. మిగతా డిపార్టుమెంటులు యింకా అన్యాయంగా వున్నాయి. ఇంకో ఇరవై ఏళ్ళ తర్వాత ప్యూనుగానో స్వీపరుగానో అచ్చం మా నాన్నలాగా వుంటాను నేను. సందేహంలేదు. ఒక ఖాళీలో నన్నెందుకు వెయ్యలేదని ప్రిన్సిపాల్‌ను ఘాటుగానే అడిగాను మాటా మాటా పెరిగి ఆ వుద్యోగానికి రిసైన్ చేసివచ్చేశాను. ఏమిరా, ఇంట్లో అందరం బ్రతికి వుండాలని లేదా నీకు ? బంగారమంటి ఉద్యోగం పోగొట్టి అందర్నే చంపేసి వి గదరా అని యింటిల్లపాదీ ఘోష పెట్టారు. అప్పుడు యింట్లోంచీ రావటం మళ్ళీ వెళ్ళలేదు... అన్నాడు చలపతి.

'మరి పెళ్ళి' అడిగాడు పోతప్ప.

'పెళ్ళా?' నవ్వాడు చలపతి. 'నాతోపాటు కష్టపడగల కూలి

పనిచేసే సావిత్రిని నేనే చేసుకున్నాను. ఏమి కులమని పట్టించుకుండా గుళ్ళో తాళి కట్టాను.'

'పెద్దోళ్ల మాట యిని యింటోవుంటే వాళ్ళు అన్నీ చూసి చేత్తారు. మరి నీవు బేటి కొచ్చేత్తివి...' సానుభూతితో అన్నాడు పోతప్ప.

'ఇప్పుడు నాకేం తక్కువ ? సావిత్రికేం తక్కువ ?' నవ్వుతూ అన్నాడు చలపతి.

'ఇప్పుడేం తెలుత్తుంది ? ముందుకి గదా తెలిసేది ! ఇల్లు, వూరు, కులం, అయినోల్లు అన్నిటినీ యిడిసేత్తే యింగమడిపేంది... నీ అదురుష్టం బాగులేదు. అంతే...'అన్నాడు పోతప్ప ఖచ్చితంగా.

'మా నాన్నలాగా వుంటే ఫర్వాలేదంటావు ! బ్రతకలేక, చావలేక నేనూ మనిషినే అనుకునే కుక్కలాగా!....'

'నీకు ఆలోచనలు జాత్తి అన్నా, మీ నాయనలో నాకేం తప్పు కనపడలా. కాలాన్ని బట్టి సర్దుకోవాల్సి వత్తుంది మీ నాయన ఏం జేసినాడు? ఒకరికి అప్పు ముంచేసినాడు? తలకాయలు దీసినాడా? తాగినాడా? జేలుకి బోయినాడా?... మరేదాగా బతుకుతున్నాడు. కాలం బాగా లేదులే. బ్రమ్మయ్యగారు చెప్పలేదా? వీరబోగవసంతరాయలు అప్పుడే పుట్టి బూమి అడుగున విద్దె నేర్చుకుంటున్నాడంట. ఆయన వత్తే కలికాలం ఆకరయిపోతది. సత్తెవంతులు ఒత్తులై నిలుత్తారు. తతిమ్మా జనం నాశనమైపోతారు... పోతప్ప లేచాడు.

'సత్యం ఏది? సత్యవంతులు ఎవరు...'

ఇద్దరూ యిండ్లకు బయలుదేరారు.

'రావంత తిక్క. అంతే' అనుకున్నాడు పోతప్ప.

## 4

ఒకనాడు చెప్పాపెట్టకుండా పోతప్ప చెల్లెలు బేరమ్మ,మొగుడు అంజనప్ప ఆరుగురు పిల్లలో వచ్చి దిగారు, పట్నంలో బతుక్కుందామని. వాళ్ళరాక పోతప్పకి సరిపడలేదు. అంజనప్ప సోమరి, తాగుబోతు. అట్లాంటి వాళ్లంటే పోతప్పకి అసహ్యం. అయినా పైకి ఏమీ అనలేదు. అంజనప్ప వూళ్ళోకి వెళ్లి తిరిగి పని దొరకలేదంటూవచ్చి తిని ఎటో పోయేవాడు. పని దొరికిననాదు అసలు రాలేదు.. బ్రిడ్జిఅవతల చిన్న యింట్లో కనిపించాడు. ఆక్కడ కాటా వాళ్ళు చేరతారు. తాగుడు, పేకాట. అందులోనే మట్కావాడు. వాళ్ళకి రాత్రీ పగలూ లేదు. ఎప్పుడూ కీచులాటలు. అంజనప్పని అక్కడ చూచిన పోతప్ప నిప్పు తొక్కిన కోతిలాగా యింటికొచ్చి పడ్డాడు.

'ఏమిటిగా మీకీవూరొచ్చింది? బతుక్కోటం, బాగుపడటం మీకు ఎప్పటికీ లేదు. ఆడు అసలే తాగుబోతు. ఈడ కాటా నాకొడుకుల్తో సేరి జేలు పాలౌతాడు' అన్నాడు బేరమ్మతో.

బేరమ్మకి మాట పడటం అలవాటులేదు. 'ఆడ నాకు కూలి వున్ననాడుండె, లేన్నాడు లేకపోయె. తిండికి జరక్క ఏవైతేకానిమ్మని ఎల్లొచ్చేసినం. ఎల్లగాలం నీమీందనేబడి తింటామనుకుంటివా ? మా బతుకు మేవే బతుక్కుంటంగాని' అన్నది కోపంగా.

ఆరోజే రెండు తడికెలు తెచ్చుకున్నారు, బ్రిడ్జి క్రింద చేరటానికి. దానికి పోతప్ప అడ్డం చెప్పాడు· 'ఆడ మరీ అన్నాయ పోల్నంటారు. అంతగా మానం, మరేదా యిడిసేసినావా ? ఇంగా నానాల్నండు. అంగిడో యాడో సూసుకుందం' అన్నాడు.

'తిండి జరగనోల్లకి మానం మరేదా యేంది !' అని సాపా బొంతా యెత్తుకుని వెళ్ళిపోయారు.

రెండు రోజులు బేల్దారీపనికెళ్ళి తరువాత పని దొరకలేదని ఉండిపోయాడు అంజనప్ప. పోతప్ప సాయంలో బేరమ్మ బ్రిడ్జికిందే యింటిముందర కూరగాయల బేరం పెట్టుకుంది. ప్రక్కనే పొయ్యి పెట్టుకుని వేడి బజ్జీలువేసి అమ్ముతుంది. ఎట్లాగో పస్తులు లేకుండా నెట్టుకొస్తున్నది. అంజనప్ప సంపాదించింది తనే తాగేస్తాడు. నెల తిరిగే సరికి ఈ రకంగా స్థిరపడి పోయారువాళ్ళు.

ఎవరితోనూ చెప్పకుండా వూళ్ళోంచి మకాం ఎత్తేశాడు చలపతి. ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు. ఒంటికంటి గంగమ్మ దగ్గర పదకొండు రూపాయిల వడ్డీకి రెండుదఫాలుగా ఎనిమిది వందలు అప్పుతీసుకున్నాడట. దానిమీద ఒక ఎనిమది వందలదాకా వడ్డీ కట్టాడు. ఇంకా వెయ్యిదాకా బాకీ యివ్వాల్సి వుందట. ఇదికాక పాల బాకీ నలభై వున్నదట. ఆవిడ రంకెలు వేస్తోంది. కాకావానికీ పెరుగమ్మికీ వెళ్ళే ముందురోజునే బాకీ యిచ్చేశాడట. ఇంటద్దె పదహారు రోజులీ, శెట్టి అంగట్లో పందరూపాయిలదాకా యివ్వలేదట.

'లోకమంతా సెడపోయిందని, పరాష్మతు సెయ్యాలన్న

కబుర్లు సెప్తాడు. ఆకిరీకి అప్పులు ముంచేసి, పూపిచ్చుకొని పోయినాడు !' అనుకుంటే పోతప్పకు కొంత తృప్తి కలిగింది.

బ్రిడ్జికొక ప్రక్కన అలివిగాని మైదానం వున్నది. ఆ మైదానంలో కట్టేస్తే, బ్రిడ్జిక్రింద బేరంచూసుకుంటూ లచ్చుమూ బేరమ్మా ఒక కన్ను అటుంచు తారన్న ఆలోచనలో ఒక కొదమనీ ఒక పొట్టేలు పిల్లనీ కొన్నాడు పోతప్ప. మధ్యాహ్నాలు బ్రిడ్జి నీడలో రిక్షాలో నడుం వాల్చి మైదానంలోని పొటేలు పిల్లల్ని చూస్తుంటే పోతప్పకు ఎంతో తృప్తి, ఆనందం కలుగుతుంది.

ఆరోజు మంచి బరువుల్తో రిక్షాతొక్కాడు ఉదయంనుండి. ఇద్దరాడవాళ్లను, నలుగురు పిల్లల్ని సామానుతో సహా తీసుకెళ్లి దించివచ్చేసరికి మిట్టమధ్యాహ్నం అయింది. ఉస్సురంటూ బ్రిడ్జి క్రిందికి చేరాడు. లచ్చుము యివాళ తమలపాకులు తేలేదు. ఉజ్జప్పకు జ్వరంగావుందని యింట్లోనేవుండిపోయింది. బేరమ్మ కూరగాయల ముందు కూర్చుని బజ్జీలు కాలుస్తున్నది. అంజనప్ప ఫుల్లుగా పీకేసి నట్లున్నాడు. దిక్కు తెలియకుండా ఒట్టినేలబడి దొర్లుతూ వొదురుతున్నాడు.

'ఆడిపనేపోయి. పైసాపని సెయ్యడు...తాగటానికి దుడ్డెట్టా చిక్కిందో. పనికి గూడా బోలేదే యీ నడమ' అనుకున్నాడు పోతప్ప. అలిసినచూపు అలవాటుగా మైదానంవైపు పారింది. అక్కడ గడ్డిపరకలు కొరుకుతున్న పొటేలు పిల్ల కనిపించింది. ఎవరో నీపు మీద చరిచినట్లు నిటారుగా కూర్చున్నాడు. 'బేరమ్మా, రొండో పొట్టేలు పిల్లేదే?' అన్నాడు ఆదుర్దాగా. బేరమ్మ బజ్జీలమీదినుంచీ చూపు తిప్పకుండా 'యావో, నాకేం దెల్సు. ఆయప్పనే అడుగు' అన్నది. దాని గొంతులో పోతప్పకేం విన్పించిందో, ఒక్క ఊపులో రిక్షాదిగి అంజనప్ప దగ్గరి కెళ్లాడు. వాడి చొక్కా కాలరు పట్టుకొని యీడ్చి కూలేశాడు. 'పొట్టేలు పిల్లేది?' అన్నాడు. అంజపన్కి కాస్త తెలివొచ్చింది. 'యాటికి బోయిందో...నేనేం కావిలా?' అన్నాడు. 'తెల్దా నీకు? లాగుబోతు నాకొడకా...నీకు తాగటానికి యాటినుంటి వొచ్చిందిరా?' గసపోసుకుంటూ అంజనప్పని విదిలించేస్తున్నాడు పోతప్ప. ' ఎవురో మారాజు...గొర్లు దోలకపోతా పది రూపాయలిచ్చిండు నాకు...దరమరాజు...ఏం, యియ్యకూడదా ?...' అన్నాడు అంజనప్ప నవ్వబోతూ, తూలుకుంటూ.

పోతప్పకి అలవిమాలిన కోపం వచ్చింది. బేరమ్మ పొయ్యికాడి కట్టెపుల్ల అందుకున్నాడు. 'దరమరాజు వూర్కే యిచ్చినాడేవిరా...పొట్టేలు పిల్లేది?...యాభై రూపాయల కుర్రని పదిరూపాయలకి దారపోసినావురా...' అంటూనే కసిదీరేట్టు ఉతుకుతున్నాడు అంజనప్పని. చేతిమీదా నుదుటిమీదా చీరుకుపోయి రక్తం కారుతున్నది.

'అమ్మో, నాయినో, రగతం, సత్తావుండాడన్నా' అంటూ బేరమ్మ పరుగెత్తు కొచ్చింది. అంజనప్ప రక్తం చూసుకుని 'అయ్యో...అయ్యో...' అంటూ నేలమీదికి దబ్బుమని దొర్లా పడిపోయాడు. పదుకునే బూతులు తిడుతున్నాడు.

ఆ దోవన ఎక్కడికో బరుస పోతున్న పోలీసు వాను వీళ్లను చూసి తక్కున ఆగింది. ఒక పోలీసు దిగివచ్చాడు. పోతప్ప చెయ్యి పట్టుకుని, కచ్చెలాగి క్రిందపడవేసి 'పద, స్టేషనుకు' అన్నాడు.పోతప్పకి నోట మాట రాలేదు. తత్తరదిత్తర పడిపోయాడు. అంజనప్ప తిట్లు నిలిపి, ఏం జరుగుతున్నదో అని తలెత్తిచూశాడు.

బేరమ్మ పోలీసు కడ్డంపడుతూ 'మా వోడేనయ్యా! మా అన్నే. ఆడు తాగి దొంగపని జేత్తేను కోపగిచ్చుకున్నాడు. అంతేనయ్యా... పోతప్ప, అదిగో ఆ రిచ్చా తొక్కుతాడే, మాయన్నే...మం, ఒం ఒగిపే' అని బ్రతిమలాడుతోంది.

పోలీసు తిరుగుమాట లేకుండా అంజనప్పని చూసి 'నువ్వు కూడా రా' అనేసి పోతప్పను లాక్కుపోయాడు. అందరూ ఎక్కగానే వాను స్టేషనుకి వెళ్లిపోయింది.

## 5

జైలు గదిలో కూర్చున్న పోతప్ప దిగులుపడిపోయాడు. పోలీసోళ్లు చితకదంతారా? ఆఖరి ఏం జేస్తారో! లచ్చుమూ ఉజ్జప్పా ఏం జేస్తున్నారో...తలచుకున్న కొద్దీ కడుపులో గుబులు పొర్లుకొస్తున్నది. పోతప్ప ఎప్పుడూ తప్పు చెయ్యలేదు. ఒకరిచేత వీడిట్లాంటి వాను అనిపించుకోలేదు. ఇప్పుడు ఏకంగా జైలుకే వచ్చేశాడు! తన కర్మని నిందించుకున్నాడు పోతప్ప. సరిగ్గా వాడిని కొడుతున్నప్పుడే పోలీసోళ్ల కళ్లబడ్డాడు. 'ఆడు నా కొదమని అమ్ముకుతిన్నాడు. ఆణ్ని జైలు కెయ్యాలగాని నన్నెందుకు' అని పోలీసాయన్ని ఎంతేనా అడిగాడు. ఇంతాజేసి అంజనప్పగాణ్ని ఇంటికి [illegible]. [illegible] లోనికి

దోసినారు. తప్పు ఆడిలో వుండా, లేదా? ఇప్పటికీ తల్చుకుంటే కడుపుడికిపోతుంది. బంగారంటి కొదమ. వెల కాళ్లది. నంద్యాల సైడుది. మంచిజాతిది. ఏడాదికంతా ఎక్కివచ్చేది, నూటయాభై పలికేది. వృథాగా కల్లంగడికి ధారబోసినాడు. దొంగ నాకొడుకు. ఆడది సంపాదిచ్చి పెడితే తిని కాళ్ళుబారజాపుక్కూర్చునేదిగాక... వాణ్ణి తుక్కుతుక్కుగా చితగ్గొట్టి మట్టిలో పొర్లించి మొగాన తుప్పుమని వుమ్మెయ్యాలి. అందరికీ శనిపట్టినట్టు పట్టినాడు! అట్లాంటివాడిని ఏంజేసినా తప్పులేదు—అనుకుంటూవుండగానే తనపరిస్థితి జ్ఞాపకం వచ్చి ఆంతకసీ చప్పున చల్లారిపోయింది. తాను జైల్లో వున్నాడే! తప్పు తనదే అయిందే! మనసంతా అయోమయం అయిపోయింది. ఏదో అర్థంకాని భీతి పట్టుకున్నది.

పోతప్పని రెండోరోజు సాయంత్రం జైల్లోంచి వదిలేశారు. పోలీసులు రెండునూర్లు యిస్తేనే ఒదుల్తామన్నారనీ, యింట్లో దాచుకున్నది, రెండో పొటేలుపిల్లని అమ్మింది, అక్కడా అక్కడా అప్పుచేసిందీ అంతా జతజేసి తెచ్చికట్టానని చెప్పింది లచ్చుము. జైల్లోంచీ ఒదిలారన్న సంతోషం ఆవిరైపోయింది. మిగిలిన పొట్టేలు పిల్ల, దుడ్డు అన్నీ పోయినాయి. అప్పు మిగిలింది లచ్చుము దగ్గర మిగిలున్న రూపాయి యిప్పించుకున్నాడు. 'నువ్వు ముందుపో. నేను ఒత్తాలే' అని లచ్చుముని పంపించేశాడు మనసులో అర్థంకాని ఆవేదన. చలపతి జ్ఞాపకం వచ్చాడు. 'చలపతివుంటే బాగుండేది' అనుకున్నాడు.

రెండు సీసాల సారాయితాగేసరికి పోతప్పకి గాలిలోతేలిపోతున్నట్లుంది. కొంచెంసేపు నవ్వాలనీ కొంచెంసేపు ఏడవాలనీ అన్పిస్తోంది. కళ్లలోంచీ ముక్కులోంచీ నీళ్లుకారిపోతున్నై. తాను గొప్పవాడైనట్లు, ప్రపంచాన్ని శాసించగల వాడైనట్లు, ఏదో స్వతంత్రంవచ్చేసినట్లుగావుంది. నేరుగా రిక్షానిలుపుకునేచోటికి వచ్చాడు. బేరమ్మ అంగట్లో పెద్దకొడుకునిపెట్టి ఎక్కడికో వెళ్లింది.

బ్రిడ్జి ఎత్తుగా ఠీవిగా నిల్చుని ఆకాశంమీద గీత గీస్తోంది. 'సెబాస్' అన్నాడు పోతప్ప. క్రిందప్రాకులాడుతున్న మనుషుల్ని లెక్కజెయ్యకుండా వాళ్లకందనిచోట పైన వున్నది బ్రిడ్జి. దానిముందు అన్నీ వలుసులు! ఆహా, ఏం బ్రిడ్జి! ఎంత బ్రిడ్జి! ఎంత ఖరీదైన గొప్పబ్రిడ్జి! కాసేపు అలా ఆనందపడిపోయాడు పోతప్ప.

ఆనందంగా బ్రిడ్జి ప్రక్కనుండే మైదానంలోకి చూచాడు. అక్కడ నాలుగావులూ, ఒక నల్లమేకా తిరుగుతున్నై. ఒక కొదమా, ఒక పొట్టేలు పిల్లా లేవు. పోతప్పకు గుండెను అంకుశంతో పొడిచినట్లైంది. తనకేదో ఘోరమైన అన్యాయం జరిగిపోతున్నట్లనిపించింది అదేమిటో సరిగ్గా అంతుబట్టలేదు. ఏడుపొచ్చింది. భోరుమని ఏడ్చేశాడు.

కొంచెంసేపు ఏడ్చి, తలెత్తి చూశాడు. పెద్ద భూతంలాగా బరువుగా నిల్చునివుంది బ్రిడ్జి. పైనపోయే కారుల్ని బస్సుల్ని తప్పించి, క్రిందవుండే ప్రాణుల్ని తుస్కారిస్తున్నట్లుంది అది. భూమ్మీద బ్రతుకుతున్న పేదజనంమీద నిలబడి వాళ్లని అణిచేస్తున్నట్లుగా వుంది అది. కంట్రాక్టర్లు, ఇంజనీర్లు ఇంకా ఎందరో పెద్దలు మరింతగా బలుస్తూ బక్కజనంమీద నిలబెట్టారుదాన్ని. సిమెంటు బదులు ఇసుక పోసి కట్టారు. ఇట్లాంటివే స్కూళ్లు, బిడ్జీలు, డాములు ఎన్నో కూలిపోతున్నై. ఇదీ ఎప్పుడో కూలిపోయి క్రింద అందర్నీ పూడ్చేస్తుంది. బేరమ్మ పిల్లోళ్లు అందరూ దాని క్రింద బజ్జి బజ్జి అయిపోతారు. ఎంత అన్యాయం! పోతప్పకి కళ్లల్లో ముక్కుల్లో నీళ్లు కారిపోయాయి. ఆ బ్రిడ్జినే నాశనం చెయ్యాలన్నంత కోపం వచ్చింది.

కన్ను తుడుచుకుంటూ కోపంగా చూశాడు పోతప్ప. ఎదురుగ్గా ఆర్. టీ. వో. గారి కారు షెడ్డు తాలూకు పెద్ద పెద్ద తడికెలు బంగారపు తలుపుల్లా మెరుస్తున్నాయి సంధ్య వెలుగులో. వాటిని చూసినకొద్దీ పోతప్ప కోపమంతా వాటిమీదికి తిరిగింది. ఈ షెడ్డుండే సందులోనే బేరమ్మ చేరింది మొదట. ఆ సందులో చిన్న తడికెలు పెట్టుకుని వాటికి ఎర్రమన్ను పూసుకున్నది. నేలంతా చిక్కని పేడ నీళ్లు చల్లి గట్టి జేసుకుని అలుక్కున్నది. 'నువ్వవతలికి పో. మా కారు ఎదురుగా వుండాలి' అని మున్సిపాలీ వాళ్లని పిలుచుకొచ్చి దాన్ని అవతలికి తరిమారు. వాళ్లు షెడ్డు వేసుకున్నారు. ఆ మునిసిపాల్టీవాడికి వాళ్లెక్కువ. పీళ్లు తక్కువ. ఎక్కడ జూసినా అన్యాయం! అన్యాయం! బడుగు వాళ్లని ఈగల్ని తోలినట్టు తోల్తారు.

తలచుకున్నకొద్దీ పోతప్ప రెచ్చిపోయాడు. నేరుగా వెళ్లి

ముందు తడికెలు రెండూ వూడబీకి క్రిందికి విసిరేశాడు.

లోపల కారులేదు. శంకరరెడ్డిగారు అంతకుముందే లయన్స్ క్లబ్ మీటింగుకి వెళ్లారు.

ఈ ప్రక్కా ఆ ప్రక్కా సందుల్లోవుండే వాళ్లందరూ బయటికొచ్చారు. వీధిలో చుట్టు ప్రక్కల వుండేవాళ్లందరూ గుంపు జేరి చోద్యం చూస్తూ నిల్చున్నారు.

'ఎందుకప్పా, వాళ్ల షెడ్డు పీకుతున్నావ్?' అన్నారెవరో.

'అది నాది!' అన్నాడు పోతప్ప రొమ్ము చరచుకుంటూ.

'నీదా? ఎట్టా నీది?'

'అసలు మాదే. తొలిత మేమే యీడుండేది.'

ఎవరో పరుగెత్తుకుంటూ ఎదుటి యింట్లోకి వెళ్లి కల్యాణమ్మగారితో చెప్పారు. ఆమెకు ఏం చెయ్యాలో పాలుపోక కిటికీలోంచి చూస్తూ నిల్చుంది.

తడికెలు కట్టిన గుంజల్ని బలంగా పీకి విసిరేశాడు పోతప్ప. చుట్టూ వుండే జనం అవి తమమీద పడతాయేమోనని కొద్దిగా వెనక్కి జరిగారు.

'తడికలూ గుంజలూ నీవేనా?'

'నావే'

జనాన్ని చూసినకొద్దీ పోతప్పకి ఉత్సాహం హెచ్చిపోతున్నది. తానేదో ఘనకార్యం చేస్తున్నట్లుగా ఉబ్బిపోతూ ఒక గుంజను చేత్తో పట్టుకుని, క్రిందపడున్న తడికెలమీద ఠీవిగా నిల్చున్నాడు. జనానికి ఏమి జరుగుతుందో చూద్దామన్న ఆసక్తితోపాటు వాడి ప్రవర్తనకు నవ్వూ వస్తున్నది.

'షెడ్డు వాళ్లది. నీదెట్టా అవుతుంది?'

'ఓరి ఎర్రినాయాలా, నీదేంది? నాదేంది? ఆళ్లదేంది? ఎవ్వడి చేతికొస్తే ఆడిది సొమ్ము' కళ్లల్లోని నీళ్ల తుడుచుకున్నాడు. 'నేను రిక్షాదొక్కి కట్టపడి సంపాయించుకున్న దుడ్డేయీ? నా పొట్టేలు పిల్లలెయ్యీ? సెప్పు...' ముక్కు తుడుచుకున్నాడు. తన తెలివి తేటలకి ఆశ్చర్యం ఆనందం కలిగాయి పోతప్పకి. చలపతి జ్ఞాపకం వచ్చాడు. 'సొపకింద బురద నీళ్లల్లె పరమారతావుందిరా కొత్తపద్దతి. నీ సొపనానిపోయి కుళ్లు కంపు గొడతావుందిరా...నాయం నాయం అని నాయాలు సెప్తావుండావె, యా డుంది న యం?' చుట్టూ అందరినీ ఉరిమి చూశాడు.

ఇంతవరకూ కిటికీలోనుంచి చూస్తున్న కల్యాణమ్మగారికి ఆవేశం వచ్చింది. 'ఇది ఊరా అడివా? పట్టపగలు నట్టనడివీధిలో ఒక తాగుబోతు వెధవ పెద్దా చిన్నాలేకుండా యీవిధంగా తందనాలాడుతూవుంటే మర్యాదస్తులకి దిక్కులేకుండావుందే! ఏమిరాజ్యం యిది!'' అనుకుంది. వాళ్ల పనికుర్రాడు ప్రసాదుగాడు పోలీసు స్టేషనుకి ఫోనుచేశాడు. స్టేషనునుంచీ యిద్దరు పోలీసులు రిక్షాలోనూ, ఇద్దరు సైకిళ్లమీదా తక్షణం బయల్దేరుతున్నారని సబ్ ఇన్‌స్పెక్టరు ధైర్యం చెప్పాడు.

పోతప్ప ఉపన్యాసం ఆపి గుంజలురెండూ భుజాన వేసుకుని యింటికి బయల్దేరాడు. ఇంటిదగ్గిరికొచ్చేసరికి కొద్దిగా తెలివొచ్చింది. పిల్లవాడి ద్వారా విషయంవిన్న బేరమ్మా అచ్చమ్మా పరుగెత్తుకొచ్చారు. వాళ్ల సందు మొగలోవుండే బంకు యజమాని గుంజలు రెండూ మురుగు కాలవలో పారేయించి పోతప్పని అంగడి వెనుక దాచిపెట్టాడు.

ప్రసాదుగాడు సంగతి యావత్తూ కథారూపంగా వివరిస్తూ వుంటే, గంభీరంగా తలూపుతూ హెడ్డు ముందొస్తుంటే, వెనుక ముగ్గురు పోలీసులు వచ్చేశారు. అటూయిటూచూసి మురుగు కాలవలో గుంజలు కనిపెట్టేశారు. బంకుయజమానివచ్చి పోతప్ప మంచివాడనీ: యిదే మొదటి తప్పనీ! తాగి దిక్కు తెలియక ఏదో చేశాడనీ, వాళ్ల తలుపులు కట్టించి యిస్తాడనీ, ఇహ ముందెప్పుడూ

యిలాంటి పొరపాటు జరగదనీ చెప్పాడు. లచ్చుమూ బేరమ్మాకూడా సంజాయిషీలు చెప్పుకొని హామీలు యిచ్చారు.

'అవునయ్యా, నిజమేననుకో. మరి మేం యింతదూరం వూరికే బాధపడి వొచ్చామే' అన్నాడు హెడ్డు.

బంకు యజమాని లచ్చుముతో చాటున మాట్లాడి హెడ్డు చేతిలో ఏదో పెట్టాడు.

ఏమైనాసరే ఈ వెధవ పోతప్పగాడి అంతు తేల్చాలని ప్రసాద్ గాడికి పట్టుదలగా వున్నది. రెడ్డిగారి వస్తువైతే ఒకటీకాదు వాడికి. ఇంతటి అరాచకం సహించలేకపోతున్నాడు.

'ఈ సందలనే యాడనో దాపెట్టుకోని వుంటాడుసార్' అన్నాడు ఉక్రోషంతో, చుట్టూ కలయజూస్తూ.

'వాడెక్కడికి పోతాడు! రేపు ఈ చుట్టుపక్కల్లోనే దొరుకుతాడులే' అంటూ వెనక్కి తిరిగారు పోలీసులు

పోలీసుల సలహామీద లచ్చుమూ బేరమ్మా ఏడ్చుకుంటూ కల్యాణమ్మగారింటికి వెళ్లారు, కాళ్లమీదపడి క్షమాపణ అడుక్కోడానికి.

'పోలీసు సార్జెంటు కొడుకు బీ. కాం. చదవాలని ఒకటేమైన పోరు పెడతన్నాడంట. దానికి వెయ్యి రూపాయిలిస్తే పని జరుగుతుందట. ఆ డబ్బుకోసం తనకలాడతన్నాడంట. ఇంక పాతిక తక్కువపడిందట' ఇంట్లో మిగిలివున్న బిందే చెంబూ తీసుకెళ్తూ బంకు యజమాని పోతప్పతో చెప్పాడు.

ఇల్లు ఖాళీగా వుంది. చీకట్లు కమ్ముకొచ్చాయి. కష్టపడి సంపాదించిన డబ్బుతోపాటు ఆత్మవిశ్వాసమూ పోగొట్టుకున్న పోతప్ప అయోమయంలో కూర్చుండిపోయాడు.

తాను ఎందుకు తాగాడో, ఎందుకు రౌడీతనం చేశాడో, ఎందుకు జైలుకెళ్లాడో పోతప్పకి తెలియలేదు. ఇంతవరకూ ఎందుకు కష్టపడి కండలు కరిగించుకున్నాడో, ఎందుకు కడుపు కట్టుకున్నాడో, ఎందుకు షావుకారుకి అప్పగట్టాడో, దేన్ని మానం మర్యాదా అన్నాడో కూడా అర్థంకాకుండా పోయింది.



# స్వప్న వాసంతిక

## శ్రీ ఆచార్య తిరుమల

గగనంలో ప్రళయానిల ఘోషలా
'జయ్' మనే శబ్దం !
నిలబడ్డ శాద్వలాల మీద
దిగబడ్డ చూపుల్ని పెరికి
భయాన్ని మోసుకొంటూ
పరుగెత్తాను
బాణంలా శబ్దం తరుముతోంది
ప్రాణం కళ్లల్లో తిరుగుతోంది
అడుగు పడదు — ఆగిపోయాను.
పిల్ల తెమ్మర కమ్మగా తాకింది
ప్రాణం గుండెల్లోకి జారింది
నా చూపు నింగికి పారింది
అక్కడంతా మబ్బు ముక్కలు
వాటిమీద పావురాళ్ల ముక్కలు !
ఆశ్చర్యం ! అద్భుతం !
నింగి నుండి కందిరీగలు
భయంతో బాధతో
నేల రాలిపోతున్నాయి
పావురాళ్లు జల జలా వాలి
మరణించిన కందిరీగల్ని
ముక్కున కరుచుకొని – మబ్బు
ముక్కల మీది కెగిరి పోతున్నాయి
అవి వాటిని తింటున్నట్టు లేదు
ఎందుకిలా జరుగుతోంది ?
ఆలోచన సాగుతోంది
సూర్యకిరణాలు గుచ్చుకొని
కల కరిగిపోయింది, కాని
పదార్థం కందిరీగ లా
పావురాయి ప్రాణం లా
తళుక్కుమంటున్నాయి
మనసులో ! మగతలో !!

# వచనకవిత - ఒక స్టేట్‌మెంటు

( వచన పద్య పంచకం )

శ్రీ నూతలపాటి గంగాధరం

తెలుగు సాహిత్యంతో ప్రాథమిక పరిచయంవున్నవారికిగూడా కవిత్రయం, కావ్యపంచకం సంప్రదాయాల సంగతి చెప్పనక్కరలేదు. సంప్రదాయం పాతదైనా ఆధునికత వస్తువుకూ, ప్రక్రియకూ సంబంధించినదీ అయినందువల్ల ఈ ఎన్నికవల్ల ఆధునికతకు భంగం కలుగదు. కావ్యపంచక సంప్రదాయం మన సంబంధవ్యాల వంటిది! కాలంమారినా బాంధవ్యాలవిలువ మారలేదు కదా!

కలంపట్టిన ప్రతిరచయితా ఉత్తమరచనచేసి ఉత్తమ రచయితగా కీర్తి గడించాలనే ప్రయత్నిస్తాడు. ఎంతప్రయత్నంచేసినా కొందరు కొందరుగానే మిగిలిపోతారు. ఏ ఒక్కరు తమకేగాక తమ రంగానికే కీర్తిపతాకలై నిలిచిపోతారు. సామాన్యంగా ఏ రంగంలోనైనా గొప్పవారైన తర్వాతనే ఘనకార్యాలు చేస్తారనుకోవడం సర్వాత్మనా సత్యంకాదు. అలాగే ఘనకార్యాలుచేసిన వారంతా ఘన కీర్తి గడిస్తారనుకోవడంగూడా సర్వకాలీన సత్యమనుకోవడం పొరబాటే! ఘనకార్యాలుచేసిన వారెంతోమంది చరిత్ర కందకుండా పోయిన ఉదంతాలెన్నో ఉన్నాయి.

ఈ అయిదు కవితలను రచించిన కవులు సుప్రసిద్ధులే! వారు సుప్రసిద్ధులైనందువల్లకాదు ఈ ఎన్నిక! క్రియను బట్టి కర్తను గుర్తించడం ఉత్తమపద్ధతి. కర్తనుబట్టి క్రియకు ఖరీదు కట్టడం ఎప్పుడూ ఒంటికి మంచిదికాదు. ప్రస్తుతం ఈ జబ్బుతోనే మన దేశంలోని ప్రతిరంగమూ బాధపడుతున్నది. కవితలను ఎన్నుకున్న పిమ్మటే కవులను గుర్తించడం జరిగింది. ఈ ఎన్నిక ఎట్లా జరిగిందంటే మన కవితారంగంలో ఈ అయిదు కవితలూ దేనికది కొంత చరిత్ర కలిగి ఉండడం ఒకటి. తెలుగు వచనఛందః పరిణామానికీ, మలుపులకూ ఒక్కొక్కటీ ఒక్కొక్క మజిలీగా ఉండడం రెండు. సామాజిక ప్రయోజనకరమైనదిగా ఉండడం మూడు.

ప్రసిద్ధమైనవి ఇంకా ఎన్నో ఉండవచ్చు. అవి ఛందోబద్ధాలై ఉండవచ్చు. వచన కవితలే అయితే శైలీ శిల్పాదులలో ఈ ఐదింటి సంతతిలోనివై ఉండవచ్చు. అదీ కాని పక్షంలో ప్రయోజనాభేదమైనవిగా ఉండవచ్చు.

ఇక్కడ మరొక విషయంకూడా గమనించకపోతే సత్యాన్ని ఏకపక్షం చేసినవాడినవుతాను. కవిత్వం నిర్వచనాని కందని వస్తువు. ఎప్పుడు అనిర్వచనీయ బిరుదు వహించిందో అప్పుడే ద్రష్ట ప్రాధాన్యతను కూడా అంగీకరించిన దవుతున్నది. ఈ కారణంగానే ఫలానా వ్యక్తి ఫలానా కావ్యాన్ని ఇట్లా మెచ్చుకున్నాడనే వ్యవహారం ప్రచారంలో ఉన్నది. ఈసూత్రం మీదే గ్రంథపీఠికలూ, ప్రముఖుల అభిప్రాయాలూ, పత్రికల సమీక్షలూ ప్రభుత్వం చేస్తున్నాయి. కొందరికి నచ్చినవి కొందరికి నచ్చకపోవచ్చు. కొందరికి వస్తువుదృష్ట్యా ఒక కావ్యం నచ్చుతుంది. కొందరికి శిల్పం దృష్ట్యా ఒక కావ్యం నచ్చుతుంది. రసదృష్ట్యా కవిత్వంలో శిల్పం ప్రాధాన్యత వహిస్తుంది. ప్రయోజనం దృష్ట్యా వస్తువు ప్రాధాన్యత వహిస్తుంది. ఉత్తమ కవిత్వానికి ఇవి రెండూ ప్రధానమైనవి. కవి భావుకతనుబట్టి శిల్పం, సంస్కారాన్ని బట్టి వస్తువూ ఉంటాయి. వచనపద్యం అన్నిరకాల కవిత్వాలకీ వేదిక అయింది; అన్నిరకాల కవులకూ క్రీడాస్థలమైనది. వ్యావహారిక భాషకు మల్లె!

పై నిబంధనల ప్రకారం ఈ సమీక్షకు స్వీకరించిన ఐదు వచన కవితలివి: ఒకటి—కవితా! ఓ కవితా! (శ్రీశ్రీ) రెండు—నగరంలో వాన (కుందుర్తి) మూడు—చిరంజీవి మానవునకు మృత్యువు (ఆరుద్ర) నాలుగు—శిఖరారోహణం (తిలక్) ఐదు—చెట్లు కూలుతున్నదృశ్యం (అజంతా).

శ్రీశ్రీ 'కవితా! ఓ కవితా!' అన్న వచన కవితా ఖండిక 1937 లో రచించాడు. కానీ తను వచనకవితకు శ్రీకారంచుట్టింది మాత్రం 'ఆకాశదీపం'లో. 'ఆకాశదీపం' 1934లో రచించాడు.

'గదిలో ఎవరూ లేరు, గదినిండా నిశ్శబ్దం, సాయంత్రం ఆరున్నర. గదిలోపల చినుకులవలె చీకట్లు...' అని ఛందస్సు వాసనలైనా లేకుండా ప్రారంభమై 'చీకటి బోనులో సింహములా నిలుచున్నది. కత్తిగంటుమీద నెత్తుటి బొట్టు లాగున్నది. ప్రమిదలో నిలిచి పలు దిక్కులు చూస్తున్నది దీపం' అని రాను రాను తూగూ, వేగమూ పుంజుకొంటుంది–'ఆకాశదీపం!' అక్కడక్కడా ప్రాసలూ మాత్రలూ పడ్డాయంటే అవి వెతికి వేసినవికావు, అవే వెతుక్కుని వచ్చినవి–కవి ఆవేశంనుండి సహజంగా ఊడిపడ్డవి. 1934లో వచన ఛందస్సు నింత స్వేచ్ఛగా చేతులూపుకుంటూ నడిపించిన శ్రీశ్రీ '37లో–' నా సృష్టించిన గానంలో

ప్రక్షాళిత మామక పాపపరంపర
లానందపశం వదహృదయునిజేస్తే ... నా నాడుల
తీగలపై సాగిన

నాదబ్రహ్మపు పరిచుంబనలో
ప్రాణావసాన వేళాజనితం
నానాగానానూనస్వానావళితం
బ్రదుకును ప్రచండ భేరుండ గరు
త్పరిరంభంలో పట్టిన గానం
సుఖ దుఃఖాదిక ద్వంద్వాతీతం...'

ఇలా నరాలు బిగుసుకుపోయి నడుస్తున్నాడు. ఇందులో ఛందస్సుల సర్వపరిష్వంగం వదిలినా, ఛందస్సు వాసనలను తెంచుకోలేదు. వ్యాకరణాల సంకెళ్లు విడిచినా, జటిల సమాసాల సంకెలను విరుచుకోలేదు. పలికేది వ్యావహారికమే అయినా, గ్రాంథికంలోని కృత్రిమత్వాన్ని చంపుకోలేదు. ఇది 'జాతి జాతి నిర్ఘాతపాత సంఘాతహేతువై, కాలకేతువై...ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారములలో మిహిరవాజితతి! మఖవధనుర్ద్యుతి...' నాటి మాత్రల కైవాటపు పురిటి వాసనలు వదులుకోలేక పోవడమే! ఈ సమాసాల చిక్కుదారుల్లో వేసే మాత్రల తప్పడడుగులు వచన ఛందస్సు లక్ష్యాన్ని విచ్ఛిన్నం చేస్తున్నదనే సత్యాన్ని శ్రీశ్రీ గుర్తించకపోలేదు. గుర్తించాడన్నందుకు గుర్తుగా 1938లో రచించిన అంకితగేయంలో–'ఎవరు దుఃఖించారులే, నేస్తం! నువ్వు చనిపోతే, ఏదో నేనూ, ఆరుగురు స్నేహితులూ తప్ప! ఆకాశం పడిపోకుండానే ఉంది! ఆఫీసులకు సెలవు లేదు! సారాదుకాణాల వ్యవహారం సజావుగానే సాగింది! సానుభూతి సభలలో ఎవరూ సాశ్రు నేత్రాలు ప్రదర్శించలేదులే నీకోసం! ఎవరి పనులలో వాళ్లు! ఎవరి తొందరలో వాళ్లు...' అని గుండెను ముక్కలుగా తరిగి వచన కవితలో విసరివేస్తాడు. వ్యవహారిక భాషలో కవిత్వం చెప్పడమంటే ఇదీ అని నిరూపించాడు. అయితే ఈ కవితలన్నీ వదిలి ఛందస్సుల కంపులో సమాసాల కంపతో బిగుసుకుపోయిన గేయాన్ని ఎందుకు ఎన్నుకున్నావంటే - కారణం లేకపోలేదు.

శ్రీశ్రీ మొదట రాసిన వచనకవిత 'ఆకాశ దీప'మే అయినా, తర్వాతి కవులకు మార్గదర్శకమైనది 'కవితా! ఓ కవితా!' మాత్రమే! ఆద్యం కాకపోయినా గుణ ప్రాధాన్యతను బట్టి ఆరాధ్యమైనదే గురుపీఠాన్ని అలంకరించడం లోకన్యాయం. కనుకనే 'కవితా! ఓ కవితా!' తెనుగు సాహిత్యంలో మొదటి తరం వచన కవితా స్వరూపానికి సంకేతంగా నిలుస్తున్నది. అందులో 'శ్మశానాల వంటి నిఘంటువుల దాటి, వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి '–వస్తున్నాని' తన్నుతాను నిర్వచించుకోవడమూ, రావాలని ఎదిటి వారికి చాటి చెప్పే లక్షణ ప్రబోధమూ ఉన్నది. పైది భాషా ఛందస్సుల విషయంలో అయితే, వస్తు విషయంలో కూడా 'నా రచనలలో లోకం ప్రతిఫలించి నా తపస్సు ఫలించి నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి జనులు పాడుకొనే మంత్రంగా ప్రయోగించాలని నా ఆకాశాలను లోకానికి చేరువగా నా ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడిగా' ఉండాలని స్పష్టంచెయ్యడం శ్రీశ్రీ సంస్కారానికి నిదర్శనం. ఈ లక్షణానికి లక్ష్యాలా అన్నట్టు రచించిన ప్రతిభావంతమైన శ్రీశ్రీ భావ కవితకు నిదర్శనాలైన పంక్తులు గూడా ఈ ఖండింలోనే ఉన్నాయి. 'పడిరేయి నిద్దురలో అపుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని రుచిర స్వప్నాలను కాంచే జవరాలి మనః ప్రపంచపు టావర్తాలు శిశువు చిత్ర నిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడు! వైద్యశాలలో శస్త్రకారుని మహేంద్రజాలంలో చావు బ్రతుకుల సంధ్యాకాలంలో కన్నులు మూసిన రోగార్తుని రక్తనాళ సంస్పందన కాలువ నీళులలో జారిపడి కదలగనైనా చాలని ప్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన ప్రేలాపన కడుపులు దహించుకుపోయే పడుపుకత్తె రాక్షస రతిలో అర్ధనిమీలిత నేత్రాల భయంకర బాధల బాటల పల్లవి! ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం! ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకం కేకా! భేకం బాకా! సమ్మెకట్టిన కూలీల, సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల ఆకటి చీకటి చిచ్చులు...' మొదలైన

హాహాకారాలు; ఆర్తారావాల వాస్తవ దృశ్యాలెన్నో తర్వాతి కవుల కంతా మార్గదర్శకా లయ్యాయి.

శ్రీశ్రీ భావుకత జలపాతం వంటిది! అది మహా ఆవేశంలో దూకుతుంది. ఆయన సంస్కారం కూడా బలమైనది కాబట్టి దాన్ని సరియైన పద్ధతిలో వినియోగించుకుంటుంది. సంస్కారం రెండు పనులు చేస్తుంది. ఒకటి-భావుకతను ఎప్పటికప్పుడు హితమైన నవత వైపు నడిపిస్తుంది. రెండు—భావుకతనుంచి ఆవేశంలో దూకిన ప్రతి శబ్దాన్నీ, ప్రతి భావాన్నీ ఔచిత్యం హద్దుగా, ఆలోచన ఎత్తుగా సంస్కరిస్తుంది. సంస్కారాన్ని భావుకత మించితే తిలక్ అవుతాడు. భావుకతను సంస్కారం మింగితే ఆరుద్ర అవుతాడు. రెండూ సమపాళ్లలో మేళవిస్తే శ్రీశ్రీ అవుతాడు. ప్రపంచ వ్యాప్తంగా సాహిత్యంలో ఎన్నో యిజాలు తలచూపాయి. వాటిలో కొన్ని శ్రీశ్రీ సంస్కారం చేత అంగీకారం పొందినవి తన భావుకతమీద అధికారం చూపించినవి. ఇట్లా శ్రీశ్రీ మీద ప్రభావం చూపిన యిజాల బీజాలన్నింటికి ఈ కవిత పాదుకావటం మరొక విశేషం. కమ్యూనిస్టు మానిఫెస్టో పరిచయం పిమ్మట శ్రీశ్రీ కవితాసౌధానికి మార్క్సిజమే పునాది అయిపోయింది. మార్క్సిజం పోకడలకు ఈ ఖండికలో ప్రతి వాక్యమూ దర్పణంగా నిలుస్తుంది. పోతే యిజాలలో మార్క్సిజం తర్వాత శ్రీశ్రీ మీద అంతటి ప్రభావం చూపిన 'సర్రియలిజం' ఈ ఖండికలో—'అగ్ని సరస్సున వికసించిన వజ్రం ? ఎగిరే లోహశ్యేనం ? ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం !' అన్న పంక్తుల వెనుక చోటుచేసుకున్నది. శ్రీశ్రీమీద పాశ్చాత్య ఉద్యమాల ప్రభావం ఎంత వున్నా మొదటగా ఆయన భారతీయ సంప్రదాయానికి చెందిన వ్యక్తి. సనాతన సంప్రదాయం నుంచి వచ్చిన వ్యక్తి. మన సంప్రదాయాన్ని అంటిపెట్టుకున్న జన్మ పరంపరల విశ్వాసం కూడా 'శిశువు చిత్ర నిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడు—' అన్న ఊహలో చోటుచేసుకున్నది. అయితే శ్రీశ్రీకి మన సంప్రదాయపు చేలాంతలముల విసరుల కొసగాలులు' గూడా అంటడానికి సుతరామూ సమ్మతింపని కొందరు పై ఊహ ఫ్రాయిడ్ ప్రభావజనితమని సమర్థిస్తున్నారు. ఏది ఏమైనా శ్రీశ్రీ అన్ని అవతారాల సాక్షాత్కారం ఈ కవితలో ప్రదర్శింపబడింది. తర్వాత విస్తరించిన అన్ని ఉద్యమాల వేర్లు గురజాడ కవితలో నిక్షిప్తమైనట్లు, శ్రీశ్రీ యుగంలో అల్లుకొన్న అన్ని యిజాల బీజాలకూ శ్రీశ్రీ 'కవితా! ఓకవితా' ఖండిక పాదు వంటిది. అభ్యుదయ, వచన కవితోద్యమాలకు ఈ ఖండిక మానిఫెస్టో లాంటిది.

కుందుర్తి వాన కురిసింది నగరంలోనే అయినా, ఆ వానలో తడిసింది మాత్రం సామాన్యుడి జీవనమే! నగర జీవితాన్ని చిత్రించే కవిత ఆధునికతెలుగు సాహిత్యంలో సుమారుగానే వచ్చింది. సుమారులో సూక్ష్మదృష్టి సుమారుగానే వున్నా సునిశిత వ్యంగ్యంతో రసదృష్టిలో చెప్పింది మాత్రం తక్కువే ! ఆ తక్కువలో తక్కువెక్కి 'కాలుమీద కాలేసి మీసం మెలేసిన వచన పద్యఖండిక 'నగరంలో వాన'. అందరూ వాస్తవికత నుంచి వ్యంగ్యాన్ని పుట్టిస్తే, ఇందులో కవి వ్యంగ్యంనుంచి వాస్తవికతను సృష్టిస్తాడు. ప్రబంధ కవి అయ్యలరాజు రామభద్రుడు వర్షధార నుంచి కవితా ధారను శ్లేషించాడు. అది కేవలం శబ్దగతమైన శ్లేష మాత్రమే! ఇందులో భావ సంఘర్షణ నుంచి వెలువడిన వ్యంగ్యం ఘుమాళిస్తుంది. కవి భావుకత వ్యంగ్య ధనువును ఎక్కుపెడితే, సంస్కారం వాస్తవికత భాగాన్ని గుండెలకు గురిపెట్టి కొడుతున్నది. ఆ దెబ్బ తప్పదు. అది ఎంత సున్నితంగా తాకుతుందో అంత గాఢంగా ముద్ర వేస్తుంది. వచన పద్యం ఎంత సహజమైన ఛందస్సో, ఈ ఖండికలోని రచన కూడా అంత సహజంగా రూపు దిద్దుకొన్నది. అస్పష్టత శూన్యం. పులుముడు హుళక్కి. సర్కసు ఫీట్లు నాస్తి. ఛందస్సుల సర్ప పరిష్వంగాలనూ, వ్యాకరణాల సంకెళ్లనూ, నిఘంటువుల శ్మశానాలనూ దాటి వస్తున్నానని శ్రీశ్రీ చెప్పినా, ఆ పని చేసింది మాత్రం కుందుర్తే! కుందుర్తిలో శ్రీశ్రీలోని ఆవేశపూరితమైన ప్రౌఢ సమాస రచనా వుండదు. ఆరుద్రలోని ఆంగ్ల పదప్రయోగ వైచిత్రీ ఉండదు. తిలక్‌లోని రొమాంటిక్ శబ్ద విన్యాసమూ ఉండదు. అజంతాలోని క్లిష్టమైన ఇమేజరీ ఉండదు. ఈ రకమైన వేటిపోలికే పోక కుందుర్తి తన తనం నిలుపుకుంటూ తియ్యదనం ఉరించే తెలుగుతనం శైలిని నిర్మించుకున్నాడు. కుందుర్తి భాష ప్రజల భాష. అతని అలంకారాలు నిత్య వ్యావహారికాలు. అతని పదబంధాలు తెనుగు నుడికారజన్యాలు. ప్రజల సమస్యలను ప్రజల భాషలోనే ప్రజలకు సన్నిహితమైన శైలిలో చిత్రించి మన పద్యాన్ని తెనుగు జాతీయ ఛందస్సును చేసిన ఘనత కుందుర్తికే దక్కింది. ఈ లక్షణాలన్నీ 'నగరంలో వాన'లో పరిపక్వతను సిద్ధింపజేసుకొన్నాయి.

కుందుర్తి భావుకతలో మరొక విశిష్టత వున్నది. అది ప్రకృతికి ప్రాణం పోసి, జడాన్ని చేతనంగా మారుస్తుంది. మన

కష్ట సుఖాలలో ప్రకృతికూడా పాలు పంచుకుంటుంది. 'ఆరిపోతున్న కుంపటి'లో 'మగపక్షి బిస్కట్టు ముక్కున కరచుకొని సైనికుల యుద్ధ స్థావరాల దగ్గర పడేసింది. చేతనా చేతనాలు కలిసి శత్రువును ఎదుర్కొన్నాయి' అటాగే 'నాగార్జున సాగరానికి నా యాత్ర' అన్న ఖండికలో ప్రకృతికి ప్రాణంపోసి, మనమధ్యకి నడిపించి, మనతో ఎట్లా నెయ్యం చేయిస్తాడో చూడండి. 'నేనే స్వయంగా వస్తున్నానని వేలబాల ముస్తాబైనట్లు దారి పొడుగునా దర్శనమిచ్చింది తంగేడు పూల మేలిమి కాంతి' ఇంకా ప్రకృతి స్తంభించిపోయి ఆనందంతో కవి కిట్లా స్వాగతం పలికింది– 'మేస్తున్న గడ్డి మానేసి ఆశ్చర్యంగా మోర ఎత్తి చూసింది ఆవు నిచ్చెన యెక్కి చూసినట్లు ఆనందంతో విచ్చుకుంది కాడచివరి గడ్డిపూవు' అంతేకాదు 'పంట పండని బీడు సైతం పచ్చిగడ్డితో స్వాగతపు తివాసీ నేసింది' అట్లాగే నగరంలో వాన కూడా సహప్రాణిలాగా మనిషితో దాగుడుమూత లాడుతుంది. అన్నింటికీ ఇందులో ఉదాహరణ లనేకం.

'నగరంలో వాన' కవిత్వంలా మొదలై రాజకీయ శాసనంతో అంతం అవుతుంది. ఇందులో ఎంతో ఔచిత్యం ఉంది. 'పల్లెసీమలో వానల మేనాలమీద దివినుండి సస్య సమృద్ధి దించే వర్షాకాంత అవసరం లేనప్పుడడిగితే అప్పులు సులువుగా లభించినట్లు అక్కరలేని నగరంలో కూడా పుష్కలంగా' కురిసే వాన 'స్వాగతం చెప్పని పట్నవాసాల పాగిన ఉదయపు జల్లు రాత్రి వచ్చిన చుట్టంలా తిష్ట వేస్తుంది తీరిగ్గా' అని నగరంలో వాన మొదటి భాగంలోనే కవిచేత విపర్యయ స్వాగతం పలికించుకొంటుంది.

వాన కేవలం కేన్వాసు మాత్రమే. దాన్ని ఆధారం చేసుకుని కవి చిత్రించిన వాస్తవిక దృశ్యాలు మనల్ని నిలబెట్టి ఆలోచింపచేస్తాయి. 'నగరంలో వానకు తెలుసు గొడుగు జీతపు రూకల్లో మిగిల్చి కొనగలగడం వట్టి మాటని గోనెసంచి కప్పుకోవడం నాగరికులకు మోటని తడిసి మోపెడై వణుకుతూ వచ్చి వంటింట్లో కుంపటి ముందు కూచోని మర్నాడు మంచమెక్కితే తను చేసిన ఘనకార్యం కనులార చూచుకుంటున్నట్లు కిటికీలోంచి తొంగిచూస్తుంది చిటపటా చిరుపిజల్లుల్తో' అని వాన గడుసుతనం బయటపెడతాడు కవి. గడుసుతమేకాదు దానికీ కాస్తోకూస్తో ధర్మం, దయా వున్నాయంటాడు. ఎట్లాగంటే – 'మూడునాళ్ళ పసిపాపకు ముద్దుగా ఒడిలో గుండెలకద్దుకుంటూ వెచ్చగా ఆస్పత్రినుంచి పచ్చగా యింటికి వెళ్ళే పచ్చిబాలింతరాలి మీద పూల జల్లు పడుతుంది గాని, భోరున వర్షం కురువ'దట. తర్వాత 'నగరాల నాగరికత నాలుగుకాండలు వెళ్ళజదివిన సూర్యుడి' సోమరితనం వర్ణన మనోహరమైనది. సూర్యదేవుడు – 'తెల్లవారి రేడియోలో తెలుగులో వార్తల చివర వాతావరణం వింటేగాని ఒకపాళాన నిద్ర' లేవడట। 'భూమ్మీద పస్తులున్న మనుషుల్ని చూసి ఆకాశం కంట తడిపెట్టినట్లు' వాన ముమ్మరంగా కురుస్తుంటే సూర్యుడు - 'రిక్షాలో కూచున్న ఘోషా సుందరిలా ముఖానికి అడ్డంకట్టిన మొయిలు ముసుగులు తొలగించి' లోకంవేపు మాటిమాటికి చూస్తాడట. సూర్యుడు లేని దివసం 'పతి ఒల్లని భార్యలాగా ముఖాన తిలకమేనా లేకుండా ముడుచుక్కూచుం'దట. ఇక్కడ కవి భావనలో ప్రకృతి ఎంత చైతన్యవంతంగా రూపుదిద్దుకుంటున్నదో చెప్పలేము. సూర్యుడు కనబడకపోవడానికి కారణం వినండి. 'ఉద్యోగం ఊడిన కొత్తల్లో, భయంతో కనబడినవాడి కాళ్ళమీదల్లా పడి కాస్త సిఫార్సు చేయమని కోరినట్లు ఏదో ఒక దేవుడ్ని ఆశయించడానికి వెళ్ళివుంటాడు రవి! కవి వర్ణిస్తున్నది ప్రకృతినే అయినా ఎక్కడా వాస్తవ జీవితాన్ని మరచిపోడు.

తర్వాత కవి ఊహ – సమాంతరంగా భూమికి దిగిన ముత్యాలవంటి రెండు చినుకులు వచ్చినదారిని నిచ్చెన చేసి మేఘావృత గగనంలోంచి - మేదినిలోని అనంతకోటి దృశ్యాలను చూచి వర్ణిస్తుంది. అంతఎత్తునుంచి చూస్తే నగరం 'నడి సముద్రంలో తేలాడుతున్న ద్వీపంలా' ఉందట. వానలో నగరం 'గూట్లోకి చేరిన గువ్వలా నక్కి కూచుంది'ట. కార్లు బాలవీరులు విసిరిన కత్తి పడవల్లా ఉన్నాయట. హుసేన్‌సాగరం చెరువు 'ఆకాశపు పెళ్ళికొడుకు అనేక శతాబ్దాల్క్రితమే నగరకాంతులకు మెళ్ళోకట్టిన తగరపు తాళిబొట్టులా తళతళా మెరుస్తోందట. వారాంతపు సెలవుల చట్టం ఉల్లంఘించి సగం తెరిచిపెట్టిన తలుపు వానజల్లుకు పూర్తిగా మూసేసుకున్న కిరాణా వర్తకుడూ, సిమెంటు గొడుగు చిల్లిగవ్వకు కొరగాక, మామూలు ఎగేసి తనకే నామాలు పెట్టిన ప్రక్క అంగిట్లో తలదాచుకున్న ట్రాఫిక్ పోలీసూ–, సరిగ్గా పావలా దూరాన్ని సవారూపాయికి పెంచమంటూ వర్షాధి దేవతను వరాలుకోరే రిక్షావాడూ–, సైకిలుకు కట్టిన బిందెమీది గుడ్డ మూతను పూర్తిగా తీసేసి వణుక్కుంటూ వరండాలో నించున్న పాలవాడూ, మీట నొక్కి యింట్లో లైట్లు చూసుకుని మూలబడిన బెడ్‌లైటు భాగాలను బాగుచేసుకొంటున్న గృహిణులూ–, తెల్లారితే మడిబట్ట లారవని దిగుల్తో పడుకొన్న ముసలమ్మా,

మర్నాడు కాలేజీకి శెలవు యివ్వకపోతే, సమ్మె చెయ్యాలని శపథం పట్టిన కాలేజీ కుర్రాడూ, చీకూచింతా లేకుండా, అమ్మానాన్నలు వద్దంటున్నా వానావల్లప్పలాడుతూ పరుగులు తీస్తున్న పసివాండ్రూ అందరూ కవిసునిశిత దృష్టికి సాక్షులుగా, నేటి సమాజానికి ప్రతినిధులుగా ఒకరి తర్వాత ఒకరు ప్రత్యక్షమవుతారు. ఈ దృశ్యాలన్నింటిని చూచిన తర్వాత కవి ఊహ నేలమీదికి వస్తుంది.

వాన ఒక్కొక్క బిందువు రూపంలో ఎత్తిన అవతారాలను దశవిధాలుగా వర్ణిస్తాడు. సాహిత్యంలో - సమకాలీన సమాజాన్ని ప్రతిబింబించే అభినవ దశావతార వర్ణన యిది. ఇందు ప్రతి వాన చుక్క వర్ణనా రసాత్మకమై కలిగించే అనుభూతినిబట్టి కావ్య గౌరవానికి అర్హమవుతున్నది. రమణీయార్థాలను ప్రసవించే ఈ రసగుళికలను మాదిరికైనా రుచి చూపించని పాపం నేనుంచుకోను. 'ఆవులిస్తున్న నవనాగరికుడి అధరోష్ఠం మీద వ్రాలిన చినుకు మధువు వాసనవేసి కాబోలు, మైమరచి తైతక్కలాడింది'ట. 'చార్మీనార్ గోపురాగ్రంమీద పడి నిలిచిన చినుకు ఎత్తయిన సింహాసనం మీద ఎక్కిన ధీమా కాబోలు. కాలుమీద కాలేసి మీసం మెలేసుకుంటూ నగరం నాలుగు మూలలు సగర్వంగా చూసింది'ట. 'చీటికి మాటికి కోర్టు కెక్కడం చీదరెత్తింది కాబోలు హైకోర్టు భవనంమీద చింతతో చిందిన చినుకు పక్కనేఉన్న మూసీనదిలో పడి ముక్కు మూసింది'ట. ఒక్క నీటిబిందువే తను పొందిన స్థానాన్నిబట్టి అవతారం మార్చుతున్నది - ఒక్క మానవుడే పరిసరాలనుబట్టి ప్రవర్తన మార్చినట్టు.

సమాజంలో నిరంతరం జరిగే అలజడి, అశాంతి నుంచి ఒక చైతన్య మానవుడి దర్శనం జరిగింది— 'చిరంజీవి మానవునకు మృత్యువు' ఖండికలో మృత్యువు అశాంతిని ఆసరా చేసుకొని మానవుడిని 'త్వమేవాహం' అని పిలుస్తున్నా, అతడు సాహసియై అటుతిరిగి అలజడితో 'నీవేనేను' అని చెయ్యికలిపి ఎప్పటికప్పుడు చైతన్యం పుంజుకుని చిరంజీవినని రుజువు చేసుకొంటున్నాడు.

మన కవితలో నిత్యం చిత్ర విచిత్ర ప్రయోగాలెన్నో జరుగుతున్నాయి. ఈనాటి వరకు వచ్చిన ప్రయోజనాత్మకమైన ప్రయోగాలలోకెల్లా 'త్వమేవాహం' బలమైన ప్రయోగం. త్వమేవాహలోని ప్రయోగం పరిపక్వత చెంది ప్రయోజనం సిద్ధించిన రూపమే 'చిరంజీవి మానవునకు మృత్యువు' ఖండిక. ఈ ఖండికలో నేటి సమాజ పరిణామం, జీవన పోరాటం, వానిలో మానవుడి చైతన్య తత్వ విధానం అనితరసాధ్యమైన వినూత్న గతిలో చిత్రింపబడింది. ఈ చిత్రణలో ఆరుద్ర శైలి చిత్రాతిచిత్రమైన సొగసులు పోయింది.

అభ్యుదయ కవుల్లో ఆరుద్ర అద్వితీయుడంటున్నారు కానీ, అతని శైలి మాత్రం అద్వితీయం. చలం తెలుగు నుడికారంమీద కసి తీర్చుకుని ఒక కొత్త శైలిని నిర్మించుకున్నాడు. ఆరుద్ర కావ్య భాషా సంప్రదాయం మీద కసి తీర్చుకుని ఒక విశిష్టమైన శైలిని రూపొందించుకున్నాడు. కుందుర్తి శైలి భాషలోని ప్రతిభను ఆవిష్కరిస్తే ఆరుద్ర శైలి కవి ప్రతిభను ప్రతిబింబిస్తుంది. ఆరుద్ర స్వచ్ఛందమైన శైలిలో భాషాభావఛందఃపరమైన ఎన్నో కొత్త టెక్నిక్‌లు దర్శనమిస్తాయి. ప్రాయికంగా టెక్నిక్‌మీది వ్యామోహం రసాన్ని బలిగొనే ప్రమాదం వుంది. ఆరుద్ర ఈ ప్రమాదానికి ఎక్కడా గురి కాలేదు. అందుకు ఆయన భావుకత బలంగా అడ్డునిలిచి గెలిచింది. ఆరుద్ర సంస్కారం మరీ గాఢమైనది. భావుకతను సంస్కార బలం చేత కొత్త ఆలోచనలతో నింపి, ఆ ఆలోచనలను తను సృష్టించు కొన్న శబ్దజాలంలో బంధించి అందిస్తాడు. అందరిలోకంటే ఆరుద్రలో ఆలోచనల పాలు ఒక జెత్తెడెత్తు. తన ఊహలూ, టెక్నిక్‌లూ అన్నీ తన సంస్కారం నుంచి ఊడిపడ్డవే! అన్నీ ప్రపంచానికి కొత్త. వచనఛందం మనకెంత కొత్తో, ఆరుద్ర కవిత అంత కొత్త. వచన ఛందస్సుకి రెడీమేడ్ నిబంధనలేవీ లేవు కాబట్టే ఆలోచనలనుంచే కొత్తగా తనకు ఉపయుక్తమైన లయను వెతుక్కోని వస్తుంది. అందుకే వచన పద్యానికీ, ఆరుద్ర కవితకూ అంత లంకె!

ఆరుద్ర'త్వమేవాహం'లో స్వీకరించిన కాన్వాసు 'ల్యాండ్ స్కేప్' కావడం, అందునా సంకీర్ణం కావడం సామాన్య పాఠకుణ్ని నానా తిప్పలూ పెట్టడానికి ఆస్కారమైంది. త్వమేవాహానికి కాన్వాసు 'కాలం'. ఆ కాలానికి ప్రవాహం, గడియారం సంకేతాలుగా నిలిచి కాన్వాసును సంకీర్ణం చేస్తాయి. మళ్లీ ప్రవాహం - పర్వతదశ, ఉపనదులు, ప్రవాహ దశల కిందికి విభక్తమవుతుంది. గడియారం— గంటలూ, నిముషాలూ, సెకండ్ల కిందికి విభాజనమవుతుంది. మళ్లీ ఇవన్నీ సమాజ స్వరూపానికి సంకేతాలవుతాయి. గడియారం మన సంఘం. గంటలు శ్రీమంతులు. నిముషాలు మధ్యతరగతి. సెకండ్లు

అలగా జనం. ఇంత సంకీర్ణమైన రంగస్థలంమీద ఆరుద్ర చమత్కార శైలీ శైలూషి వింత సొగసులు విరజిమ్ముతుంది.

'చిరంజీవి మానవునకు మృత్యువు' ఖండిక 'త్వమేవాహం' కావ్యంలో ఉపనదులు శీర్షిక కింద వచ్చినా, తనకు తానే ప్రత్యేకంగా ప్రకాశించగల కావ్యఖండిక. ఉపనదులు అంటేనే ప్రవాహంతో సంబంధంలేకుండా దేనికది విడిగా ప్రవహించి వచ్చి, ప్రవాహంతో కలిసిపోయేవి. ఈ ఉపనదులు మూడు. ఒకటి – భయం (నిన్న). రెండు - కామం (నేడు). మూడవది – ఆకలి (రేపు). భయం-విష్కంభం! కామం – ప్రళయం! ఆకలి–నరకం! ఈ మూడు విభాగాల్లోనూ ఒకటే ఊహలు పరిణామ క్రమంలో ప్రవహిస్తాయి, అన్ని నదుల్లోని నీరు ఒకటే అయినట్లు!

ఈ గేయంలో అన్వయ కాఠిన్యం కొంతఉంది. అది మనకు సులభం కావాలంటే – ఒక తెల్లకాగితం మీద మూడుగళ్ళు పట్టీ గీసుకుని, కావ్యం తీసుకుని ఈ ఖండికలోని విష్కంభ భాగాన్ని మొదటి గడిలో, ప్రళయం భాగాన్ని రెండవగడిలో, నరకం భాగాన్ని మూడవ గడిలో వ్రాయండి. మొదటి గడిలో ఒక కల్పన తీసుకుని రెండవ గడిలో దాని మార్పును, అలాగే మూడవ గడిలో మార్పును పరిశీలించండి. లేదా మూడుగళ్లలోని సమానార్థకాలైన పంక్తులకు క్రీగీతలు గుర్తిస్తే ఇంకా మంచిది. ఇలాగే మిగతా కల్పనలను కూడా! నేనిట్లా చెబుతుంటే మీరొక ప్రశ్న వెయ్యవచ్చు–'ఇట్లాంటి కవిత్వానికీ, మన ప్రాచీనులు చెప్పిన చిత్రబంధకవిత్వానికీ భేదమేమిటి?' అని. చతుర్విధ కవిత్వానికీ సంబంధంలేదు. అయితే యిది మన ప్రాచీనులే చెప్పిన శతాధిక అలంకారాలలో ఒకటి కావచ్చు. ఈ ఖండికలో మూడు కాలాల పరిణామక్రమాన్ని ఒకే కల్పనద్వారా సూచించడంలో కవి క్రమాలంకారాన్ని పాటించి ఉన్నాడు. ఇక్కడ 'అలంకారం కవిత్వం అవుతుందా?' అనే ప్రశ్న జనించవచ్చు. అలంకారం ఒక్కటే కవిత్వంకాదు. అయితే ఔచిత్యవంతమైన, ఔచిత్య పోషకమైన అలంకారాన్ని చెప్పడంలో గడుసైన శిల్పం ఉందనడం పైమాట ఏమీకాదు. 'శిల్పం కవిత్వం అవుతుందా?' అని మళ్లీ ప్రశ్నిస్తే–జవాబు చెప్పడం బుద్ధితక్కువ. కవిత్వానికి ప్రాణభూతమైనది రసపోషణ అనండి, రసావిష్కరణ అనండి–అది శిల్పం ద్వారానే సాధ్యమవుతుంది. ఇక్కడ ఒకే కల్పనను త్రిదళత్వంగా విశ్లేషించి మూడు కాలాల స్వరూపాన్ని రూపుకట్టించడంలోనూ, సమాహారంగా అనంతకాల స్వభావాన్ని, త్రైకాలిక సారభూతమైన మానవ చైతన్యాన్ని ఆవిష్కరించడంలోనూ ఆరుద్ర కవిత్వ శిల్పాన్ని మహా గడుసుగా పలికిస్తున్నాడు. రసావిష్కరణ శిల్పంద్వారానే సాధ్యమవుతుందనుకొన్నప్పుడు ఆరుద్ర టెక్నిక్‌లోని గురుత్వమూ, గాఢత్వమూ ఎంతటివో మనకు తెలిసివస్తాయి. శిల్పమూ, టెక్నిక్కూ పర్యాయ పదాలే అయినా మన తెనుగు కవులు అంతవరకు చూపిన కవిత్వ శిల్పం వేరు. ఆరుద్ర కవితా శిల్పంవేరు. ఆ విలక్షణత్వాన్నే 'టెక్నిక్' అనడంద్వారా తెలియపరుస్తున్నాడు.

విష్కంభంలో 'నిర్దేశించిన భావాలను వాక్యాలు బట్వాడా చెయ్యక' పోవడం 'భయం'వల్లనే. ప్రళయంలో 'ఉద్దేశించిన భావాల ఆడబొమ్మలకి వాక్యాలు గడ్డాలూ మీసాలూ పెట్టడం' 'కామం' (అర్థంలేని పాండిత్య ప్రకర్ష)వల్లనే! నరకం ఎలాంటిదో చూడండి–'ఒక పదంలో ఇముడవలసిన అర్థం కొన్ని వాక్యాల విస్తీర్ణతను దురాక్రమణ చెయ్యడం'లో ఆకలి' ఆర్భాటం స్పష్టం.

'విశాలలోకం సర్కసులోపలి విద్య ప్రభుత్వోద్యోగాల త్రాటి మీద పిల్లిమొగ్గలు వెయ్యడు.' ప్రభుత్వానికి పశ్చార్థకపు గుర్కుగా ప్రబలిపోతున్న నేటి నిరుద్యోగ సమస్య ఈ రూపకంలో స్పష్టం. 'విశాలలోకం సర్కస్‌లోపల నియంతల నోటో ప్రజా జీవితం తెగుతుంది' ప్రజానాయకుల్లో 'కామం' (అంటే స్వార్థం) ప్రబలిపోతే ప్రజా జీవితానికి వేరే ప్రళయం అక్కరలేదు. 'విశాలలోకం సర్కస్ లోపల పొడిచిన ప్రతికత్తి పెట్టోఉన్న నీ ఆశయాల జవరాలి జవనాల్ని గుచ్చుకొంటుంది' ఆశయాలన్నీ 'ఆకలి'కి బలై పోయినప్పుడు జీవితమే నరకం. ఈ మూడు దృశ్యాలూ వేర్వేరు అయినా కాన్వాసు మాత్రం ఒకటే! 'అధికారపు అయస్కాంత క్షేత్రంలో విజ్ఞానం గడియారంలా తిరక్కపోవడం' భయం!' విజ్ఞానం నల్లమందూ మానే రంగరించి గుటకెయ్యడం' కామం! ఇక ఆకలి గురించి చెప్పనక్కరలేదు.

కోటు వేళకు ప్లీడరు గుమస్తా ఇంట్లో రొట్టో పచ్చడి సలగకపోవడం అటుంచి కిరాణాకొట్లో షాహుకారు అరువియ్యకపోవడం గుమస్తా జీవితాని కంతకంటె భయంకర సమస్య మరొకటిలేదు. ప్లీడరు గుమస్తా కామ (దురాశ) ఫలితంగా లంచం రెటింపయినా, కిరాణా కొట్లో ధరలు రెచ్చి తమ్ము తాము హెచ్చవేసుకోవడంకన్నా

ప్రళయం మరేముంది? 'ప్లీడరు గుమస్తాకి' ఏడో ఆడపిల్ల పుట్టడం' నిజంగా నరకమే! 'కిరాణా కొట్లో సామానులు చీకటిలోకి నిష్క్రమింపడం' షాహుకార్ల లాభాల ఆకలి ఫలితంగానే!

ఆది మానవుడినుంచి ప్రవహించిన భయం నిన్నటి మానవుని కనుపాపను 'ఐదేళ్ల చిట్టిపాపగా మార్చేస్తే' ఆ తన్ను దాను పోల్చుకుంటాడా? ఆదిమూర్తి లిబిడో (మానసిక కామకేంద్రం—ఫ్రాయిడ్ సిద్ధాంతం) లో గడ కట్టిన కామం కరిగి నేటి మానవుడి కళ్ళు కప్పేస్తే, అతని బ్రతుకు తొలిపొద్దుల దండకారణ్యంలా అవ్యక్తమై పోదా? ఈ పరిస్థితిలో రేపటిమానవుని ఆలోచన నైపుణినుంచి సాక్షాత్కరించిన కీలకమే—వరమిచ్చిన చైతన్యం! నిన్న, నేడు, రేపు విభజన కాల సంబంధికాదు—మానవతత్త్వ సంబంధి! మృత్యువు—భయాన్నీ, కామాన్నీ ఆశ్రయించి మానవుడ్ని 'త్వమేవాఽహం' అని పరిహసిస్తుంది. మానవుడు అజడికి జంకక ఆలోచన నాశ్రయించి చైతన్యంతో 'త్వమేవాఽహం' అంటాడు.

'అమృతం కురిసినరాత్రి' కవితా సంపుటి 'నాకవిత్వం కాదొక తత్త్వం' అన్న వాక్యంతో ప్రారంభమవుతుంది. తిలక్ కవిత్వం అన్ని తత్త్వాలనూ తాకుతుందికానీ, ఏ తత్త్వానికీ నిలబడదు. 'అయితే నువ్వొక సిద్ధాంతం మీద కదా ఈ యెన్నిక చేస్తున్నావు. ఏ సిద్ధాంతమూ పట్టని తిలక్ కవితనెట్లా ఎన్నుకున్నావు?' అని ప్రశ్నించవచ్చు. ఏ సిద్ధాంతమూ పట్టనివాడు కాదు తిలక్, కట్టుబడనివాడు మాత్రమే! పట్టిన సిద్ధాంతాన్ని బలంగానే చెప్పాడు. అయితే, ఏ సిద్ధాంతానికీ కట్టుబడని తిలక్, వ్యాఖ్యానం విషయంలో నా సిద్ధాంతానికీకూడా కట్టుబడలేదు. ఇంతవరకూ విన్నుకున్న కవితతో వ్యాఖ్యానం ప్రారంభమై దాని కవి దగ్గరకువెళ్లటం జరిగింది. తిలక్ వ్యక్తిత్వం బలమైనది. ఆయన కవిత్వాన్నంతా అదే నడిపించింది. ప్రతి అక్షరంలోనూ దాని ముద్ర మనకు కనిపిస్తుంది. ముందు అతని వ్యక్తిత్వమూ, అది కవిత్వంలో ఎలాంటి లక్షణాలూ, గుణగణాలూ ప్రతిపాదించిందో తెలుసుకుంటేగాని అయన శిఖరారోహణలోని అసాధారణ ప్రజ్ఞ ఏమిటో మనకు తెలియదు. అందుకనే ఇక్కడ వ్యాఖ్యానం కవి నుంచి కవితదగ్గిరకు నడువవలసివచ్చింది.

ప్యూర్ పొయెటీ (Pure poetry) వినగానే గుండెను రెపరెపలాడిస్తుంది. తిలక్‌ది ప్యూర్ పొయెట్రీ. దానికి కారణం—అతనిలోని సంస్కారం చాల సోమరిపోతు అని చెప్పకోవడం కన్న అతనిలోని భావుకత ఊహకందనంత పదునైనదని చెప్పడంలో ఎంతో నిజం ఉంది. అందరూ ఆలోచనలనుంచి అనుభూతిని పిండుకుంటే—తిలక్ అనుభూతిలోంచి ఆలోచిస్తాడు. శ్రీశ్రీ యథార్థ జీవితాలను చూచి ఆవేశపూరితుడవుతాడు. తిలక్ క్షతజగత్తును చూచి కరుణతో కరిగిపోతాడు. అందుకే శ్రీశ్రీ కవిత పవిత్రులోకాన్ని ఉద్వేగ పూరితం చేస్తుంది. తిలక్ కవిత కరిగించి వేస్తుంది. తిలక్ ప్రేమగీతం రాసినా: ఆర్తగీతం రాసినా, పద్యం రాసినా, వచనం రాసినా అన్ని వేళలా శైలి ఒకటే! ఆ శైలిలోనేఉంది అతని వ్యక్తిత్వం! అగ్ని జల్లినా, అమృతంకురిసినా అందం, ఆనందం దాని పరమావధి. ఆ పరమావధికి తను ఎంత ఉన్నతమైన ఆదర్శాన్నైనా బలి చెయ్యడానికి వెనుదీయడు. ఆ అందం, ఆనందం కలిగించడానికి సత్యవర్మనే అక్కర్లేదు. 'అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం నిజాన్ని నిరూపించే నరకం కన్న వెయ్యిరెట్లు నయం' అంటాడు. కవితావస్తువుమీద తిలక్ అభిప్రాయం యిది. తిలక్ తనే చెప్పకున్నట్లు—'ఆనందం మనిషైనవాడు. కలల పట్టుకుచ్చు లూగుతున్న కిరీటం ధరించాడు ఎవరికీ దొరకని రహస్యాల్ని వశపరచుకున్నాడు.'

సమాజాన్ని పరిశీలించడం, పరిశీలించినదాన్ని అందంగా చెప్పడం, పరిశీలనను ప్రయోజనాత్మకంగా వినియోగించుకోవడం—ఈ మూడు పనులు కవికి ముఖ్యం. పరిశీలనలోనూ, దాని వినియోగంలోనూ రచయితలోని సంస్కారం బాధ్యత పెద్దది. అందంగా చెప్పడం ఉందే అది భావుకత చేసేపని! 'ఎవరికీ దొరకని రహస్యాల్ని వశపరచుకోవడం' లో తిలక్ సంస్కారం ఎంతో అప్రమత్తత వహించినా, దాన్ని ప్రయోజనాత్మకంగా వినియోగించుకోవడంలో అదే సంస్కారం చాలచోట్ల బద్ధకించింది. ఇక అందంగా చెప్పడంపట్ల ఆయన భావుకత ఎక్కడా విశ్రమించలేదు. దాని విజయం అనన్యం. తిలక్ రాసిన ఒకటి రెండు కవితలను పరిశీలిస్తే ఈ విషయం మరింత సోదాహరణంగా స్పష్టమవుతుంది. తిలక్ 'ఆర్తగీతం' ఖండికకు సాహిత్యలోకంలో గొప్పమన్నన ఉన్నది. అందులో ఆకలితో మరణించిన ముసలివాడినీ, వంతెన క్రింద ప్రసవించి మూర్ఛిలిన నిండు చూలాలానూ, ఏడుమూర్తు మురికి కాల్వప్రక్క విధించిన మూడేళ్ల పసిబాలుడ్నీ, వస్తుంతో ఆఫీసుకొచ్చిన ప్యూన్ వీరన్ననీ, మూర్తీభవించి దైన్యాన్నీ—హైన్యాన్నీ, గచ్ఛత్ శవాకార వికారుల్నీ మొదలైన (ఎవరికీ దొరకని రహస్యాలు) మనం నిత్యంచూచే దృశ్యాల్ని హృదయద్రావకంగా చెప్పి—'ఈ ఆర్తి ఏ సౌంధ్యాంతరాలకు

పయనింప గలదు ? ఏ రాజకీయవేత్త గుండెలను స్పృశింపగలదు ? ఏ భోగవంతుని విచలింప చేయగలదు ?' ఉపరివాస్తవం సంస్కారాన్ని అసలు లెక్కే పెట్టకుండా 'ఏ భగవంతునికి నివేదించుకొనగలదు ?' అని మన పురాణాలలో అడుగడుగునా ప్రత్యక్షమయ్యే వేనవేల దేవుళ్ళలో ఒకరికి చోటిస్తూ—వారి సందర్శి స్ఫురికి తెస్తుంది. కాలిన కడుపుకు తిరగబడి బ్రతుకును కాపాడుకోవాలనే స్పృహ లేనపుడు న్యాయానికి గోతులుతీసి, అన్యాయానికి పందిళ్ళువేసే వర్గంలోని వాళ్ళే సౌధంలోని భోగవంతునికీ, రాజకీయవేత్తకూ వినిపించడం చెవిటికి శంఖు ఊదినట్టు కాదా ? విన్నా వినోదించక—విచలిస్తారా ? విచలిస్తే మాత్రం ఒక్కడూ—అరా ఏం చేస్తారు ? భిక్షవేస్తారు ? ఇది కత్తికొనను పట్టుకుని పిడిలో యుద్ధం చేయడంలాంటిది. అచుంబితమైన దృశ్యాలను ఎంతో అందంగాచెప్పి చివరికి వాటిని నిరుపయోగంచేసి భారియైన్నున నడిచిన 'ఆర్తగీతం' ముగింపు దగ్గిరకు వచ్చేలోపల వ్యర్థగీతమైపోతున్నది. 'ఆర్తగీతం' లాగే 'ప్రార్థన' గూడా ప్రసిద్ధిచెందిన ఖండిక. 'దేవుడా, రక్షించు నాదేశాన్ని—పవిత్రుల నుండి పెద్దమనుషులనుండి పెద్దపులులనుండి సిద్ధాంతకేసరులనుండి శ్రీ మన్మద్గురు పరంపరనుండి' అని దేశంలో (ఎవరికీ దొరకని రహస్యపు) అన్యాయాలకు ప్రాతినిధ్యం వహించిన వర్గాన్నంతా జుట్టుపట్టి బయటికిలాగి నడివీధిలోపడవేస్తుంటే మనంకోరేదీ అదే అను కుంటాము. ఆ తర్వాత—సంఘైకోట్ల మనుష్యుల నిజమైన ప్రాణం వున్న మనుష్యులతో నిండినదేశం నాది ఆకలీ బాధలూ ఆందోళనలూ సమస్యలూ విరివిగావున్న విచిత్ర సౌధం మాది' అని కన్నీళ్ళలో నవ్వునూ చెప్పిస్తాడు. కానీ 'కొంచెం పుణ్యం కించిత్ పాపం కాస్త కన్నీరూ మరికాస్త సంతోషపు పన్నీరూ చాలుమాకుతండ్రీ! అని తేలిపోతాడు. చివరికి—'ఆశల వెన్నెల పాన్పుమీద స్వప్నాల పుష్పాలు జల్లుకుని అదమరచి కాసేపు విశ్రమించడానికి కనుమరంచు తండ్రీ!' అని కలలపూల పాన్పు మీద హాయిగా వాలిపోతాడు. సాహిత్యలోకంలో ఈ కవితకు విపరీతమైన మర్యాదఉంది. కొన్ని ప్రసిద్ధ పత్రికలూ, సాంస్కృతిక సంస్థలూ ఈ కవితను తమ ప్రత్యేక సంచికలకు మకుటంగాకూడా పునర్ముద్రించు కున్నాయి. ఇట్లా అన్ని వర్గాల వారినీ ఆకర్షించింది. (అది ఆకర్షణకాదు—సమ్మోహపరచడమే) అన్ని వర్గాల వారిని సమ్మోహపరచడం ఒక తిలక్‌కే చెల్లింది. అందుకు అతనిలోని శైలితోపాటు 'మంగవిగంధంలా పరిమళించే మానవత్వం' కూడా ఎంతో ఉపకరించింది.

తిలక్ ఈ కవితల్లో వేసిన తప్పటడుగులన్నీ 'శిఖరారోహణ' చేస్తున్నప్పుడు సరిచేసుకుని జాగ్రత్తగా అడుగు ముందుకువేశాడు. అందులో అన్యాయం చేసేవారివైపునుంచి కాకుండా అన్యాయానికి బలిపుతున్న వారి దిక్కునుంచి మార్పును కోరుతున్నాడు. 'ఆహార సమస్య అయినా అణ్వస్త్ర విపత్తయినా ఆకలి రోగం రణం వణం ఏదయినా ఈ ధాత్రీపదనాన్ని వికృతంచేసే, ఈ మనుగడని భారం చేసే దుస్సహపరిస్థితి అనారోగ్య మనస్థితి అసంతృప్తి అవాప్తి అవి వేకులు స్వార్థపరులు కలిగించిన ఫలితం' అని సరియైన అవగాహనతో కవితారథాన్ని నిజమైన లక్ష్యంవైపు నడిపిస్తున్నాడు. 'మురికి కాల్వ మీద ముసలితనం మీద మృషాజగతిమీద మహోదయం వికసించదు, వసంతం హసించదు' అని మృషనూ, ముసలితనాన్నీ, మననుకాల్వ లోని పిరికి మురికినీ కడిగివేయమని ఉద్బోధిస్తున్నాడు. వసంతమంటే శృంగార పరంగా వ్యాఖ్యానించుకొని 'మలినశృంగార తృప్తిపొందేవాడు విటారుడు శకారుడు' అని నవ చెప్తాడు 'సంప్రదాయ భీరువుకీ అస్వతంత్ర వితంతువుకీ వసంతంలేదు నవాసకానివాడు జీవన సమ రానికి స్వర్గానికి పనికిరాడు' అని కత్తివైపు కాకుండా పిడివైపు పట్టుకుని సమరానికి దిగుతున్నాడు.

ఇది ఉగాది నాసరా చేసుకుని లేచిన కవితాశిఖరం. ఉగాది రైలు వచ్చింది స్టేషన్‌లోకి. పాతమాటలతో కవులూ, వట్టిమాటల సంచులలో రాజకీయ వేత్తలూ మొహమాటం లేకుండా ముందే ఎక్కికూర్చున్నారు. రైలింగ్ అవతల టికెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నుంచున్నారు. ప్రజలు లేకుండా ప్రగతి ప్రయాణం సాధ్యమేనా ? అందుకే— 'రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరో తొలగించి వేశారు ! ఈ సంఘటనలో ప్రారంభ మవుతుంది ఖండిక. తర్వాత నేటి సమ్మెలూ, అల్లరులనూ ప్రకృతిపరంగా వ్యంగ్యంగా వివరిస్తాడు. ఆ పిమ్మట కొత్త సంవత్సరాన్ని కాపురంలో అడుగు పెడుతున్న కొత్త కోడలిగా సంకేతించి కాపురంలోని అవకతవకలు వర్ణిస్తూ దేశంలోని రాజకీయ కల్లోలాన్ని సంక్షోభాన్నీ ధ్వనింపజేస్తాడు. తర్వాత 'క్షితిజరేఖ వెనుక నిలిచి పిలిచే రత్న కంకణహస్తం' కనిపిస్తుంది. చరిత్ర విచిత్ర సముద్రం విసిరిన తుంపరల్లో తడుస్తాము. భవిష్యద్గగనం వంగి చెవిలో చెప్పిన రహస్యం వింటాం. ఈజిప్టు పిరమిడ్ల మధ్యా, బాబిలోనియా స్తూపాలమధ్యా, మొహంజొదారో శిథిలాల మధ్య నిలిచి కలలు కంటాము. ఇంకా ముందుకు ప్రయాణంచేసి సృష్టి సింహం చేసిన ప్రథమగర్జ వింటాము. లుంగలు చుట్టుకుపోతున్న భూమి పేగుల్నీ, ఎగుడు దిగుళ్ళ దారిలో గిజగిజలాడుతూ మెసులుతూన్న ప్రాణహారితన్నీ,

సూర్యుడి సంతోషపు వెలుతురునూ, విచ్చిన ప్రాణం చుట్టూ ఉరికిన నెత్తుని ఎర్రని నెత్తురునూ, ఆదిమానవుడు నిలిచి పూరించిన శంఖమూ, సీజర్ కౌక్షేయధారా, అలెగ్జాండర్ అశ్వరింఖా ఘట్టనా, రాజ్యం రమణినీ మించిన రమ్యభావనా — అన్ని దృశ్యాలూ మవల్ని ఊపివేస్తాయి. యుద్ధకాండలూ, కళాఖండాలూ అన్నీ నిరంతర నూతన పరిశోధనలు! సత్యసౌందర్యాన్వేషణలు. ఒక్కొక్కడూ ఒక్కొక్క అన్వేషణలో ఒక శిఖరాన్ని ఆరోహణ చేస్తున్నాడు. చేయిస్తున్నాడు. ఈ ఖండికద్వారా తిలక్ మనల్నీ మన సాహిత్యాన్నీ మరో 'శిఖరారోహణ' చేయించాడు.

'చెట్లు కూలుతున్న దృశ్యం' శీర్షికలాగే ఆ ఖండికలోని కవితా శైలికూడా విలక్షణమైనది. అంతర్వీక్షణనుంచి సమాజాన్ని దర్శించే వచనకవితా శాఖకి ఈ ఖండిక అధ్యక్షత వహిస్తున్నది. అంతర్వీక్షణలో అజంతా భావుకత బలంగా పలుకుతుంది. సమాజాన్ని దర్శించే విధానంలోనూ, ఆ దర్శనను వినియోగించుకునే ప్రయోజనం లోనూ కవిసంస్కారంలోని సునిశితత్వం వెల్లడవుతుంది. 'ఆదర్శాలన్నీ ఆచరణలో కల్లలైపోగా అతడు చలికిలపడ్డాడు. విఫలమైన ఆదర్శాలే అతన్ని బాధించసాగాయి'—అను విషయాన్ని ఆవిష్కరించడంలో అజంతా తన కల్పనా బలంతో దాన్నొక దృశ్యంగా మనకళ్లముందు ఎట్లా రూపు కట్టిస్తాడో చూడండి: 'తలక్రిందులైన స్వప్నంమీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు, ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు'

శాబ్దికమైన లయకోసం కానీ, ప్రాసకోసం కానీ ఈ ఖండికలో కవి ఎక్కడా కాలాన్ని వ్యయం చేయచేసిన సందర్భం ఒక్కటి కూడా లేదు. భావాన్ని వాక్యాలుగా మలిచి ఎత్తుగడలోనూ, ముగింపులో ఒక సొగసు'ను అందిస్తాడు. ప్రతి వాక్యాన్నీ రసాత్మకంగా తీర్చి దిద్ది కావ్య గౌరవాన్ని కలిగిస్తాడు. తెలుగు పలుకుబడిమీద అజంతాకు ఎంత అధికారం ఉన్నదో 'చెట్లుకూలుతున్న దృశ్యం' నిరూపిస్తుంది. వ్యావహారిక భాష బలంగా, బరువుగా కవిత్వంలో పలికిన విధానాన్ని ఈ ఖండికలో మనం దర్శిస్తాం. ఇందులో కవి వాడిన భాష వచన ఛందస్సు తత్వానికీ, వ్యక్తీకరణ వైఖరికీ, పలుకుబడి మర్యాదకూ ఒక అలంకారంగా భాసిస్తున్నది ఇందులో పొరబాటున కూడా ఒక మారుమూల పదంగానీ, ఒక గ్రాంథిక రూపంగానీ చోటుచేసుకోదు. కానీ అజంతా ఇటీవలి కవితల్లో మారుమూల పదాలమీదా, గ్రాంథిక రూపాలమీదా మొజుకనిపిస్తున్నది. ఉదాహరణకు ఒక ఖండికలోని పదరూపాలను పరిశీలించండి: 'అధివాస్తవిక శిక్ష' అన్న ఖండికలో తిండిపోతు అనడానికి 'ఘస్మరు' డనడం, బట్టతల అనడానికి 'ఇంద్ర లుప్తకం' అనడం, మీసాలనడానికి 'శ్మశ్రువు'లనడం, బంగారు కిరణాలనడానికి 'హిరణ్యకిరణా' లనడం—ఇదంతా సొగసుకత్తెకు మారుమూల గరుకుబొంత కప్పడమే అవుతుంది. 'క్షుద్రసంధ్య' అన్న ఖండికలో కూడా ఈ ప్రమాదాలున్నాయి. ఇట్లాంటి కృత్రిమ వ్యామోహంగానీ, వచన ఛందస్సును వికృతపరిచే ప్రమాదాలు కానీ చెట్లు కూలుతున్న దృశ్యంలో కనిపించవు.

అజంతా కవిత్వం గ్రంథరూపంలో రాలేదు. అది తప్పో, ఒప్పో ఆ బాధ్యతమాత్రం రచయితదే! మనమై పత్రికలలో ఏరుకోవాలి—అది అందరికీ సాధ్యంకాదు. 'చెట్లుకూలుతున్నదృశ్యం' కవే స్వయంగా చెప్పేదాకా నాకు దాని ప్రచురణ వివరాలు తెలియక పోయాయి. 1956 ప్రాంతాల్లో 'కవిత' అనే పత్రికలో ప్రచురింపబడిందట. దాన్ని నేను చూడలేదు. కుందుర్తినుంచి దాని వ్రాత ప్రతి సంపాదించాను. దానిలో నాకు కొన్ని సందేహాలుండడంవల్ల అజంతాకు రాశాను. అజంతా స్వదస్తూరితో ఆ కవిత రాసిపంపారు. కుందుర్తి వ్రాతప్రతికీ, అజంతా వ్రాత ప్రతికీ చాలా భేదం ఉంది. కుందుర్తి వ్రాతప్రతి గేయం వా డైరీలో మూడు పేజీలువస్తే, అజంతా వ్రాతప్రతి గేయం అదే డైరీలో రెండు పేజీల పరిమాణానికి కుదింపబడి ఉన్నది. దీనికి కారణం-తన మిత్రుడు అబ్బూరి రాజేశ్వరరావు బలవంతంగా అజంతా దగ్గరున్న చిత్తు ప్రతిని లాక్కుని 'కవిత' పత్రికలో ప్రచురించారట. దాన్ని సవరించినప్పటి రూపాన్ని అజంతా నాకు రాసి పంపారట. అయితే కుందుర్తి పంపిన ప్రతి 'కవిత' పత్రికలోనిదై ఉంటుందని ఊహిస్తున్నాను. ఇలా కుదించటంవల్ల కొంతమేలూ జరిగింది. కొంత కీడూజరిగింది. ఆ చర్చకిది సమయం కాదు. కవిత పత్రికను నేను కళ్లారా చూడలేదు కాబట్టి కవి స్వహస్తూరి వ్రాత ప్రతినే గౌరవించడం నా ధర్మం. కనుక ఇందులో నేను అజంతా సవరించి వ్రాసిన కవితనే ప్రమాణంగా తీసుకొంటున్నాను.

ఒక్క పరంలోనే కాదు దేశం గుండెలలో సాలీడులా అల్లుకున్న నేటి నిరుద్యోగ సమస్యను—'బాధ అనే దీపం పటుకొని, సర్వ నాశనం అనే తాళం చెవి పట్టుకొని, వెంకట్రావు జీవితం అనే చీకటి సరిక మాపంలో భయంకరమైన ఆశ్చర్యాలు' అనేకం చూపిస్తాడు అజంతా. నేడు భారతదేశంలో నిరుద్యోగి వెంకట్రావులు అడుక్కో

క్కారు ప్రత్యక్షమవుతారు వీరిని చూచి దేశ స్వాతంత్ర్యానికి చిహ్నమైన, ప్రభుత్వ భవనాలమీద జెండా సిగ్గుతో తలవాల్చుకున్నా ఆశ్చర్యంలేదట. మిత్రుడు వెంకట్రావు నిరుద్యోగి కాకుంటే— 'ఎంతో అందమైన సాయంత్రంకదా ఇలా అపస్వరాలు వినపడడం జరుగదు, రోడ మీద ధూళీ, దారిద్ర్యం సమస్తం మిత్రుడు వెంకట్రావు ముఖంమీదనే పరవళ్ళు త్రొక్కడం సంభవంకాదు' అంతే కాదు—'నిరుద్యోగి వెంకట్రావు నగరం నడివీధిలో తన జీవితాన్ని తెరుస్తుంటే, ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు, చెట్లమీద ఆకుసైతం అల్లాడదు, టెలిఫోన్ తీగలలో వార్తా ప్రసారం సాగదు' నిరుద్యోగి దౌర్భాగ్యం దేశంలో ఇంకా ఎంత సంక్షోభాన్ని కలిగిస్తుందోచూడండి:—నిరుద్యోగి వెంకట్రావు గాలిలో, ధూళిలో ఎండుటాకుల సుడిగుండాలు తిరుగుతుంటే, గృహస్థులు ఆరోజు సన్యాసం స్వీకరిస్తారు, పిల్లలుగల తల్లులు బావిలో దూకుతారు, విద్యార్థులు నడివీధిలో పుస్తకాలు తగులబెడతారు' నేడు దేశంలో ఇంతకంటె ఏం జరుగుతున్నది ? నిరుద్యోగం బాధలు మరచిపోవడానికి వెంకట్రావు మనస్సు గతంలోకి వెళ్ళి 'తనబాల్య స్మృతులు తలచుకుంటూఉంటే— నగరంలో పసిపిల్లలు ఆపూట అన్నం ముట్టరు, పువ్వులు కోసుకుంటున్న పిల్లలు తిరిగి ఇంటికి చేరరు' అతని ఊహ పామై కాటు వేస్తుంటె పువ్వులు కోసుకొంటున్న పిల్లలు ఇంటికెలా చేరుతారు ? అంతటా వ్యాపించిన రాజకీయాలు అజంతాదృష్టి నుంచి మాత్రం ఎట్లా తప్పించుకుంటాయి ? 'నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్ళలో, రప్పలలో దాచుకొంటూఉంటే, రాజకీయనేతలు వాటిని వేలం పాటలో కొనుక్కుంటారు' ఇంత భయంకర దృశ్యం ఏ మార్కెటులోనూ కనిపించకపోవచ్చు కానీ, జీవితంలో అడుగడుగునా మనం ఎదుర్కొనే నిత్యసత్యం. వెంకట్రావు విషాదం రంగు ఎలా ఉంటుందో తెలుసుకోవడానికే 'కవులు, చిత్రకారులు అతని కన్నీళ్ళపై పరిశోధనలు జరుపు' తున్నారట. 'చీకటి పుట్టుపూర్వోత్తరాలను' వెంకట్రావు 'పాదధూళి'లో వెతికితే తెలుస్తుందట.

వెంకట్రావు జీవితం ఇంత భయంకరంగా రూపుదాల్చినా, అతడు చావడట. 'చావడం అనే మహాపాపం చేయకుండా న్యాయాధిపతులు, ఎల్లవేళలా అతన్ని కాపాడుతూ ఉంటారుట' వెంకట్రావు నగరంమీద ఒక మచ్చ. అది నడు. నేటిసమాజానికి ప్రతిబింబం 'చెట్లుకూలుతున్న దృశ్యం'. నిరుద్యోగి భయంకర జీవితదృశ్యాన్ని కవి రూపంలో గీసిన తైలవర్ణ చిత్రం ఇది.

ఈ ఐదుమంది కవులతోనే తెలుగు వచన కవితాశాఖ ఆగిపోతుందని గాని, ఈ ఐదు కవితలే ప్రమాణంగా నిలిచిపోతాయని గాని నేను భావించడంలేదు. వచన కవితకు ఇంకా ఎంతో భవిష్యత్తు ఉంది. ఎంతమంది మహాకవులు అవతరిస్తారో, ఎన్ని మహాకావ్య ఖండాలు సృష్టిస్తారో— అని ఎదురు చూచే ఆశాజీవుల్లో నేనూ ఒకడ్ని!



# ఆర్థిక శ్రేయస్సుపై ప్రొఫెసర్ ఎ. సి. పిగూ ఆలోచన

డాక్టర్ బి. ఆర్. కె. రావు

నవ్య సాంప్రదాయిక ఆర్థిక పీఠానికి ఆదిపురుషుడైన ఆల్‌ఫ్రెడ్ మార్షల్ అనుంగుశిష్యుడు ఆర్థర్ సిసిల్ పిగూ (1877–1959). 1908వ సంవత్సరంలో తన 30 వ ఏట ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో, విశ్వవిఖ్యాతిపొందిన మార్షల్ స్థానంలో మార్షల్ స్వయంగా పిగూ కొరకు తన పదవికి రాజీనామా నివ్వగా, అర్థశాస్త్ర శాఖలో ప్రొఫెసర్‌గా నియుక్తుడైనాడు. 1932 తదుపరి ఆర్థిక శాస్త్రవేత్తగా కేన్సు వెలుగులోకి వచ్చేవరకూ మార్షలీయ నవ్య సంప్రదాయక ఆర్థిక విచార ధారలో పిగూ ఎదురులేని దిట్టగా ఆర్థిక మేధావుల ప్రపంచంలో మకుటంలేని మహాచక్రవర్తిగా వెలుగొందాడు. 1920 లో ప్రొఫెసర్ పిగూ ప్రచురించిన "ఎకనామిక్స్ ఆఫ్ వెల్‌ఫేర్" ఆర్థిక శ్రేయస్సుకు సంబంధించిన కేంద్ర సమస్యలపై దృష్టిని బరపి పరిష్కారమార్గాలను చూపుతూ విషయ సమగ్రతలోను, విశ్లేషణలోను అందెవేసినచేయిగా అలరారింది. ఇందులోని విషయక్రమము తగినట్లు సంఘటితపర్చడమేగాక, గంభీరంగా నడుపబడి, పదునైన వాదనతో పటిష్ఠం చేయబడింది.

ఈ గ్రంథంలోని మొదటి భాగంలో జాతీయాదాయానికి, ఇందులో బీదలకు చేరే భాగానికి, సమాజపు ఆర్థిక శ్రేయస్సుతో ఎట్టి సంబంధముందో వివరింపబడింది. రెండవభాగంలో జాతీయాదాయంపై ప్రభావం గల శక్తుల గురించి చెప్పబడింది. మూడవ భాగం శ్రామికుల సమస్యలను చర్చించింది. నాల్గవ భాగం ధనికుల నుండి బీదలకు ఆదాయాలను స్థానాంతరము చేయడంలోగల జటిల సమస్యలను విశదీకరించింది.

ఈ గ్రంథ రచనలో పిగూ ఉపయోగించిన ప్రమేయాలు (assumptions) ప్రయోజనాత్మకాలు (utilitarian) గా వున్నవి. (1) మనుష్యులు తమ సంతృప్తులను గరిష్ఠం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. (2) అనేక వస్తువుల్ని కొనవలసివున్నప్పుడు, వాటన్నిటి ఉపాంత యూనిట్లపైన ఖర్చుచేసే ద్రవ్యాలు సమ సంతుష్టిని ఇచ్చేటట్లుగా ఆయావస్తువులను కొంటారు (3) అటువంటి క్రయం జరిగినప్పుడు, కొనుగోలు చేసిన వివిధ వస్తువుల ఉపాంత యూనిట్ల ఉపయోగితలు (marginal utilities) సమతౌల్యంలో వుండటమేగాక వాటికి చెల్లించిన ధరలకు అనుపాతంలో వుంటవి.

మానవులందరి అనుభవించే శక్తులు నేడు సమానం కాకపోవచ్చు; కాని వాటిలో పైకి కన్పించినంత అసమానత లేకపోగా ఒకరి అనుభవించే శక్తి మరొకరి అనుభవించే శక్తికి దగ్గరగానేవుంటుంది. అంతేగాక కాలం జరుగుతూ ఆదాయాలు పెరుగుతున్నకొలదీ మానవుల మధ్య అభిరుచులలోను, అనుభవించే శక్తులలో వున్న గల వ్యత్యాసాలు అంతరిస్తవి. ఈ విషయాన్ని పిగూ తన గ్రంథంలో యిలా వివరించాడు : "ఇప్పటి మానసిక పరిస్థితి వల్ల పెరిగిన ఆదాయం బీదవారికి తక్షణమే చాల తక్కువ ప్రయోజనాన్ని కల్గించడమనేది, మూల విషయమైనప్పటికి, కొంతకాలం జరిగిన తదుపరి, ముఖ్యంగా అలా జరిగింది ఒక్కకాలమై ఒక తరం పెరగడానికి సరిపోయిందయితే, అలాంటి ఆదాయపు పెరుగుదల అభ్యత విద్యాది సంపదలద్వారా, పెరిగిన ఆదాయాన్ని అనుభవించడానికి అవసరమైన శక్తుల్ని, బుద్ధిబలాలను వారిలో పెంపొందిస్తుంది. అందుచేత దీర్ఘకాలంలో వారిలోగల స్వభావ, అభిరుచి సంబంధమైన వైవిధ్యాలు, వారిలో ఆదాయాల స్థానాంతరం జరగడంవల్ల తొలగిపోతవి. అందుచేత, స్థానాంతరీకరణ వల్ల కల్గే లాభాలకు వ్యతిరేకంగా వాదించి బుజువు చేయడానికి వాటినొక కారణంగా చూపరాదు" [1] ఆర్థిక శ్రేయస్సు, శ్రేయస్సు యితర లక్షణాలు పరస్పర వ్యతిరేకతను చూపవచ్చు; కాని ప్రత్యేకమైన రుజువు లేకుండా అటువంటి నిర్ధారణకు రాకూడదు. కోర్కెలు, సంతృప్తి సమాంతరం (Parallel)గా పరుగెత్తవచ్చు.

అయినా యిందుకొక మినహాయింపు వుంది; భవిష్యత్తును మనము తక్కువ విలువనిస్తాము, అందుకు కారణము 'మన మేధస్సు దూరదర్శన శక్తిలో లోపం వుంది, అందువల్ల భవిష్యత్ ఆహ్లాదాలను తరిగిపోయిన పరిమాణంలో వున్నట్లు చూస్తాము"[2] అందువల్ల జరగవలసినదానికంటే పెట్టుబడి తక్కువగా జరిగింది. పొదుపుశక్తికి వ్యతిరేకమైన ప్రభుత్వ విధానాలు ఆర్థిక శ్రేయస్సును తగ్గించినవి. పొదుపుకు ప్రోత్సాహమిచ్చే పన్నులు మొదలైన చర్యలు మాత్రము ఆర్థిక శ్రేయస్సును పెంచినవి. ఆర్థిక శ్రేయస్సును ప్రభావితం చేసే ఆర్థిక కారణాలన్ని జాతీయాదాయ మాధ్యమం ద్వారానే అలా ప్రభావితం చేస్తవి. "ద్రవ్య రూపంలో కొలవడానికి వీలున్న ప్రాపంచిక సంబంధమైన సమాజపు ఆదాయము— విదేశాలనుండి వచ్చిన ఆదాయంతో సహా— జాతీయాదాయము"[3] అని చెప్పవలసివుంది.

గ్రంథం రెండవ భాగంలో వ్యూహాత్మకమైన ప్రమేయాలు చేయబడినవి. ఔద్యోగిత హెచ్చుగానేవుంది. అయితే వనరులుమాత్రం ఆర్థిక శ్రేయస్సు గరిష్ఠం కావడానికి తోడ్పడేటట్లు స్వతశ్చంద పూర్వకంగా (Automatically) ఉపయోగింపబడలేదు. అందువల్ల ఆదర్శవంతమైన ఉపయోగానికి ఎలా దూరమయ్యామో తెలిసికోవటం ప్రధాన సమస్య. ఈ సందర్భంలో పిగూ (1) ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తి (Marginal social net product) (2) ఉపాంత ప్రయివేటు నికర ఉత్పత్తి (Marginal private Net product) అనే రెండు భావనల (Concepts) ను ప్రవేశపెట్టాడు. "ఒక ఉపయోగంలోనో లేక ఒక పని జరిగే చోటనో వనరుల ఉపాంత పెట్టుబడి పెరగడంవల్ల వచ్చిన మొత్తం నికరోత్పత్తిలో, అమ్మకానికి ముందు, ఆ వనరులను పెట్టుబడి పెట్టిన వ్యక్తికి లభ్యమయ్యే భౌతిక వస్తువులు లేక ప్రాపంచిక సేవలు"[4] ఉపాంత ప్రయివేటు నికర ఉత్పత్తి అని పిగూ నిర్వచించాడు. అలాగే "ఒక ఉపయోగంలోనో లేక ఒక పని జరిగేచోటనో వనరుల పెట్టుబడిలో ఉపాంత పెరుగుదల జరగడంవల్ల వచ్చిన మొత్తం భౌతిక వస్తువుల లేక ప్రాపంచిక సేవల నికర ఉత్పత్తిలో ఎంత భాగం ఎవరికి చెందినప్పటికీ, ఆ నికర ఉత్పత్తి మొత్తం ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తి"[5] అవుతుందని కూడా పిగూ చెప్పాడు. రైలు నడుస్తూ వున్నప్పుడు వచ్చిన నిప్పురవ్వలవల్ల అడవి తగులబడి నష్టం జరిగినట్లయితే ఆ నష్టం మేరకు ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తి తగ్గుతుంది. ప్రతి ఉత్పాదకరంగంలోను సమంగా వనరుల్ని ఉపయోగించినప్పుడు ఉత్పత్తులుకూడా సమంగా వచ్చినట్లయితే మొత్తం ఉత్పత్తి గరిష్ఠమౌతుంది. సమతౌల్యంలో నున్న ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తులు అన్నిచోట్ల ఒకేరీతిలో వుంటవి. ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తి, ఉపాంత ప్రయివేటు నికర ఉత్పత్తి సమానమైనప్పుడు మాత్రమే ప్రయివేటు స్వీయ ప్రయోజనాభిరుచి జాతీయాదాయాన్ని, ఆర్థిక శ్రేయస్సును గరిష్ఠం చేస్తుంది. అయితే తరచుగా యీ ఉపాంత నికరోత్పత్తులు భిన్నంగా వుంటవి. కౌలుదార్ల పెట్టుబడివల్ల లాభాలు కొంతవరకు భూస్వాములకు చెందినట్లయితే ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తి, ఉపాంత ప్రయివేటు నికర ఉత్పత్తికంటె హెచ్చుగా ఉంటుంది. ఒక వ్యక్తి నుండి ప్రతిఫలం తీసుకుని అతనికి సేవచేస్తూ వున్నప్పుడే, మరొక వ్యక్తికికూడా సేవ చేయడంగాని, అపకారం చేయడం గాని జరిగినట్లయితే, ఆ సేవకు ప్రతిఫలంగాని, అపకారానికి నష్టపరిహారం గాని ముట్టనట్లయితే, ఉపాంత సాంఘిక నికర ఉత్పత్తికి, ఉపాంత ప్రయివేటు నికర ఉత్పత్తికి మధ్య తేడా ఏర్పడుతుంది. ఒక ధనికుడు ఏర్పర్చిన ప్రయివేటు పార్కు ఆ పరిసరాల్లో నివసించే ఆ ధనికుని ఇరుగుపొరుగువారి సౌకర్యాలను పెంచుతుంది. శాస్త్రీయ పరిశోధనవల్ల శాస్త్రజ్ఞులకు వచ్చే లాభాలకంటె సంఘానికంతటకు వచ్చే లాభాలు అధికంగా వుంటవి. సారాయిని తయారుచేసి అమ్మడంవల్ల దాన్ని కొనుగోలుచేసి ఉపయోగించినవారికి దుష్ఫలితాలు కలిగి సాంఘిక నికరోత్పత్తి ప్రయివేటు నికరోత్పత్తి కంటె తగ్గుతుంది. మద్యపానంవల్ల సారా కాపువార్లకు లాభం కలుగవచ్చు. నూతనమైన పనులు జరిగినపుడు నూతనమైన వ్యత్యాసాలు రావచ్చు. ఒక వ్యక్తి మిత్రుడు కొత్తకారుకొన్నపుడు, పాతకారుగల ఆ వ్యక్తికి ఆహ్లాదము తగ్గవచ్చు. పన్నుల్ని, ఆర్థిక సహాయాలను తెలివిగా ఏర్పాటుచేసినట్లయితే సాంఘిక, ప్రయివేటు నికరోత్పత్తులమధ్యగల అంతరాలను తగ్గింపవచ్చు. ఈ దృష్టితో చూచినపుడు వ్యవసాయదారులకు ఆర్థిక సహాయము చేయడము, సారాయి' సిగరెట్లపై పన్నులు వేయడము సమంజసమే అవుతుంది.

వస్తువుల కొనుగోలును పెంచేందుకుచేసే పత్రికా ప్రకటనలలో చాల ప్రకటనలు దండగ మారివే. ఇట్టి దండగమారి ప్రకటనల వల్ల ఉపాంత సాంఘిక నికరోత్పత్తి తగ్గుతుంది. కొన్ని తరహాల పారిశ్రామిక సంఘటనలతోపాటు సాంఘిక లాభాలు కలగగా, మరికొన్నిటితోపాటు అలా జరగదు. ఒక పరిశ్రమలో అనేక చిన్న కార్ఖానాలున్నట్లయితే' శ్రామికులు తేలిగ్గా తమస్వంత వ్యాపారాలను ఏర్పరచుకోవచ్చు. ఈ వ్యాపారాలద్వారా లాభాలనిచ్చే వస్తువులేగాక, వ్యాపార నిర్వాహకుల శక్తిసామర్థ్యాలుకూడ పెంపొందుతవి. చిన్నవ్యాపారస్థుల

యీవిధంగా అభివృద్ధిచెందిన శక్తి సామర్థ్యాలు; ఉపాంత సాంఘిక నికరోత్పత్తిలో చేరతవి. ఒక పరిశ్రమలో పెద్దకార్ఖానాలు ప్రధాన భాగమైనట్లయితే ఎక్కువ శక్తిసామర్థ్యాలు సరిపోయే పనుల్లోనే తప్పనిసరిగ పనిచేయవలసి వస్తుంది. సరఫరా వెల తగ్గినపుడు కూడా సాంఘిక, ప్రయివేటు నికరోత్పత్తులమధ్య తేడా ఏర్పడుతుంది. ఒక తరహా ప్రమాణంగల (One kind of scale of production) పరిశ్రమలో ఉత్పత్తి, వృద్ధి చెందుతున్న ప్రతిఫలాల సూత్రం (Law of increasing returns) ప్రకారము జరుగుతూన్నప్పుడు ఉపాంత సాంఘిక నికరోత్పత్తి ఉపాంత ప్రయివేటు నికరోత్పత్తిని మించి వుంటుంది. గుత్తాధిపత్య పోటీవిధానము (monopolistic competition), పోటీ విధానపు పరిశ్రమలనుండి లభ్యమౌతున్న ఉపాంత సాంఘిక నికరోత్పత్తికి సమానమైన ఉపాంత సాంఘిక నికరోత్పత్తి గుత్తాధిపత్య పోటీ విధాన పరిశ్రమలనుండి లభమవ్వడానికి అవసరమైన పెట్టుబడిని గుత్తాధిపత్య సంస్థలలోకి రాకుండా ఆపి తీరుతుంది.

శ్రామికుల శ్రేయస్సును పెంచడానికి ప్రభుత్వం ఏం చేయగలదన్న చర్చ సంస్థాగత విషయాల చుట్టూ జరిగింది. తీర్పు (arbitration), సంధి (mediation), నిర్బంధ జోక్యము (coercive intervention)లు, శ్రామిక తగాదాలను తీర్చే సాధనాలుగా ఎంతవరకు ఉపయోగించగలవనే విషయం చర్చించబడింది. రోజులో పనిచేసేగంటల కాలాలు, పనికిచ్చే ప్రతిఫలాలు వివిధ రకాలుగా వున్నందువల్ల జాతీయాదాయపు రాశి ఎలా ప్రభావితం అవుతుందో కూడా చర్చించబడింది: "పనిచేయు గంటల కాలానికి, జాతీయాదాయపు రాశికి మధ్యగల సంబంధం విషయంలో ఒక సాధారణ సూత్రాన్ని చెప్పడం వీలుకాదు. వివిధరకాల శ్రామికులు, వివిధరకాల పని విషయంలో యీ సంబంధం వివిధరకాలుగా వుంటుంది"[6] ఎక్కువ గంటలకాలం పనిచేయాలనే ప్రవృత్తి శ్రామికుల్లో కన్పిస్తున్నందున ప్రభుత్వం జోక్యం కల్పించుకోవలసి వుంటుందని పిగూ అభిప్రాయపడ్డాడు.

కార్యఖండ వేతన పద్ధతి (Piece wage) బాగుంటుందా? లేక గంటలరేటు వేతన పద్ధతి (hourly rate) లాభదాయకమా? జరిగినపనిని బట్టి వేతనమిస్తూవున్నప్పుడు, ఉత్పత్తి పెరుగుతూ వున్నట్లయితే, ఆ సందర్భంలో పనిచేయించేవారు వేతనరేటును తగ్గించనట్లయితే, ఏ పద్ధతి మంచిది? "తక్షణ పని ఫలితాలకు తక్షణ ప్రతిఫలాలు వీలైనంత సమానంగా యివ్వబడినట్లయితే జాతీయాదాయ ప్రయోజనాలు, తద్వారా ఆర్థిక శ్రేయస్సు ప్రయోజనాలు అత్యంతోన్నతంగా నెరవేరగలవు... ...కార్యఖండ వేతన పద్ధతిని సమిష్టి బేరాల పద్ధతితో జోడించి నడిపినపుడు యీ ప్రయోజనము చాలా ప్రభావశీలంగా సమకూరుతుంది"[7] పనిచేయించేవారు కార్యఖండవేతన రేట్లను తగ్గించేందుకు చేసే వత్తిడిని లేకుండా చేయడానికి సమిష్టి బేరాల పద్ధతి ఉపయోగపడుతుంది.

వ్యక్తులను పనిలో నియోగించే అత్యున్నత పద్ధతి ఏది? ఉపాంత సాంఘిక నికరోత్పత్తికి, ఉపాంత ప్రయివేటు నికరోత్పత్తికి మధ్యనున్న తేడా యీ సమస్యను తేలికగా పరిష్కరించడానికి అడ్డు తగులుతోంది. ఈరెండూ సమానంగా వున్నప్పుడే ఉత్పత్తి గరిష్ఠమౌతుందని మరువరాదు. "జాతీయాదాయం ప్రయోజనం సిద్ధించడానికి శ్రామికుల నియుక్తి జరగవలసినతీరులో జరగడంకంటె, పనులలో ప్రవేశిస్తున్న శ్రామికులు, ఆపనులు, ఆ పనులు జరుగుతున్నచోట్లు వల్ల కల్గే లాభ నష్టాలను గమనించకుండా పనుల్లో చేరినపుడు ఉపాంత సాంఘిక నికరోత్పత్తి, ఉపాంత ప్రయివేటు నికరోత్పత్తి దాదాపు సమంగా వుంటవి"[8] అయితే ఉపాంత సాంఘిక నికరోత్పత్తిని ఉపేక్షచేసే ప్రమాదంవుంది. వేతనాలు చాల తక్కువగా వున్నప్పుడు వాటిరేట్లను పెంచడంవల్ల 1) శారీరక శక్తి పెరగడంవల్ల 2) ఉత్సాహం పెరిగి దాన్ని పనికి అనువర్తింపచేయడంవల్ల జాతీయాదాయం పెరుగుతుందని పిగూ స్పష్టంగా అభిప్రాయపడ్డారు.

ఆదాయ పునః పంపిణీ విశ్లేషణ చేయడంలో పిగూ అతి సునిశితమైన బుద్ధి సూక్ష్మతను కనబర్చాడు. "సాధారణంగా, ప్రత్యేక మినహాయింపులను అటుంచి, జాతీయాదాయంలోని బీదల మొత్తం భాగాన్ని చెక్కుచెదరనివ్వకుండా జాతీయాదాయాన్ని పెంచేచర్య, జాతీయాదాయాన్ని చెక్కుచెదరకుండా వుంచి, అందులోని బీదల మొత్తం భాగాన్ని పెంచేచర్య తప్పనిసరిగా ఆర్థిక శ్రేయస్సును పెంచుతవి, అయితే యిందులో ఒకదాన్ని పెంచుతూ మరొకదాన్ని తగ్గించే చర్యల ప్రభావం ఆర్థిక శ్రేయస్సుపైన సందిగ్ధంగా వుంటుంది." విశ్లేషణకారుడు ఈ సందిగ్ధతను గమనించగల్గివుండాలి. "స్పష్టంగా చెప్పాలంటే, జాతీయాదాయానికి, ఆర్థికశ్రేయస్సుకుమధ్య యిట్టి వ్యతిరేకత ఏర్పడినపుడు, ఆర్థిక శ్రేయస్సుకు ఏర్పర్చే కారణము దానిపై ఎంత ప్రభావాన్ని చూపిందో తేల్చడానికి, జాతీయాదాయానికి జరిగిన లాభాన్ని (లేక నష్టాన్ని)! బీదల వాస్తవ సంపాదనకు

(real earnings వస్తురూపంలో ద్రవ్య వేతనం లేని సంపాదన) కల్గేలాభాన్ని (లేక నష్టాన్ని) పోల్చి చూడవలసివుంది.'' 9

వనరులను సరాసరి ధనికులనుండి పేదలకు స్థానాంతరీకరణ చేసినపుడు ఆర్థిక శ్రేయస్సు ఎలా ప్రభావితమౌతుంది? యజమానులు స్వేచ్ఛాపూర్వకంగా తమ శ్రామికుల విద్యాసాంస్కృతిక ప్రయోజనాల అభివృద్ధికి ఖర్చుచేసినట్లయితే జాతీయాదాయం పెరుగుతుంది. అయితే బలవంతంగా పన్నుల రూపంలో వనరుల స్థానాంతరీకరణ జరిగితే ఏమౌతుంది? ఫలితాలు ''అస్పష్టంగా'' వుండగలవని పిగూ చెప్పాడు. త్యాగాలలో రావలసిన సమత్వము పురోగామి పన్నుల విధానాన్ని (Progressive taxation) కోరినా, ప్రోత్సాహాల (incentives) పై పన్నుల ప్రభావం అస్పష్టంగా వున్నందువల్ల పన్నులు మితంగా (moderate) వుండవలసి వుంది.

ఆదాయాల పునః పంపిణీ జరిగినందువల్ల శ్రామికుల్లో చురుకుదనం ఏర్పడుతుందా? సాధారణమైన సమాధానం యివ్వ డానికి వీలుపడలేదు. అదంతా యీ స్థానాంతరీకరణవల్ల సోమరులకు లాభం జరిగిందా? కష్టపడి పనిచేసేవారికి లాభం కల్గిందా? వీరిద్దరికి మధ్య భేదాన్ని చూడలేకపోవడం జరిగిందా అనేవాటిపై ఆధారపడి వుంటుంది. మితవ్యయపరుల కుపయోగపడే పేదల కనుకూలమైన శాసనాలు (poor laws) పరిశ్రమకు లాభదాయకములు. దిక్కులేని (Destitute) వారి కుపయోగించే పేదల శాసనాలు (poor laws) సోమరిపోతులకు సహాయ కారులు కాగలవు. అందరికి అను వర్తించే పింఛనులు, పిల్లలకిచ్చే ఆర్థిక సహాయాలు మంచి చెడుల మధ్య తటస్థంగా వుంటవి.

ఆదాయాల సాధారణ స్థానాంతరీకరణ ప్రభావము ఆర్థిక శ్రేయస్సుపై అస్పష్టము. అయితే జాగ్రత్తగా ఏర్పర్చిన ప్రత్యేక ఆదాయ స్థానాంతరీకరణలు, జాగ్రత్తగా నిర్వహించబడి సప్పుడు, వివేకంతో పేదల లాభానికి తోడ్పడేటట్లు చేయబడినట్లయితే జాతీయాదాయాన్ని, ఆర్థిక శ్రేయస్సును పెంచగలవు.

ఆచరణపూర్వకంగా కాకపోయినా, సూత్రప్రాయంగా శ్రేయస్సును కొలవడానికి వీలుంది. అసాధారణ పరిస్థితులలో మినహా, సమానత్వంవైపుకు నడిచే ఆదాయాల పునఃపంపిణీ ఆర్థిక శ్రేయస్సును పెంచుతుంది. ద్రవ్యయూనిట్ల మానంతో జాతీయాదాయాన్ని యూనిట్ల ఆర్థిక శ్రేయస్సు యిచ్చిందనిచెప్పవచ్చు.

పారిశ్రామిక శాంతిప్రాధాన్యతను వివరిస్తూ, పారిశ్రామిక సామరస్యము ఎక్కడ చెడినా ఆర్థిక రంగమంతా పారిశ్రామిక సంబంధాలు (industrial relations) చెడి జాతీయాదాయము, ఆర్థిక శ్రేయస్సు ఎలా భగ్నం కాగలవో, సహేతుకంగా పిగూ చూపించాడు.

ఏదైనా పరిశ్రమ యూనిట్‌లో పారిశ్రామిక వివాదము చెలరేగి సమ్మె జరిగినట్లయితే, కార్మిక ప్రపంచము బాగా సంఘటిత పడివున్నందున, ఆ సమ్మెదారులకు సానుభూతిగా యితర పరిశ్రమల యూనిట్లన్నింటాకూడా సమ్మె మొదలైన జాతీయ ప్రమాణంలో పారిశ్రామిక సమ్మె (industrial strike) జరిగి ఆర్థిక రంగమంతటా ఉత్పత్తి స్తంభించిపోయి జాతీయాదాయం దెబ్బతిని తద్వారా ఆర్థిక శ్రేయస్సు ఏర్పడకుండా పోవచ్చు. రైల్వేలు, ఇంధనోత్పత్తి [fuel producing] పరిశ్రమలలో సమ్మెద్వారాగాని, మరో కారణంవల్లగాని సేవలు, ఉత్పత్తులు ఆగిపోయినట్లయితే, వాటి సేవలను, ముడిపదార్థాలను, వస్తు తయారీ కుపయోగించే పరిశ్రమలందు పని ఆగిపోయి నిరుద్యోగం ఏర్పడవచ్చు. వెంటనే వారుకొనే వస్తువులను తయారుచేసే పరిశ్రమల్లో వస్తువులకు గిరాకి పడిపోయినందున వస్తూత్పత్తి ఆగిపోయి, అప్పుట కూడా నిరుద్యోగం ఏర్పడవచ్చు. క్రమేపి అదే కారణంవల్ల ఒక పరిశ్రమ తర్వాత మరొక పరిశ్రమలో పని ఆగిపోయి సంపూర్ణ నిరుద్యోగిత రావచ్చు. తత్కారణంగా జాతీయాదయను, వస్తు వినియోగము, సంతృప్తి, ఆర్థిక శ్రేయస్సు ఆగిపోగలవు. అందుచేత ఆర్థిక వివాదాలకు, సమ్మెలకు, సమ్మెలు చేయడానికి, సమ్మెలు చేయడానికి అనువైన పరిస్థితులనుకల్పించే వివిధ శక్తులకు ప్రత్యక్ష రూపాలలోను, స్పష్టంగాను పిగూ వ్యతిరేకాన్ని వెల్లడించారు.

## అధోజ్ఞాపికలు

1. ఏ. సి. పిగూ, ఎకనామిక్స్ ఆఫ్ వెల్ ఫేర్, మ క్మిలన్, 1932, పే 92.
2. అదే గ్రంథం పే 25
3. అదే గ్రంథం పే. 31
4. అదే గ్రంథం పే.లు 134 135
5. అదే గ్రంథం పే. 135
6. అదే గ్రంథం పే 463
7. అదే గ్రంథం పే. 487
8. అదే గ్రంథం పే. 490
9. అదే గ్రంథం పే. 645

# "విసుగు"

శ్రీ పి. యస్. శాస్త్రి

టైము మోగుతున్నది. ఒకటి రెండు మూడు నాలుగు అయిదు నిముషం నిముషం మెల్లిమెల్లిగా నడుస్తూ గడుస్తూ, నడుస్తూ...హోష్!...నిట్టూర్పు...అనంతం వేళ్ళువిరిచాడు...ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు...లెక్క...బాగోలేదు...పుస్తకంలో పేజీలు త్రిప్పుతున్నాడు...ఒకటి, రెండు, మూడు, నాలుగు అయిదు...హోష్! హాయ్! దేవుడా!...వరండాలో నడుస్తున్నాడు... అడుగులు భారంగా. బద్ధకంగా పడుతున్నాయి ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు...

మెడ విదిల్చాడు. తలత్రిప్పాడు. ఓ కన్నుమూసి రెండోకన్ను తెరిచాడు రెండోకన్ను మూసి మొదటికన్ను తెరిచాడు. మొదటికన్ను మూసి రెండో కన్ను తెరిచాడు. రెండో కన్ను మూసి మొదటి కన్ను ... ఇలా అనంతంగా ... "డామిట్ చాలు అనంతం!" గట్టిగా పైకి విసుక్కొన్నాడు. చొక్కాగుండీ (బొత్తాము) మెలిగాలాగాడు రాలేదు. మళ్లీ లాగాడు. కొంచెం కదిలింది. మరికొంచెం,మరికొంచెం,మరికొంచెం, మరికొంచెం... "చాలు బొత్తాము తెగుతుంది!"మనస్సు గర్జించింది!... ఆపేశాడు అనంతం అసంకల్పితంగా!

గోళ్ళు కొరకడం మొదలు పెట్టాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు మళ్ళీ వొకటి. రెండు, మూడు, నాలుగు, అయిదు... యిపోయాయి! రెండైదులు పది చేతివేళ్ళూ అయిపోయాయి! కాలివేళ్ళు మిగిలాయి.

గది అటూ, యిటూ చూశాడు. ఏమూలా బ్లేడుముక్క వున్నా లేదు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ... నాలుగు దిక్కులూ అయిపోయాయి. పైన కప్పు, క్రింద నేలా, మిగిలాయి. కప్పు కేసి మెడ నిక్కించి చూసాడు, కప్పులా! అక్కడ తాళంకప్ప ప్రక్కన, బ్లేడుముక్క! హాయ్ హాయ్! దొరికిందీ!

మళ్ళీ మొదలు గోళ్ళు సరకడం! ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు మళ్ళీ ఒకటి, రెండు, మూడు..., అబ్బా! అస్తమానం పైకి లెక్కెట్టక్కర్లేదు.' మనసు కూకలేసింది...అదీ అయిపోయింది!...

గ్లాసులోకి నీళ్ళు వొంపాడు, కూజాలోంచి. బుడ బుడా శబ్దం అవుతోంది. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు...గ్లాసు నిండి నీళ్ళు నేలమీద పొర్లిపోతున్నాయి. సముద్రాలు భీకరంగా ఘోషిస్తూ నేలను ముంచేయడానికి త్రోసుకువస్తున్నాయి. ఖండాలన్నీ నీటిలో మునిగిపోతున్నాయి. ఆసియా, ఆఫ్రికా, ఐరోపా, అమెరికా, ఆస్ట్రేలియా... ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు... మునిగి పోతున్నాయి వటపత్రంపై శయనించిన బాలుడు, చిలిపిగా కళ్ళుమూస్తూ తెరుస్తూ కాలి బొటనవేళ్ళు నోటితో చీకుతూ, నిర్మలంగా, నిశ్చలంగా, కాంతిలో మెరుస్తున్నాడు...నీళ్ళు పాదాలను తడిపాయి. కాళ్ళు వెనక్కు లాక్కున్నాడు... కళ్ళముందున్న రూపం కనుమరుగైంది ... కూజావెనక్కు పెట్టాడు. గ్లాసెత్తి నీళ్ళు గొంతులో పోసుకుని గుటకలు వేస్తున్నాడు. ఒకటి, రెండు, మూడు నాలుగు, అయిదు... "గొంతు నీటితోన నిండిపోతోంది!"...

మెల్లిగా భారంగా అడుగులేస్తూ చాపమీదకుచేరి నడుం వాల్చాడు. చేతివేళ్ళు చిటుకూ చిటుకూ విరవటం మొదలెట్టాడు. ఒకటి రెండు మూడు నాలుగు... మళ్ళ వొకటి రెండు మూడు... నాలుగు...అయిదు...

కనురెప్పలు మూసాడు ... తలుపుచప్పుడైంది ... నీరసం, బద్ధకం, జోడిరిపబడిన గొంతుకలో టెలిగ్రాం మెసెంజరు, "టెలిగ్రాం ప్లీజ్!" అంటూ ఉలిక్కిపడిన అనంతం కంగారుగా

లేవి సంతకంపెట్టి కవరు విప్పాడు. "స్టార్ట్ యిమీడియట్లీ — శంకరం"...

గడియారంవైపు చూసాడు మూడూనలభై. టెలిగ్రాం కాయితంవైపు చూశాడు. గది నాలుగుమూలలా చూశాడు. చెవి మెలితిప్పుకున్నాడు. నెత్తిమీద మొట్టుకున్నాడు. అరచేతులకేసి చూసుకున్నాడు. కాగితంలోని అక్షరాల్ని మళ్ళీ చదవటం మొదలెట్టాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు ... మళ్ళీ ఒకటి...

"స్టాప్! శంకరం ఎవరో గుర్తుకు తెచ్చుకో!" ఏ మూలనుంచో ఆజ్ఞాతశక్తి హెచ్చరించింది. శంకరం ... ఉమా శంకరం...రమాశంకరం...ఎవరీ శంకరం ?... జవాబు మనోఫలకం మీద నేనా తళుక్కున మెరవాలి, మిస్ శకుంతలా 'దీ మాథ మెటిక్స్ ప్రాడిజీకిలా, లేదా బుర్రలో మెరుపు మెరిసినట్టేనా గుర్తుకు రావాలి, జీనియస్సులకిలా !... అదీలేదు యిదీలేదు ఇదీ లేదు, అదీ లేదు, అదీలే...యిదీలే... ఇది అనంతం ! 'అవును నీపేరనంతం !' మనస్సు హెచ్చరించింది.

కళ్ళు మూసుకుని శంకరాలని గుర్తుకుతెచ్చుకోసాగేడు. "శంకర శంకర ఉమాపతే! భవానీశంకర భక్త వశంకర, శంకర..." స్టాప్! దొరికాడు 'భవానీశంకరం !... అమ్మయ్య ! రెండు నెలల క్రిందట యీ వూరొచ్చినప్పుడు, తన సొదంతా చెప్పుకున్నప్పుడు "నేను నీ సంగతి తప్పకుండా కనుక్కుంటా. నేను టెలిగ్రామివ్వగానే బయలుదేరిరా !" అన్నాడు...అతనే "భ॥శంకర !!"...

...అన్నట్టుగానే టెలిగ్రామిచ్చాడు. తను యీలోపల అతని సంగతే మరచిపోయాడు !. "ఫన్నీ !" కళ్ళమ్మట నీళ్ళు తిరుగుతూంటే వెర్రిగా నవ్వుకున్నాడు. "ఫన్నీ ! వెరీ వెరీఫన్నీ !"... ఎలాగైనా వూరు బయలుదేరాలి. గడియారంవైపుకు చూసాడు మూడూయాభై. నాలుగుంపావుకు ట్రెయినుంది. ఆలోగా డబ్బు సంపాదించాలి, టిక్కట్టుకు ... పెట్టెలో సామానంతా క్రింద బోర్లించాడు. బట్టలన్నీ విడి, విడిగా తీసి దులిపాడు, టంగ్, టంగ్... నాణాల చప్పుడు...ఒకటి, రెండు, మూడు... మొత్తం అయిదు పదిపైసల బిళ్ళలు...అలమారు వెతికాడు... దుమ్ముకొంచెం కొంచెంగా పొరలు, పొరలుగా పేరుకుంటోంది. పుస్తకాల క్రింద కాయితం మడతలు. ఆతృతగా విప్పాడు. అడ్రసులు, అడ్రసులు, అడ్రసులు, వ్యక్తులవి, సంస్థలవి... ఎన్నో !...

గదిఅంతా క్షుణ్ణంగా పరిశీలించాడు. ట్రంకుపెట్టె, అలమారు చాప, కూజా, బట్టలదణ్ణెం ! ... బట్టలదణ్ణెం దగ్గరకువెళ్ళి జేబులు డిటెక్టివ్‌లా పరిశోధించసాగాడు. చిన్ని చిన్ని కాగితం ముక్కలు, సిటీబస్సు టిక్కెట్టు కొన్ని, సినిమా టిక్కెట్లుకొన్ని. నీరసం వచ్చేస్తోంది. కనీసం పదిరూపాయలులేందే ప్రయాణం కుదరదు !...

"టిక్ ! టిక్ ! టిక్ !" చప్పుడు...ఆగకుండా ఆదీ కాల పురుషుని గుండె చప్పుడు !... గడియారంకేసి చూశాడు... కాలం మూడు మీద యాభై అయిదు... మూడూ యాభై అయిదు ... అవును!...

మళ్ళీ గడియారంకేసి చూశాడు ... ఇంకోసారి చూశాడు! ఇంకోసారి! ...ఈ గడియారం తాకట్టు పెడితే...అమ్మో! మళ్ళీ తను దాన్ని విడిపించుకోగలడా? ...కాని భవానీ శంకరం దగ్గరకు వెళ్ళకపోతే!...ఎలాగ? వెళ్ళి తీరాలి!...

టిక్, టిక్, టిక్, టిక్, గడియారం చప్పుడూ తన గుండె మోతా కలిసిపోయాయి. క్షణక్షణానికీ శబ్దం, ఘోరంగా భయంకరంగా, మరీ దగ్గరగా వినిపిస్తోంది...తేల్చేసుకోవాలి...ఇంక టైము లేదు...

గడియారంవైపు చూశాడు. మూడూ యాభైయేడు!... ఒకికే చేతులో గడియారం పట్టుకున్నాడు. తన చేతివేళ్ళు టిక్, టిక్, శబ్దానికి ఆదురుతున్నాయి ఒకటి, రెండు, మూడు, గబ గబా అడుగులు వేసాడు గుమ్మంవైపుకు.

కాలికి గడప తగిలింది. తూలాడు. ముందుకు పడ్డాడు. 'ఢన్' మని చప్పుడైంది...గడియారం పగిలిపోయింది!...అయిపోయింది, అంతా అయిపోయింది ఆఖరి ఆశకూడా తీరిపోయింది... అనంతం ఏడుస్తున్నాడు...ఏడవటానికి ఓపికలేకపోయినా ఏడుస్తున్నాడు...కన్నీళ్ళు చెంపలమీదనుంచి ధారగా ప్రవహిస్తున్నాయి.

...కన్నీళ్ళ స్పర్శకు అనంతానికి మెలకువ వొచ్చింది. నేలలో తుడుచుకున్నాడు...గదిలో టిక్, టిక్, శబ్దం వినిపిస్తోంది...ఎక్కడి

దీ శబ్దం? ఈ శబ్దం ఎక్కడిది? అక్కడే!

గడియారంవైపు చూశాడు. మసక చీకటో రేడియం డైలు మెరుస్తోంది. టైము అయిదున్నర!...అంటే. అంటే...ఇదంతా... "నీ మొహం! అర్థం కాలేదా ఇంకా!" మనస్సు తిట్టింది.

పాడైపోవని, గడియారానికి సంతోషించాలో, రాని ఆహ్వానానికి చింతించాలో తెలియని అనంతం కళ్ళు గదివైపుకు మరల్చాడు!

కీచుమనే శబ్దం కప్పునుంచి వినిపించడం ప్రారంభమైంది. అంటే సాయంత్రం అయింది. మరి కాస్సేపట్లో చీకటి పడుతుంది!...

ఈ రోజుకు పోస్టుమాన్ రాలేదు టెలిగ్రాం మెసెంజరేనా రాలేదు! అంటే మళ్ళీ రేపు డెలివరీ టయిము వరకూ నిరీక్షణ!" ఈ అనంతకాల నిరీక్షణలో, ప్రభూ! యీ 'అనంతపు' జీవితసుమం వాడిపోతుంది!"...

నీరసంగా చాపమీంచి లేచాడు అనంతం. భోజనపు టిక్కెట్టు అయిపోయి ఆరు రోజులైంది అయ్యరు అరువిచ్చి అయిదు రోజులు దాటింది. అయ్యరు అనుమానపు చూపులు తట్టుకుంటూ మరోపూట భోజనం చెయ్యాలి...

టిక్, టిక్,టిక్ గడియారం నడుస్తోంది. చేతి వేళ్ళు మడుస్తూ అనంతం లెక్కపెడుతున్నాడు...ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు...మళ్ళీ వొకటి రెండు మూడు నాలుగు అయిదు... దగ్గబోయ డు అనంతం, గొంతు పెగల్చుకునేటందుకు... ఒకసారి, రెండోసారి, మూడోసారి, నాలుగోసారి, రాలేదు;... బలవంతాన దగ్గబోయాడు, వెర్రినవ్వు వచ్చింది, దాని బదులు!

మళ్ళీ ప్రారంభం, ఒకటి రెండు, మూడు, నాలుగు, అయిదు; నిమిషాలు లెక్కపెట టం...గోళ్ళు కొరుక్కోడానికి అలవాటుగా చేయి నోటి దగ్గరగా వెళ్ళింది ..ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు వేళ్ళు అదేవరస! ఒక్క గోరూలేదు! ఏం చెయ్యాలి? ... రెండు, మూడు...లెంకెలు...

"రాదు! రాదు! నీకు మనీఆర్డరు రాదు! లేదు! లేదు! నీకు ఉద్యోగం దొరికే గీతలేదు!" ఎక్కణ్ణుంచో వికటాట్టహాసం వినిపించింది.

మెల్లిగా అనంతం వొక దిక్కుకు చూశాడు. తరువాత రెండో దిక్కుకు ఆ తరువాత మూడో....ఇలా అన్నీ అయిపోయాయి! ఎక్కడా ఆ మాటలన్న శక్తి కనిపించలేదు...ఇవాళ కాకపోతే, రేపు, కాకపోతే ఎల్లుండి, కాకపోతే ..ఎప్పుడో నాకు అపాయింటుమెంటు ఆర్డరు చేతికొస్తుంది...ఇవాళ సాయంత్రం, కాకపోతే రేపు ఉదయం, కాకపోతే రేపు సాయంత్రం, మనీఆర్డరు వస్తుంది..'అనంతం తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు...పేంటు, షర్టు, బనీను, అన్నీ వరసగా తీసి హేంగరుమీద వొకటి వెనుక ఒకటి, వొకటి రెండూ మూడూ అంటూ లెక్కించుకున్నాడు. ఒకటి, రెండు, మూడు నాలుగు అయిదు అంటూ, గదికి తాళంవేసి, అడుగులు లెక్కపెడుతున్నాడు.

---



# అడుగు పెట్టింది ఉగాది

శ్రీ మాదిరాజు రంగారావు

అడుగు పెట్టింది ఉగాది
ఉసురు సురుమంటూ ప్రాణం
మనిషిపై మనిషి విసరే నీడలలో
ఏ రూపమూ గుర్తు పట్టలేకుండా
గ్రంథాలు తగులబెట్టి మేధావులు
ఇండ్లల్లో చలి కాచుకుంటున్నారు
ఆగడాలతో అవుతూంది దేశం
ఆటవిక తత్వానికి దర్పణం
ఇక్కడ ఎవడు ఏ క్షణంలో
ఏ ఆయుధంగా మారేదీ తెలీదు
ఒక లక్ష్యం లేని మనస్సు
పిల్లవాడి చేతిలో రాయి !

కాళ్లను కౌగిలించుకున్న నీడలు
వినిపిస్తున్నాయి శృంఖలా సంగీతం
గొంతుపై కూర్చుంది కాలాని
విసుగెత్తి తిరుగబడి కాలం !
నుదుటిపై గాయాల నుండి
కారే నెత్తురు చారికలతో
ఇప్పటికి గడచింది గండం.

పత్రికలు మొత్తంమీద ప్రదర్శిస్తున్నాయి
వివిధ భంగిమల్లో వేశ్యా పాతివ్రత్యం
వాళ్లకీ గడవాలిగా బతుకు
గొంతు దిగాలిగా మెతుకు

ఆకలిగొన్న ముఖాలు
రొట్టె ముక్కతో శాంతిస్తే
ఆకలిగొన్న ఊహలు
అధికారంలోగాని తృప్తిపడవు
ఆకలిగొన్న చేతలు
రక్తంతోగాని శమింపవు.
భయాల దారుల్లో సంచరించే
తలలపై తిరుగుతున్నాయి
బాంబులతో విమానాలవలె ఆలోచనలు.
చీకటి బాణమై హృదయాలను
దూసుక పోతుంది, హింస,
ధూళి పొరలు చీల్చుకుంటూ
భయాగ్నులు చిమ్ముకుంటూ
మానవత్వం అస్తమించి
నిష్క్రమిస్తుంది తరాల సంస్కృతి ప్రథ.

హింసతో జయధ్వానం
చిత్రిస్తూంది స్వర్గద్వారం
వకిలి గాంధీ ప్రకాశం
కలిగిస్తూందిఉదయభ్రాంతి.
ఒత్తిడిలో నలిగిన ప్రజలులో
ప్రతిబింబుతూ వేసిన ముద్రలలో
మొరటు దేలిన వాలకంతో
కలుషం నిండిన చేతి సంచులలో.

అరిగి ముళ్ళు దిగిన చెప్పులలో
ఇక్కడి నుండి పారిపోయి
ఎక్కడికి పయనిద్దామని, భాయీ!
స్వర్గానికా ? దేవుని సన్నిధికా ?

తలలు మునిగి లేస్తున్నారు గంగలో
కళ్ళుమూసి తెరుస్తున్నారు ధ్యానంలో
పెదవులు కదలిస్తున్నారు జపంలో
కుళీరాలు, కొంగలు; పిల్లులూ.

స్వర్గాన్ని చూద్దాంలే
చచ్చాక ఏలాగో అనీ,
దేవుణ్ణి తలుద్దాంలే
అన్నీ హాయిగా అమరాలనీ,

ఈ మూలనుండి ఆమూలకు దేశంలో
ప్రయాణం చేస్తే సరిపోదు, యంత్రంపై
ఊహలో ప్రతిబింబువులో
ప్రతిఫలిస్తూ దేశం సర్వం,

మట్టిలో ప్రతికణంలో
ప్రతి బింబిస్తూ నీ రూపం
గుండెపై చేయి వేసుకొని
నిద్ర పోగలగాలి, ఎక్కడైనా సరే.

అశాంతి తీగెలపై ఈ దేశం
పలుకుతూంది మృత్యు సంగీతం.
ఇంతకాలం నివురుగా ఉన్న నవ్వు
చెదిరిపోయి వీచే గాలికి
మెరుస్తూంది అంగార రాగం.

తెలిసో తెలియకో
అడుగు పెట్టింది·
ఎలా వెనక్కిపోతుంది తిరిగి
క్రిందికి దిగిన జలపాతం !

అడుగు పెట్టింది ఉగాది
ఉసురు సురుమంటూ ప్రాణం !



# ద్విత్వమకార బిందుపూర్వక బకార ప్రాస

## కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

నేను ఏప్రియలు 1974 భారతిలో, సంశోధిత మహాభారత ముద్రణము - అను శాసనిక పర్యాయమును సమీక్షించుచు, అందు ప్రసక్తమైన - కవిత్రయ భారతము—ఛందః ప్రయోగము—"అన్న వ్యాసమును గూడ సమీక్షించితిని. దానిపై తత్కర్తలైన శ్రీ సంపత్కుమార్ గారు ఈ మార్చినెల 1975 భారతిలో – కలగూరగంపలో శ్రీ నిడుదవోలు వారికిసమాధానం—మనవి: అని సమీక్షను విమర్శించియున్నారు దానిలో 5 శీర్షికలున్నవి కాని వాని నన్నింటిని నేను విమర్శించిన వ్యాసము విస్తృతమగును గాన అందు 3వ విషయమును గూర్చి మాత్రమే ప్రస్తుతము వ్రాయుచున్నాను–వారు వ్యాసమందంతటను "రాసితి - రాసేను– రాత"–అను నీ రీతినే వ్రాసినారు–ఆ శబ్ద ప్రామాణ్యతను గూర్చి ప్రస్తుతము చర్చింపను. విషయమునే ప్రధానముగా గ్రహించుచున్నాను–

ద్విత్వమకారబిందు పూర్వక బకార ప్రాస- నన్నయ భారతమున నీ క్రింది పద్యమున పై ప్రాసగలదు.

> ఇమ్మగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
> బంబున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణ రం
> ధ్రంబను నంజలి దవిలిత్రావుదురట్టి మునీం దలోక వం
> ద్యుంబదముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు
> భక్తితోన్ (1-77)

ఇందు 'మ్మ——ంబ' ప్రాసగలదు. దీనిని గూర్చి నేను చర్చింపగా, నేను వ్రాసిన యరపుట వాత 'వ్యర్థపురాత'గా వ్యాసకర్తలు భావించినారు - వారి యుద్దేశమున నిట్టి ప్రాసయుండదనియే—ఉన్నదని నిరూపించుటకే ప్రస్తుత విమర్శ.

పై "ఇమ్మగ" అను పద్యము నన్నయ స్వంతము గాదు - ఇది యీ క్రింది సంస్కృత శ్లోకమున కనువాదము -

> "శ్రవణాంజలిపుట పేయం విరచిత వాన్ భారతాఖ్య
> మమృతం యశ్చ
> తమహమరాగమ కృష్ణం కృష్ణ ద్వైపాయనం వందే"

వేణీసంహార నాటకము నాంది 3 శ్లోకము.

ఇది యటుండ నిందు-ప్రస్తుతము వ్యాసకర్తలు దీనిని గూర్చి యిటు వ్రాసినారు– "పై పద్యములో 'ఇమ్మగ' అన్న పదమే ప్రయుక్తమైందని నిర్ధారణ అయినప్పుడే. ఆ ప్రాస ఉపయుక్తమైందనవలసియుంటుంది". ఈ సందర్భమున సంశోధితమహా భారతము– ఆదిపర్వమున పై పద్యము క్రిందనిచ్చిన పాఠభేదములను వారు పరిశీలించినట్లు కన్పట్టదు (పుట 29). అందలి పాఠభేదము లివి.

76. 1) ఇంబుగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశుబిం

| | | | | |
|---|---|---|---|---|
| బంబున ... | ... | ... | ... | ర |
| ధ్రంబను ... | ... | ... | ... | వం |
| ద్యుంబరముం... | ... | | ... | కరంబుభక్తితోన్. |

పుటయదుగున–

76. 1) ఇమ్మల—ఇ, ఎ, ఏ, ఓ, స, గ ణ : ఇమ్మగ –చి–చుటు–టం ఇమ్మగ, బింబమ్మున, రంధ్రంబను, వంద్యుమ్ముని వా ఇంబుగ ఆ, ఔ, ద, ర, వీ, స సూళ.

ఇందలి యక్షరము లన్నియు తాళపత్రప్రతుల, ముద్రిత ప్రతుల సాంకేతికము అను తెలుపును -

పై వానిలో–వీ స. సూ. ళ–అనునవి ముద్రిత ప్రతులు– తక్కినవి తాళ పత్రప్రతులు–తాళపత్ర ప్రతులలో 10 ప్రతులలో ఇమ్మల, ఇమ్మగ–అను ద్విత్వమకారములో 'ంబ' ప్రాసలోనున్నవి- మొదటి యైదు ప్రతులలో- ఇమ్మగ- బంబను- ధ్రంబను, ద్యుంబరముం— అను రీతిగా ప్రాసలో నున్నట్లు స్పష్టము—ఇవి ప్రాచీన ప్రతులు— వీనిలో ముఖ్యమైనది 'గణ' యను సాంకేతికము– ఇది గణపవరపు వేంకటకవి యను మహాలక్షణవేత్త "ఆంధ్రప్రయోగ రత్నాకరము అను' లక్షణగ్రంథమును వ్రాసినది ఇది ముద్రితముకాలేదు–

ఈతడప్పకవి సమకాలికుడు — దీనినిబట్టి — అప్పకవినాటికి నన్నయ పద్యము, 'మ్మంబ' ప్రాసతోనున్నట్లు మనము నిశ్చితముగా చెప్ప వచ్చును. తక్కిన నాలుగు ప్రతులలోను-, ఇమ్ముగ' అని ద్విత్వ మకారముతో ప్రారంభమై, తక్కిన మూడుపాదములు ద్విత్వమకార ముతో సరిపెట్టబడినవి—ఇవి ఛందస్సు కొంత తెలిసిన వారివల్ల యేర్పడినది. (ఈ సందర్భమున పూర్వతాళ పత్ర, లేఖకులలో కవులు కూడ నుండెడివారని గ్రహించునది—) వారట్లు సరిపెట్టినను — 'ఇమ్ముగ' అని ద్విత్వమకారముతో పద్యము ప్రారంభమగుట గమనింప దగినవి.

'ఇంబుగ' అన్న పాఠమున్న ప్రతులర్వాచీనములు — అందులో నాలుగు ముద్రిత ప్రతులే—అవి ప్రాయికముగా 'ఇంబుగ' అన్న తాళ ప్రతి ననుసరించినవై యున్నవి.

పై తాళపత్ర ప్రతుల పరిశీలననుబటి — పై నన్నయ పద్య మున — మ్మ-oబ "ప్రాసయే యున్నదని స్పష్టము. ఇటు నున్నను, సంశోధిత ముద్రణమున-'ఇంబుగ' అనియే ముద్రించి మూల పాఠ ముగా ప్రకటించినారు-పుట యడుగున పాఠభేదములలో దీనినిగూర్చి చర్చయేలేదు-(పుట 29) కొన్నిచోట్ల సంశోధిత ముద్రణమున, యతిప్రాస విషయికమైన చర్చ-చేయబడినది-కాని ఈ పటు నరేదు. పై వివరణ సారాంశము. "మ్మ-oబ"-అను ప్రాస యున్నదని నిర్ధారణ-

## లాక్షణికోదాహృతులు

తెలుగున లాక్షణికులు, తమకు ముందు లక్ష్యము లున్నప్పడే, లక్షణముల నుదాహరింతురు-అప్పకవియు తనకు ముందిట్టి ప్రాసకు లక్ష్యముండబట్టియే, తన గ్రంథమున లక్షణము చెప్పినాడు—అయితే ఆతడు లక్ష్యమును తక్కిన వానివలె, లక్షణముక్రిందనే లక్ష్యము నీయలేదు-కాని యాతడు తన గ్రంథమున వేఱొక పట్టున నీప్రాసకు, ఒకటి రెండుకాదు నాలుగు లక్ష్యములనిచ్చినాడు. చూడుడు.

అప్పకవీయము—చతుర్థాశ్వాసము.

1) బింబవృత్తము
ఇమ్మహిలో
గ్రమ్మభగల్
బింబమునన్
గంబుధరా (పుట 230)

2) అంబుజవృత్తము
ఇమ్ముల భకార
రమ్ముల గయు
క్తింబరగు దా
నంబుజమునన్ (పుట 231)

3) భూనుతవృత్తము
ముమ్మరించి దన భాగగముల్ దశ విశ్రా
మంబు భూతలమునందునమానిత మయ్యెన్
జాంబవత్యధిప! కేశవ సారసనేత్రా
కంబునందకగదాధర ఖండితసాళ్వా (పుట 231)

4) సుగంధి వృత్తము-

రంబు జంబు రంబు జంబు రంబు చెమ్మ మీఱంగాఁ
దొమ్మిదింట విశ్రమంబు తోరమై సుగంధికిన్
గ్రమ్మగా నుతింపనొప్పు గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁడాది దేవు డాశరాభ్యుదెప్పఁడున్
(పుట 235)

ఇవి అప్పకవి స్వంత లక్ష్యములు—వావిళ్ళవారి అప్పకవీయమును—రెండు సారులు పరిష్కరించి ప్రకటించిన విద్వాన్ రావూరి దొరస్వామి శర్మ గారీ ప్రాసను గూర్చి వారి అప్పకవీయ పీఠికలో చర్చింపలేదు. ముఖ్యముగా వారు అప్పకవీయ తృతీయాశ్వాసము (యతి ప్రాస విషయికము) నకు వ్రాసిన భావప్రకాశిక వ్యాఖ్యలోను ప్రాసమైత్రి ప్రాస సందర్భమున—పై లక్ష్యముల నుదాహరింపలేదు మనలక్షణ గ్రంథ పరిష్కరణ ధోరణి యిట్లున్నది—ఇందు వల్లను మ్మ—oబ ప్రాస యున్నదే నిర్వివాదముగా నేర్పడుచున్నది.

వారు ఛందఃప్రయోగము - అనువ్యాసములో - (ఆనుశాసనిక పర్వము) 'ఇంబుగ' అన్న పద్యము నుదాహరించుచు నిట్లు వ్రాసినారు.

"ఇట్లుండగా నన్నయగారు ద్విత్వమకారమునకు ఒందుపూర్వక

బకారమునకు ప్రాస చెల్లించినారని

"ఇమ్మగి ... బిం
బమ్మన ... దం
భ్రమ్మను ... వం
ద్యుంబరముం ... భక్తితోన్ ఆది 1 77

అన్న పద్యము చూపబడుచున్నది–ఎవరు చూపినను ఇదే పద్యము" (పుట 47).

ఇచ్చట ఎవరు చూపినను ఇదే పద్యమనుట సరికాదు. ఇప్పటి కైదేండ్ల క్రిందట నేను, అనంతుని భోజరాజీయమునుండి ఈ క్రింది పద్యము చూపినాను–

"ఇమ్ముల కాశికాపురికి నేగడునప్పుడు నందుసుండి య
య్యంబిక పంపునన్ హిమవదద్రి సమీపము కేగునప్పుడున్
క్రమ్మడి వచ్చినప్పుడును ...... మో
దమ్మునఁజెప్పె ... భోజ. 7–23.

ఇచ్చట 'అంబిక' అనియే యుండవలెను గాని — 'అమ్మిక' అనుట యెంతమాత్రమును పొసగదు.

ఆ పుటలోనే యీప్రాస గుఱించి యింకను నిట్లు వ్రాసినారు. "ఇదిగాక ద్విత్వమకారమునకు బిందుపూర్వక (మ) బకారమునకు ధ్వనిసామ్యములేదు గాన పై పద్యమున — ఉన్నదనుకొనబడు ప్రాస ఉండుటకు వీలులేదు" అని సిద్ధాంతము చేసినారు–

మ్మ–ంబలకు ధ్వనిసామ్యముండుటబట్టియే చిన్నయసూరి బాలవ్యాకరణమున– తత్సమ పరిచ్ఛేదము — 42వ సూత్రములో 'మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణ బిందుపూర్వక బువర్ణం బేని వికల్పనగు–అని సూత్రించి.

వృక్షమ్మ–వృక్షంబు అని యుదాహరణ నిచ్చినాడు–ఇది ప్రాసలో కవిప్రయోగములబట్టి చేసిన సూత్రమే–వ్యవహారమున–

బిందుపూర్వక బకారము– ద్విత్వమకారముగా మాఱుచున్నది.
ఉదా : సంబంధము–సమ్మంధము.
నాడుకలో 'సమ్మంధము' అనియేకాని సంబంధము అని బిందుపూర్వక బకారముతో నెవ్వరు నుచ్చరింపరు.

అనంతుని భోజరాజీయమున లక్ష్యముండుటయేగాక, నన్నయ ప్రయోగము ననుసరించి– మ్మ–ంబ–ప్రాసను, అనంతుడు తన ఛందోదర్పణమున తెలిపినాడు.

## ప్రాసపై ప్రతిప్రాస

"గీ. లఘువులు రెండును నొండొంటిఁగవియుఁ బూర్వ
బిందు పూర్వతఁదమలోనఁబొందు బమలు" (1-40)

అని యీ ప్రాసను చెప్పినాడు–అప్పకవి అనంతుని ప్రాసప్రతి–ప్రాసనుబట్టి తానును చెప్పి, స్వంత లక్ష్యముల నిచ్చినాడు. అప్పకవి ననుసరించి తిమ్మకవియు తన సర్వలక్షణ సారాసంగ్రహమునందన్నయ ప్రయోగమేగాక, పిల్లలమఱ్ఱి పినవీరన జైమిని భారతమునుండి మరియొక ప్రయోగమును చూపినాడు.

కూచిరాజు ఎఱ్ఱన (క్రీ. శ. 1480) తన సకలనీతి కథా నిధానములో–అమ్మంత్రీశుడు...

కొమ్మన్...
సంబంధమున
నిమ్మార్గమునన్ అని యీ ప్రాసనాడినాడు.
2–317. వ్రాతప్రతి.

ముద్రణమున–సమ్మంధము-అని కలదు.

ఇందిచ్చిన ప్రయోగములు–మ్మ–ంబ–ప్రాసగలదని నిర్వివాదముగా నేర్పడుచున్నది–

ఇక విరమింతును–

# విరియాల కామసాని గూడూరు శాసనము

(క్రీ.శ 947 ప్రాంతము)

## శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

విరియాల కామసానియను వీరవనిత వేయించిన తెలుగు పద్య శాసనము గూడూరులో నున్నది. అది పూర్వకాలమందలి పద్యశాసనమగుటచేత పేరు సంపాదించుకొన్నది. అనేక ప్రాచీన శాసనములకు వలెనే శాసనమును రచించిన కవి యెవ్వరో తెలియదు. ఆ పద్య శాసన కాలము క్రీ. శ. 1000 ప్రాంతమని చరిత్రకారులు చెప్పుచున్నారు. కాని ఇటీవల లభించిన కాకతీయ రాజుల సంబంధమైన శాసనముల వల్ల శాసన కాలము పునర్విచారణను కోరుచున్నది.

## శా స న ము[2]

చ అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి నసేకులు రాజనందునుల్
సనిన[3] బొరంటి వెన్నడను సంభవుడయ్యె నతి ప్రసిద్ధుడై
వినుత విరోధి[4] మండలిక వెన్నడువెన్నడువోలె, వానికిన్
ఘనుడగు నెఱ్ఱభూపతి జగద్విగితుండుదయించె గీర్తితోన్ 1

ఉ. భావితకీర్తి నాతనికి పాండవ మధ్యమ భీముడోయనం
గా విరియాల భీమ, నృపఘస్మరుడై యుదయించె, వానికిన్
భూవినుతుండు, మండలిక భూషణుఁడెఱ్ఱ నరేంద్రుడుత్తమ
శ్రీ వినుతుండు, బంధుజన సేవ్యుడు దానుదయించెనువ్వలిన్ 2

చ. అతడని[5] వొట్టి బేతవసుధాధిపుఁ జేకొని, వానివైరి సు
ద్ధితముగఁ జంపి, యా కొఱవి దేశమునందు ప్రతిష్ఠ సేసి, త
[6] త్తనయుడు పేరు పొడగలదాయము[7] బిట్టర గద్యనంబు న
ప్రతిముడు వానిదా మొగుదు పల్లియు[8] పంద్రెండునేలు
నిప్పుడే 3

చ. [9] అరుదగు నట్టియెఱ్ఱ నృపుసంగిన గామమసాని[10] యాఁకసే
లరు[11] దని భేతభూవిభుని గాకతి వల్లభు చిన్నవానిఁజా
బరఁగగ నేతఁబట్టి, ఘనుబల్లవరాయని యాఁగిజొచ్చె:[12] భా
స్కరవిబు చక్రవర్తిగని కాకతి నిలుటగోటి సేయనే 4

ఉ. [13] కారక కాలుఁడై పడసె[14] గాడయ నాయకుఁజంపి సూరఁడ
న్వేలుపుగొండ,[15] రవ్వనృపు వేలుపుగొండన నిర్చి, వానిచే
మేలుగ కూడముప్పయిని, మేలుగ నేరెదుబోదిపాదు నుం
మేలుగ చేరు మావిడులు, మేలుగ రెండెయురాజు సంగతై 5

[16] సూత్రధారి కొమ్మోజన బరహ శ్రీ శ్రీ శ్రీ
అడపగట్ట దేవరకు జేను.

## స్వ ల్ప వ్యా ఖ్య

[17] ఆ శాసనములోని మొదటి రెండు పద్యములకు అర్థము తెలియుచున్నది. మూడవ పద్యములోని రెండవ సగమునకు సరిగా తెలియుటలేదు. నాలుగైదు పద్యములలోని మాటలనుండి భావము స్పష్టమగుటలేదు. ఈ పద్యములలో ఆనాటి కన్నడ పదములు కొన్ని యున్నవని కొందరనుచున్నారు. అంతకంటె అవి ఆ ప్రాంతమందలి తెలుగునకు, కన్నడమునకుఁగూడ సామాన్యపదములనుట మేలు.

మూడవ పద్యము మొదటి చరణములోని మాటలను 'పొట్ట బేతఁ' అని చదివి వ్యాఖ్యాతలు అని పొట్ట పెద్దదగుటచేత అట్టి నామమేర్పడిన దనుచున్నారు. కాని అది సరికాదు. ఆ మాటలు 'వొట్టి బేతఁ' అనియే. బేతనిది వొట్టె కులము. కాబట్టి యట్లు చెప్పబడినది.

నాల్గవ పద్యములో రెండవ చరణములోనున్న 'మేల్గరదు'

అనగా ఒక స్థలనామము. మేల్ అనగా పైనలేక ఎగువ, కీ (ఴ) అనగా క్రిందలేక దిగువ అని అర్థములు. అవి ప్రాచీనపు తెలుఁగు పదములు. ఈనాటికిని అఱవములో నున్నవి. మేల రదులో యుద్ధము జరిగినదని యచ్చటి భావము. ఆచరణము 'యొక మేల్కరుండని జేత భూవిభుని కాకతి వల్లభు చిన్నవాని' యని [18] యొక చరిత్రకారుని చేత సవరింపఁబడినది. కాని గరుండయనుటచేత గణభంగము వచ్చినది. సవరణ యధికమైపోయినది.

నాల్గవ పద్యములోని భాస్కర విభుఁడను నది సమకాలిక రాష్ట్రకూట చక్రవర్తి పేరుకాదు. దానిని భాస్కర విభు అని దిద్దవలసిన అవసరములేదు. ఆకాలమున నొక భాస్కరరాజు లేక పోలేదు. తూర్పు చాళుక్యరాజైన అమ్మరాజు II విజయాదిత్యునకు (క్రీ. శ. 945–970) బావమఱది- అనఁగా, అమ్మరాజుయొక్క అత్తమామలైన నాయమాంబకును, నృపకామునకును బిడ్డఁడు: ఈతనికి గండ నారాయణుఁడను బిరుదేర్పడినది. ఇతఁడు పక్షముల మార్పరి. తూర్పు చాళుక్య పక్షముమాని, పడమటి చాళుక్యులవైపు నకుఁబోయి, తిరిగి తూర్పుచాళుక్యులవైపు చేరినాడు. అమ్మరాజునకు శత్రువై, వేంగి రాజ్యమును కైవసము చేసుకొన్న బాదప II మహారాజు నుండి ఆరుంబాక గ్రామమును దానముగొన్న వాఁడు. [19] ఆరుంబాక శాసనములో "భాస్కరో నృపః గండ నారాయణాహ్వాయ,' అని పేర్కొనఁబడినాడు. ఈ భాస్కర విభుడు క్రీ. శ. 947 ప్రాంతములో [20] అమ్మరాజు II పక్షమును వదలి, అమ్మరాజుయొక్క దాయాదియైన బాదపుని పక్షమునచేరి, అమ్మరాజును సింహాసనచ్యుతుని చేసెను. కామసాని శాసనములోఁ బేర్కొనఁబడిన భాస్కరవిభుఁడితఁడేయని చెప్పవచ్చును. కామసాని భాస్కర నృపుని సాయమును గూడఁగొని కాకతివల్లభునిఁ గాపాడెను.

అంతకుపూర్వము మఱియొక భాస్కరరాజున్నాఁడు. క్రీ. శ. 922 లో తూర్పు చాళుక్యరాజ్యమును పాలించిన విజయాదిత్య IV కొల్లాభిగండడు, కొల్లాభిగండ భాస్కరుఁడని కూడ [21] శాసనములోఁ బేర్కొనఁబడినాడు. అయితే అతని కాలము పూర్వమగుటచేత విడువవలసియున్నది.

బాదప మహారాజునకు అన్ని విధముల సాయముగానున్నవాడు రాష్ట్రకూటచక్రవర్తియైన కృష్ణుడు III. కాఁబట్టి శాసనములో జెప్పఁబడిన చక్రవర్తియతఁడేయనవచ్చును. బేతనికి కొఱవి రాజ్యమీయఁ బడినది.

బేతనికిని, రవ్వ నృపునకును బాధలు కలిగించిన పల్లవరాయని గుఱించి తెలుసుకొనవలసియున్నది. ఆపేరునకు పల్లవులతో సంబంధము కనఁబడదు. అయినను ఆనాటి పల్లవుల చరిత్రను సూచించెదను.

నృపతుంగ చక్రవర్తి యను పల్లవ చక్రవర్తి (క్రీ. శ. 855–896) యొక్క కుమారుఁడైన అపరాజిత చక్రవర్తి (క్రీ.శ. 879–897), చోళరాజైన మొదటి ఆదిత్యునిచేత సంపూర్ణముగా నోడింపఁబడఁగా (క్రి. శ. 897) పల్లవరాజ్యము కొంత చోళుల వశమైనది. వరంగల్లు ప్రాంతమున పల్లవుల యునికి స్పష్టముగా తెలియదు. అయితే పల్లవ రాయఁడెవ్వఁడు? ముంచికొండ రాజ్యమును పాలించుచున్న ముదిగొండ చాళుక్యుఁడైన కుసుమాయుధుఁడే ఇందు పేర్కొనఁబడినాడనవచ్చును. పలరాయఁడు, పల్లవ (=పేము) రాయఁడనునవి కుసుమాయుధ రాజునకు మాఱుపేర్లు. కాబట్టి శాసనములోని పల్లవరాయఁడు కుసుమాయుధరాజు.అయితే ముదిగొండ చాళుక్యవంశములో చాలమంది కుసుమాయుధ నామధారులున్నారు. అందుచేత శాసన కాలమునకు సరిపోవు కుసుమాయుధుని మాత్రమె గ్రహింపవలసియున్నది.

రవ్వనృపుఁడు గుర్తింపునకు తగులుటలేదు.

శాసనములో ప్రతి పేరునకు ముందు 'మేలుగ' అను పదమున్నది. అది మేల్ (=ఎగువ), కీ (ఴ) అను పదములలో మేల్ సంబంధమైన పదమని తోచుచున్నది. శాసనములోఁ జెప్పబడినవి ఎగువయూళ్ల పేర్లై యుండును. అంతేకాని దానికి ప్రత్యుపకారముగా అను అర్థముకాదనవచ్చును. ప్రత్యుపకారముగా అనునదే దాని యర్థమైనయెడల అన్నిసార్లు ఆ పదమును చెప్పవలసిన యవసరము కనఁబడదు

[22] శాసనములో కాదయ నాయకుఁడని యుండఁగా దానిని చరిత్రకారులు కాదవ నాయకుఁడని భావించుచు, పల్లవులను కాడవులనుచున్నారు. కాఁబట్టి అతఁడెవ్వఁడో పల్లవుఁడని సరిపెట్టుకొనుచున్నారు. అది భావ్యముగా లేదు. శాసనములో కాదయ యనియే యున్నది. కాడయయను పేరుగల ఆ నాయకుఁడెవ్వఁడో

మనకు తెలియదు భావిపరిశోధనకు విడువవలసియున్నది.

## శా స నాం శ ము లు

శాసనములోని యంశములను సంగ్రహముగా తెలుసుకొనెదము. దుర్జయ వంశములో [23] విరియాల వంశమునది యొక శాఖ. దుర్జయ వంశములో వెన్నుడు పుట్టినాడు.

అతడు మండలికుడు. అతని కుమారుడు ఎఱ్ఱభూపతి. వానికి విరియాల భీముడు జనించెను. ఆతనికి మండలిక భూషణు డనదగిన ఎఱ్ఱనరేంద్రుడు జన్మించెను. అతని కాలమున వొట్టి బేతనిమీదికి శత్రువు దండెత్తెను. ఎఱ్ఱనరేంద్రుడు బేతనికి సేయ ముగాబోయి శత్రువును సంహరించి, బేతనియొక్క కాకతీయ రాజ్య మును నిలబెట్టెను. అట్లు బేతనిని రక్షించి కొంత లాభమును పొందెను. మఱియొక సమయమున బేత భూవిభునిమీదికి మేల్నరదు గ్రామమువద్ద పల్లవరాయడు ఎదిరింపగా, ఎఱ్ఱనృపుని భార్యయైన కామసాని సేనతో వచ్చి పల్లవరాయని వోడించి, పశ్చిమ చక్రవర్తి యొక్క యనుజ్ఞతోనే కాకతి బేతనికి సాయముచేసి, రాజ్యమును నిల బెట్టగలిగినది.

వేలుపుగొండను పాలించు [24] రవ్వనృపాలుని మీదకు కాడయ నాయకుడు దండెత్తి వచ్చినాడు. విరియాల సూరడు ఆ కాడయను చంపి, రవ్వనృపుని రాజ్యమున రక్షించి, కొన్ని యూళ్లను బహుమా నముగా గొనెను.

ఈ శాసనము విరియాల వంశమువారి ఘనతను వర్ణించు చున్నది. అయితే వారెక్కడ పాలించుచున్నదియు అందు చెప్పబడ లేదు. కాని శాసనమున్న గూడూరు ప్రాంతమునకె విరియాలవారు మండలికులై యుందురు.

## కా క తీ యు లు

కామసాని శాసనమును సమన్వయించుటకు ముందుగా కాక తీయ బేతని పూర్వవంశ చరిత్రను తెలుసుకొనవలసి యున్నది. ఆ వంశములో [25] దుర్జయుని పేరు మొదట చెప్పబడినది. అతడు పౌరాణిక పురుషుడుగాక చారిత్రక వ్యక్తియేయని చెప్ప వచ్చును. క్రీ. శ 575 నాటి రేనాటిచోడుడైన ధనంజయరాజు వేసిన ఒక శాసనములో దుర్జయుల ముత్తరాజు అను రాజవంశస్థుడు సాక్షిగా పేర్కొనబడినాడు. దానినిబట్టి దుర్జయుడను వ్యక్తి అంతపూర్వపువాడై యున్నాడు. అతడు కరికాలచోడునికి (క్రీ. శ. 485 ప్రాంతము) తర్వాతివాడై, రేనాటి వంశమునకు మూల పురు షుడైన వ్యక్తి (లేక ఆతని బిరుదు) కావచ్చును. అతడే కాకతీయ వంశస్థులకు కూటస్థుడా? దుర్జయుడను పేరుగల మఱియొక డున్నాడు. తూర్పు చాళుక్యులలో ... దటివాడైన కుబ్జవిష్ణువర్ధ నుడు దుర్జయరాజును క్రీ. శ. 624 ప్రాంతములో గెల్చి తూర్పు తీరమును స్వాధీనము చేసుకొన్నాడు. ఆ కాలమందే అటవీ దుర్జయు డొకడున్నాడు.

[26] కాకతీయ గణపతిదేవుని గరవపాడు శాసనమునుండి వారి పూర్వులు కరికాలచోడుడు,దుర్జయుడుఅనితెలియుచున్నది.కరికాలచోడ సంబంధమే నిజమైన యెడల వారు తెలుగు చోడులని చెప్పవలసి యున్నది. బేతరాజుయొక్క త్రిపురాంతక శాసనములో ఆతని 'కుల పురము' కాకతి యనియు, అతడు కాకతి పురప్రభువనియు గలదు. కాకతి పురమిప్పుడులేదు. కాని అది నతవాటి సీమలో అనగా, ఇప్పటి వరంగల్లు జిల్లా, మధిర తాలూకా (ప్రాంతము), లేక కొండపల్లిసీమ (మానుకోట తాలూకా)లో నుండినదనవచ్చును. ఆ వంశములోని యొకడైన కాకర్త్య గుండ్యన (క్రీ. శ. 950 ప్రాంతము) కాకతి పదమునుండియే కాకర్త్య పదమును సాధించినాడని భావింపవచ్చును. కాకతీయ గణపతిదేవుడు పాఖాల, కాంచీవర శాసనములలో తాను క్షత్రియుడనన్నాడు. విద్యానాథమహాకవి కాకతీయులు అర్కేందుకుల ప్రసూతులని చెప్పినాడు. అయితే దుర్జయవంశస్థులు చతుర్థకులజు లని చారిత్రకులు చెప్పుటచేత కాకతీయులు చతుర్థ కులజులని భావింప వచ్చును.

పూర్వకాకతీయులను గుఱించి చెప్పబడిన మఱికొన్ని ముఖ్యాం శములను చూచెదము. [27] బేతరాజుయొక్క పూర్వికులు కందార పురమునుండి వచ్చిరట! అది ఇప్పటి నాందేడుజిల్లాలోనున్నది. దానికి తూర్పున కొంత దూరములోనున్న బాసర్ గ్రామములో ఏక వీరాదేవి పూజ ఇప్పటికిని జరుగుచున్నది. బేతనికి [28] పూర్వికులు రాష్ట్రకూటులు అన్నంత మాత్రమున వారు రాష్ట్రకూట చక్రవర్తి యొక్క జాతివారని తలంపవలసిన యవసరములేదు. రట్ట, రట్టోడి

యను మాటలకు సంస్కృతీకరణము రాష్ట్రకూట. రట్ట, రట్టోడి

## పూర్వకాకతీయ వంశవృక్షము

(సామన్త వొట్టికులము)

దుర్జయుఁడు

(కాకతినేలెను) వెన్న (క్రీ. శ. 825-850?)

గుండ I (850-875 ?)

గుండ II (875-900?)

రాష్ట్రకూట గుండ III (900-912)

కుఱ్ఱవాడి(కొఱవి)పాలకుడు ఎఱ్ఱ (912-940)

బేత I (940-950)

కాకర్త్య పిండి గుండ (గుండ IV 950 990)

(అనుమకొండపాలకుఁడు) (గరుడ) బేత II (990-1030)

ప్రోల I (1030-1075)

శబ్దములకు గ్రామాధికారి యని అర్థము. అంతేకాదు. కాకతీయులు [29] సామంత విష్టి లేక [30] సామంత వొట్టి కులమువారు అని శాసనములం దున్నట్లు చెప్పఁబడినది. వొట్టి కులమె [31] విష్టి కుల మని సంస్కృతీకరింపఁబడియుండును.

కాకతీయుల మూలపురుషుఁడైన దుర్జయుని చరిత్ర మనకు తెలియదు. పిమ్మట చాల కాలమునకు వచ్చినవాఁడు వెన్నఁడు. అతఁడు (క్రీ. శ. 840 ప్రాంతము) కాకతిపురము నేలెను. అంతట వారు కాకతీయు లైరి. వానికి పిమ్మట గుండ అను పేరు గలవారు ముగ్గురు వరుసగా పాలించిరి. వారిలో కొందఱి చరిత్ర ఇటుపైన చూచెదము.

## కాకతీయ రాజ్యము—మంచికొండ రాజ్యము

రాష్ట్రకూట చక్రవర్తియైన కృష్ణుఁడు II (క్రీ.శ. 877-913) తూర్పు చాళుక్య రాజ్యమునకు పడమట నున్న రాష్ట్రకూటమును పాలించుచుండఁగా, తూర్పు చాళుక్య రాజైన గుణగ విజయాదిత్యుఁడు (క్రీ. శ. 848-891) తన పరిపాలనా కాలముయొక్క చివరి పాదములో తెలంగాణములోని తూర్పు ప్రాంతమును వశపఱచుకొనఁ బూనుకొనెను. అందలి కరీంనగర్ జిల్లా ప్రాంతమును వేములవాడ చాళుక్య రాజైన బద్దెగ పరిపాలించుచుండెను. అతఁడు రాష్ట్రకూట కృష్ణ II నికి సామంతుఁడు. వా రిరువురును కలిసి ఎదిరించిరి; కాని విజయాదిత్యునిచేత నోడింపఁబడిరి. ఆ నాటి నుండి వరంగల్ జిల్లాలోని కొఱవి నుండి కృష్ణాజిల్లాలోని కొండపల్లి వఱకును తెలుఁగువారైన రణమర్దక వంశమువారు పాలించుచుండిరని చెప్పవచ్చును. ఆ ప్రదేశ మంతకును మంచికొండ లేక మణికొండ లేక ముదిగొండ నాడని పేరున్నది.

కాకతి నగరమును పాలించుచున్న కాకతీయులు రాష్ట్రకూటులకు ఆశ్రితులు. గుణగ విజయాదిత్యుఁడు దక్షిణాపథమునకు ప్రభువైనప్పుడు కాకతి పురమును వొట్టి కులమువాడైన రెండవ గుండడను రాజు పాలించుచుండెను (క్రీ. శ. 875-900?). తాత్కాలికముగా అతఁడు గుణగ విజయాదిత్యునకు లొంగియుండెనని చెప్పవచ్చును. గుణగునకు పిమ్మట చాళుక్య భీముఁడు I వేంగికి రాజాయెను. అంతవఱకు నూరుకొన్న రాష్ట్రకూట రెండవ కృష్ణుఁడును, బద్దెగయు వేంగీ రాజ్యమును జయింపఁ గోరి, ముదిగొండ చాళుక్యుడైన కుసుమాయుధుఁడు పాలించుచున్న కొఱవి రాజ్యము మీ దికి దండెత్తిరి.

[32] అంతట రణమర్దాన్వయతిలకుఁడైన కుసుమాయుధుఁడును, చాళుక్య భీముఁడు I ను శత్రువుల నెదిరించిరి. ఆ రాష్ట్రకూట రాజు పక్షమున సామంతుఁడైన వొట్టి గుండడు II పోరుట సహజము. ఆ యుద్ధములో తూర్పు చాళుక్య భీముఁడు I ఓడిపోఁగా, [33] వేములవాడ చాళుక్యుఁడైన బద్దెగ. చాళుక్య భీముని పట్టుకొనెను. అయితే కుసుమాయుధుఁడును, తూర్పు చాళుక్య వీరులును విజృంభించి చాళుక్య భీముని విడిపించిరి. యుద్ధము ముగిసినను రాజ్యముల సరిహద్దులు మారలేదు. పిమ్మట క్రీ. శ. 892లో చాళుక్యభీముI ని పట్టాభిషేకము జరిగినది.

[34] రణమర్దక వంశము అంతరించినది. ఆ వంశమువారి కుమార్తెను ముదిగొండ చాళుక్య వంశీయుఁడైన కొక్కిరాజు వివాహము చేసుకొన్నాడు. వారి పుత్రుని పేరు కుసుమాయుధుఁడు. వీరు ముదిగొండ ప్రాంతమును పాలించుటచేత ముదిగొండ చాళుక్య

లైరి వీరు చిరకాలము పాలించిరి.

కాకతీయ రెండవ గుండనికి పిమ్మట వాని కుమారుఁడు రాజ్యమునకు వచ్చెను. వీని పూర్తి పేరు రాష్ట్రకూట మూఁడవ గుండడు. వీని చరిత్ర కొంచెముగా మాంగల్లు, మచిలీపట్టణ శాసనము నుండి తెలియుచున్నది. రాష్ట్రకూట చక్రవర్తియైన కృష్ణుఁడు II మఱియొకసారి చాళుక్య భీముని మీఁదికి దూకినాడు. మూఁడవ గుండన (900-912) రాష్ట్రకూట చక్రవర్తితోఁ గూడ వచ్చినాడు. ఆ యుద్ధములో తూర్పు చాళుక్యులు గెల్చినారు. రాష్ట్రకూటుల సరిహద్దు ప్రాంతమైన కుఱ్ఱవాడిని (ఇది కొఱవి ప్రాంతము కావచ్చును) గెల్చుకొన్నారు. యుద్ధములో మూఁడవ గుండఁడు మరణించుటచేత, గుండని కుమారుఁడైన ఎఱ్ఱఁడు (912-940) కాకతీయ రాజ్యమునకు ప్రభువయ్యెను. ఈ సరిహద్దు తగాదాలు తఱచుగా జరుగుచుండుటచేత కొఱవి ప్రదేశము కొంత చేతులు మారుచుండినదని చెప్పవచ్చును.

తూర్పు చాళుక్య సింహాసనమును దాయాదియైన యుద్ధమల్లుఁడు II ఆక్రమించుకొని ఏడు సంవత్సరములు పాలించినాడు. రాష్ట్రకూట సింహాసనమునకు అమోఘవర్షుఁడు హక్కుదారుఁడు. కాని అతని తమ్ముఁడైన గోవిందుఁడు IV రాజ్యమును క్రీ.శ.930లో ఆక్రమించుకున్నాడు. అంతట రాజకుటుంబములోను. సామంతులలోను పక్షము లేర్పడినవి. లేములవాడ చాళుక్యుఁడైన అరికేసరి II అమోఘవర్షునివైపు చేరినాడు. మంచికొండనాటిని పరిపాలించుచున్న 35 విజయిత (ఇతఁడు ముదిగొండ చాళుక్యుఁడైన కుసుమాయుధుని కుమారుఁడు.) కూడ శత్రుపక్షమున చేరఁగా. గోవిందుఁడు యుద్ధమునకు వెడలినాడు. అంతట విజయితరాజు అరకేసరి II ని శరణుజొచ్చినాడు. ఆతఁడు సాయము చేయఁగా, విజయితరాజు యుద్ధములో గెల్చినాడు. తూర్పు చాళుక్యరాజ్యములో యుద్ధమల్లు II ని పదచ్యుతినిచేసి చాళుక్య భీముఁడు II సింహాసనస్థుఁడైనాడు. ముదిగొండ చాళుక్యులకు మరల నెమ్మది కలిగినది. కాకతీయులు చిన్న మాండలికులై రాష్ట్రకూట చక్రవర్తులను విశ్వాసముతో సేవించుచుండిరి. కాకతీయ ఎఱ్ఱరాజు మరణించుటచేత బేతఁడు రాజైనాడు. (940-950)

మరల ప్రభుత్వములో సంక్షోభము కలిగినది. తూర్పు చాళుక్యరాజైన చాళుక్య భీముఁడు II క్రీ. శ.945 లో మరణించగా అతని పెద్దకుమారుఁడైన దానార్ణవునకు సింహాసనము దక్కకుండ సవతిసోదరుఁడైన అమ్మ II విజయాదిత్యుఁడు VI రాజ్యమును ఆక్రమించుకొన్నాడు. అయితే రాష్ట్రకూట చక్రవర్తియైన కృష్ణుఁడు III వేంగి వ్యవహారములలో జోక్యము కలిగించుకొన్నాడు. యుద్ధమల్లు II ని కొడుకైన బాదపరాజు, కృష్ణుని సాయముతో అమ్మరాజు II ను ఒకింత వెడలించి పట్టాభిషేకమును క్రీ. శ. 945 లో గావించుకొన్నాడు. మరలఁగట్టి ప్రయత్నమునుజేసి బాదపుఁడు, రాష్ట్రకూట రాజైన కృష్ణ II ని సాయముతో, రాజ్యము సంపాదించుకొన్నాడు. ఒదే కాలమున ముదిగొండ కుసుమాయుధునకు, కాకతీయ మొదటి బేతనికి జరిగినయుద్ధములో సిరియాల కామసాని, శాసనములోఁజెప్పఁబడినట్లుగా బేతనిపక్షము వహించి యుద్ధముచేసి కుసుమాయుధుని పరిహరించి బేతనకొఱవి రాజ్యమును నిలఁబెట్టినది. ఆ శాసనములో బేతనికి కల్పిన యవస్థలు వర్ణింపఁబడినవి. ఇతనికి పిమ్మట ఇతని కుమారుఁడైన కాకర్త్య గుండ్యన రాజాయెను. కొంతకాలము పాలించి బాదపరాజు మరణించెను.

అంతట అతని సోదరుఁడైన తాళపరాజు II సింహాసనమునకు వచ్చినాడు. కాని అమ్మరాజు II తిరిగి సైన్యముతోవచ్చి, తాళరాజు II ను చంపి, వేంగీపరిపాలనను ప్రారంభించినాడు. అయితే 955 లో కృష్ణుఁడు III వేంగిమీఁదికి దండయాత్ర చేయఁగా. అమ్మరాజు II పారిపోయినాడు. కృష్ణుఁడు అమ్మరాజునకు సోదరుఁడైన దానార్ణవునకు రాజ్యమిచ్చినాడు. ఈ యుద్ధములో (క్రీ. శ. 956) కాకతీయ రాజైన కాకర్త్యగుండ్యన, కృష్ణునికి సాయము చేసినాడు. వాని పూర్తిపేరు కాకర్త్యసిండిగుండన. ఆతఁడు వేంగిలో కొన్నినెలలుండి దానార్ణవునకు పరిపాలనలో తోడ్పడినాడు. 36బొమ్మశర్మకు గ్రామమును దానము చేయించినాడు. అయితే దానార్ణవుడు రాజ్యమును దక్కించుకొనలేదు! అప్పుడే అమ్మరాజు II మరల వచ్చి రాజ్యమును పొందినాడు. ఆ దశలో కాకతీయ సిండిగుండనగతి యేమైనది? అతడు మరల తన రాజ్యమైన కొఱవి రాజ్యమునకు పారిపోయి ఎప్పటివలె రాష్ట్రకూట సామంతునిగా నుండి యుండును. అతఁడు మరణించఁగా అతని కుమారుఁడైన గరుడాంకబేత లేక గరుడబేత రాజాయెను. 37 అతఁడు అనుమ,కొండ యను వీరులను సంహరించి అనుమకొండను రాజధానిగాఁజేసుకొనెను. రాష్ట్ర కూట ప్రభువులకువలెనె అతనిది కూడ గరుడధ్వజము.

కాలము పోనుపోను రాష్ట్రకూటములయొక్క, పొరుగు

సామంతులైన కాకతీయులయొక్క, విరియాల వంశజుల యొక్క శత్రుత్వమును ముదిగొండ చాళుక్యులు తట్టుకొనలేక పోయిరి. కొంచెము కొంచెముగా ముదిగొండ రాజ్యమును కాకతీయులు కబళింపఁగా, ముదిగొండ చాళుక్యులింకనూ దక్షిణమునకు వచ్చినారని చెప్ప వచ్చును.

రాష్ట్రకూటులు బలహీనులై దానార్ణవునకు సహాయము చేయలేకపోయిరి. అయినను దానార్ణవుఁడు స్వశక్తితోనె అమ్మరాజు II ను ఎదిరించి, చంపి, తూర్పుచాళుక్య రాజ్యమును గ్రహించినాడు. తన రాజ్యమును విస్తరింపదలఁచుకొని, కడప ప్రాంతమైన పొత్తపిపై ఁబడినాడు, ఆ ప్రదేశమును వైదుంబరాజైన భువనత్రినేత్రుఁడు రాష్ట్రకూటులకు లొంగి పాలించుచుండినాడు.. కాని యుద్ధములో ఓడిపోయినాడు. తనకు గట్టిసహాయము చేయుటచేతకావోలు, దానార్ణవుఁడు పొత్తిపిని ముదిగొండ చాళుక్యులైన మల్లన్న, గొండియ రాజులకు క్రీ. శ. 971 ప్రాంతంలో ఇచ్చినాడని . [38]కందాయము శాసనము తెల్పుచున్నది.

రాష్ట్రకూట రాజ్యములోని పరిస్థితులు మారిపోవుచున్నవి. పడమటి చాళుక్యుఁడైన రెండవ తైలపుఁడు రాష్ట్రకూటరాజ్యము నాక్రమించుకొని 973 నుండి 997 వఱకును పరిపాలించెను. అదే కాలమున తూర్పు చాళుక్య రాజ్యములో కల్లోలము బయలుదేరినవి.

## శా స న కా ల ము

గూడూరు శాసనకాల మేది యనునది పెద్ద ప్రశ్న. శేషాద్రి రమణకవులు ఒకచోట పదియవ శతాబ్దమనియు, మఱియొకచోట గణపతిదేవుని (పదమూడవ శతాబ్దము) కాలమునాటిదనియు వ్రాసిరి. చిలుకూరి వీరభద్రరావుగారు, మరి కొందఱును, అది క్రీ. శ. 1000 ప్రాంతము నుండిన బేతని కాలముదనిరి. అదియే అమలులో నున్న సిద్ధాంతము. అయితే ఆ చారిత్రికులకు క్రీ. శ. 1000కి ముందొక బేతఁడున్నాడను విషయము అప్పటి కింకను తెలియదు. కాఁబట్టి వారి కాలనిర్ణయము పొరపాటగుట కవకాశమున్నది.

ఇప్పుడు నిర్ణయించవలసిన దేమనఁగా — ఆ శాసనములో జెప్పఁబడిన బేతరాజు క్రీ. శ. 1000 ప్రాంతమున నున్నవాఁడా లేక క్రీ. శ. 947 ప్రాంతమున నున్నవాఁడా? ఈ ఇద్దఱి / బేతరాజుల కును కొన్ని ముఖ్యమైన భేదములున్నవి. వానినిబట్టియే నిర్ణయింపనగును. 947 ప్రాంతపు బేతని రాజధాని కొఱవి మాత్రమే. అతఁడు పొట్టి బేతఁడు. వేరె బిరుదావళి లేదు. కాని. క్రీ శ. 1000 ప్రాంతపు బేతనికి గరుడ బేతఁడని పేరున్నది. పైగా అతని కాలమున అనుమకొండ రాజధాని యైనది. గూడూరు శాసనములోఁ జెప్పఁబడిన బేతనికి గరుడ అను బిరుదులేదు. పైగా అతని రాజధాని కొఱవి మాత్రమే. అతఁడే కాకతీయ వంశములో మొదటి బేతఁడగుచున్నాడు. అట్లు గూడూరు శాసనకాలము క్రీ.శ. 947 ప్రాంతమని నిర్ణయింపవచ్చును. నన్నయభట్టు వ్రాసిన ఆంధ్రమహాభారతభాగము క్రీ. శ. 1050 ప్రాంతపుది కాగా, కామనసాని శాసనము సుమారుగా ఒక శతాబ్దము పూర్వమున క్రీ. శ. 947 ప్రాంతములో పుట్టినది.

## వి రి యా ల వం శ ము

[39] విరియాల వంశమువారికి కాకతీయులతో చిరకాల సంబంధమున్నది. రెండు వంశములవారును దుర్జయునే మూలపురుషునిగా జెప్పుకొనుచున్నారు. వీరి వంశములు శతాబ్దములుగా ప్రసిద్ధి నొందినవి.

## ఛ ం ద స్సు

ఈ శాసనములో మూఁడు చంపక మాలలు, రెండు ఉత్పల మాలలున్నవి చంపకమాల చరిత్రను కొంచెముగాఁజూచెదము. [40] అది పాటలనుండి అనఁగా దేశియ ఛందస్సు నుండి సంస్కృతములోనికి తీసుకొనబడిన దనవచ్చునని కోరాడ రామకృష్ణయ్యగారు పరిశోధించి తెల్పిరి. దానికి సంస్కృత కవిత్వములో విపుల ప్రచారములేదు. మాఘ మహాకవి శిశుపాలవధలో నొక చంపకమాలను వ్రాసినాడు. గుణగ విజయాదిత్యుని (క్రీ. శ.850 ప్రాంతము) సాతులూరి శాసనములో ప్రాసగల చంపకమాలా శ్లోకమున్నది. రాజశేఖరాది సంస్కృతకవులు అంక్షణము నుపయోగించిరి.

దాని చరిత్ర అట్లుండఁగా, కన్నడ వాఙ్మయము నుండి తెలుగువారు చంపకమాలను గ్రహించిరని చెప్పిన యొక కవి చరిత్రకారుని పలుకులలో సత్యము కన్పడదు.

కామనసాని శాసనము చారిత్రకముగాను, వాఙ్మయపరముగను బహు ముఖ్యమైనది.

# అధోజ్ఞాపికలు:

1. గూడూరు శాసనము, లక్ష్మణరాయ పరిశోధక మండలివారు (హైదరాబాదు) ప్రకటించిన తెలంగాణా శాసనము.
గూడూరు, మాటూరు శాసనములకు తొలుత ప్రతులను సంపాదించినవారు దూపాటి రమణాచార్యులుగారు. (కాకతీయాంధ్ర యుగ చరిత్ర—చిలుకూరి వీరభద్రరాయకృతము, 1936, పుట 52).

2. ఇందలి పద్యములు కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర— చి. వీ. పుట 50, ఆంధ్ర కవితరంగిణి—చాగంటి శేషయ్య కృతము— సం 2 పు 49: తెనుగు కవుల చరిత్ర— నిడుదవోలు వెంకటరాయ కృతము 1953 పు 101లో పునర్ముద్రితములు. పద్యముల పాఠము సరిగా తెలియకపోవుట కొన్ని చోట్ల వివిధ పాఠము తీయ బడినవి.

3. పిఱుంద పెన్నడని చెప్పబడిన పాఠము పొరపాటు. ప్రతాపచరిత్ర (కాసె సర్వప్ప కృతము)లో పొరికి పెన్నడని చెప్ప బడినదియు పొరపాటె. అది పొరంటి పెన్నడను వద సంపుటి మాత్రమె. (భారతి, జూన్ 1960 పు 4)

4. రెండవ పద్యములో గూడ మండలిక అనియే యున్నది.
పెన్నడు (ప్రాచీన తెలుగు పద్ధతిని విభక్తి యేర్పడినది) (విష్ణువు)

5. పొట్టి యనునది వంశ నామము.

6. మూల పాఠములో యతి తప్పుటచేత సంస్కరించినారు. ఇంకను విమర్శకులు సూచించిన కొన్ని పాఠములు— 'తత్తనయు సమేతు డొడగవి . . . యము' 'యాత తనయు పేరు', బేతని కొక కొడుకున్నట్లును, వాడ ప్రతిముడైనట్లును భావించుచు, ఆత తనయు = అతని తనయు' ఇది కన్నడ భాషలోని పద్ధతియని చాగంటి శేషయ్యగారు వ్రాసిరి. పిమ్మటి చరణ భాగమునకు సూచించ బడిన యొక పాఠాంతరము— 'మొగుడు పర్సియు పంద్రడు నెఱ్ఱ డాప్తుడై'. ఏదైనను 3, 4 చరణముల అర్థము స్పష్టముగా లేదు. నాల్గవ చరణములో ప్రాస సరిగా లేదు.

7. బిట్టరయనునది యూరి పేరు కావచ్చును. 'చిట్టర బుధాంబు లెంక' యను పేరున్నది (ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, రాజమండ్రి వారి సం 8—1 పుట 74).

8. 'పంద్రడు' అనునది 'తంపడు' వంటి క్రియా పదమా? లేక ఇప్పటి అఱవ భాషలో ఉన్న పంద్ర (చేయు) శబ్దమా?

9. పై మూడుపద్యములకు, కడపటి రెండు పద్యములకు సంబంధములేదు. ఇందలి విషయములు ఎఱనకు పిమ్మట జరిగినవి. కొఱవి మండలమునకు కాకతి ముఖ్య పట్టణమై యుండును.

10. (ఆకె = ఆమె?), ఆక = నిరోధించుట, మేలు = మేలు, కరద: బుద్ధి, అగి: అడ్డగించి, చొచ్చె : ఆశ్రయించె యని శేషయ్యగారు అర్థమును చెప్పుచున్నారు. కాని మేల్ కరదు అనునది యొక గ్రామము పేరై యుండును.

11. అని: యుద్ధము

12. 'బాస్కర నిభు'యై యుండునని కొందరి యూహ. కాని ఆ కాలమున ఒక భాస్కర రాజున్నాడు.

13. ఈ పద్యమునకును పై పద్యమునకును సంబంధములేదు. దీనిలో జెప్పబడిన సూరడు విరియాల వంశము వాడై యగును. కాని పై వారితో వీనికి గల సంబంధము తెలియదు. ఈ పద్యములో ల, ర ప్రాస యున్నది.

14. కాడయ పదమును కాడవయని చదివి పల్లవుడనుచున్నారు. కాని కాడయ యనునది యొక వీరుని పేరై యుండును.

15. రవ్వ నృపుడనగా నృప రత్నమని శేషయ్యగారు అర్థము చేసుకొనుచున్నారు. కాని అది యొక రాజు నామమై యుండును. రవ్వరాజు నుండి సూరడు పడసిన గ్రామ నామములు పేర్కొనబడినవి.

16. శిల్పి కన్నడిగుడగుటచేత బరహ (: వ్రాత) అని వ్రాసుకున్నాడు.

17. శాసన పద్యములను గురించి కాకతీయాంధ్ర రాజ యుగ చరిత్ర (చి. వీ)లో పు 51—59 లోను, ఆంధ్ర కవితరంగిణి (చా.శే.) సం 2 పు 49—56 లోను చర్చింపబడినది.

18. భారతి, ఏప్రిల్ 1967 పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు వ్రాసిన కాకతి మైలాంబ, బయ్యారం చెఱువు శాసనము, పు. 8.

19. నృపకామ సంహాతు పుత్రో
జ్యోత్స్నాతి బుద్ధి మాన్గణ్య నారాయణః
శ్రీమాన్గ జారూఢ క్రాశలః
పటు శ్శూర శ్శుచిర్దక్ష, శీల గుణాన్వితః
ధనుష్మత్పురుష శ్రేష్ఠ స్సర్వకలామచ.
మాతా పితృ పదాంభోజ భ్రమరో
భాస్కరో నృపః, గణ్య నారాయణ హ్వాయ

పూర్వ శాస్త్ర భృతాంవర. (E 9 Xi X 146)

20. వేంగీ తూర్పు చాళుక్యులు (ఆంగ్లము) నేలటూరి వెంకటరమణయ్యగారి రచన, 1950 పు 185.

21. 9 A XIII పు. 248.

22. ఆంధ్ర కవి తరంగిణి, సం 2 పు 54లో పల్లవు లనియె భావింపఁబడినది.

23. విరియాల వంశము మఱి కొన్ని శాసనములు ఆం. ఇ.ప. మండలి వారి సం. 7 భాగము 2 పు. 124లో ఉన్నవి.

24. కాకతి బేత రాజె రవ్వన్నపుఁ డనియు, కాకతీయుల మొదటి రాజధాని వేలుపుగొండయనియు, కుందూరి ఈశ్వరదత్తుగారు (ప్రాచీన చారిత్రక భూగోళము పు. 311) చేసిన సమన్వయము సరిగా లేదని చెప్పవచ్చును.

25. చిలుకూరి వీరభద్రరావుగారు కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రలో (పు 62—68) చర్చించి దుర్జయుడు దుర్యోధనునకు కొడుకు కాడు: రణ దుర్జయుఁ డనువాఁడు కాడు, కరికాలుని వంశస్థుఁడు కాడు అని చెప్పి, వాని కాలము తెలియదనిరి.

26. ఆంధ్రుల చరిత్ర— సంస్కృతి (ఖండవల్లి లక్ష్మీరంజనం: బాలేందు శేఖరంగార్లు) పు 244—46.

27. సిద్ధేశ్వర చరిత్ర (కాసె సర్వప్ప వ్రాసిన ద్విపద కావ్యము) — ఖండవల్లి లక్ష్మీరంజనముగారి పీఠికలో, 1960.

28. కాకతి మైలాంబ బయ్యారము చెఱువు శాసనము.

'భారతి ఏప్రిల్ 1967 పు 2—9) (2) మాంగల్లు శాసనము. ఏ పి. ఇండికా xxxi పు. 31.

29. ఖాజీపేట దర్గా శాసనము.

30. ఎ పి ఇండికా xxxi పు 42 పంక్తి 35.

31. విష్టియను సంస్కృత పదమునకు ప్రతిఫలము లేకుండ చేసెడి చాకిరి యని యర్థము. అదే తెలుగులో వెట్టి యనుచున్నారు, అట్టి సందర్భములో వొట్టి యను దాని విష్టియని సంస్కృతీకరించుట చిత్రముగాఁ గనబడును. వొట్టి, వెట్టి మాటలకు ఒకే యర్థముగాఁ గనఁ బడుచున్నది. వెట్టి చాకిరిలో భాత్త విష్టియను రక మొకటి కలదని (ఏన్ ఎడ్వాన్స్‌డు హిస్టరీ ఆఫ్ ఇండియా (మజుందార్, రాయ్‌చౌదరి దత్తకృతము— పు 187) లో యున్నది. అంధక వృష్ణి, అంధక వృష్టి, అంధక విట్టి యనునవి ఒకే పదము యొక్క భిన్నరూపములు. వానిలోఁ గూడ విట్టియనునదె తొలి రూపమై యుండును.

32. కొలని శాసనము (తెలంగాణా శాసనములు) పుట 163—65.

33. ఈ యంశముం కన్నడ భారతమైన పంప భారతములోనున్నది.

34. అపరిష్కృత శాసనము (మల్లంపల్లి సోమశేఖరశర్మ రచన) ఆంధ్రపత్రిక భావ సంవత్సర సంచిక.

35. వేంగీ తూర్పు చాళుక్యులు (నే. వెం. ర.) పు 148—150, 173 77)

36. ఏ. ఆర్. ఇ. రాగి శాసనము 1 సం. 1916—17.

37. పైన జెప్పిన బయ్యారం శాసనము.

38. ఏ. ఆర్.ఇ రాగి శాసనము 26, 1937—38 భాగము II పేరా 12.

39. సూర్యాపేట తాలూకాలోని మామిళ్లగూడెములో కాకతీయ గణపతి చక్రవర్తి కాలము నాటి (1249) శాసనములో విరియాల వారి ప్రస్తావనయున్నది. (భారతి, జనవరి 1970 పు 80)

40. చంపకమాల వృత్తము. దేశీయమా, సంస్కృతమా? అను వ్యాసము (కోరాడ రామకృష్ణయ్యగారి రచన) వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రి షష్టి పూర్త్యుత్సవ సంపుటము.

# కలగూరగంప

## ద్రవ్యోత్పత్తి–కాలవైచిత్రి

ద్రవ్యం పరమాణువుల మయమని తెలుసు. పరమాణువులో ప్రధానంగా ఉన్నవి ప్రోటాన్లు, న్యూట్రాన్లు, ఎలెక్ట్రాన్లు. వీటిని ద్రవ్యకణాలుగా భావిస్తారు. శక్తి సాధారణంగా తరంగ రూపంలో ఉంటుంది. ఒకప్పుడది కణధర్మాలను ప్రదర్శిస్తుంది. అట్టి శక్తి కణాన్ని ఫోటాను అంటారు. శక్తి తరంగాల పౌనః పున్యం బట్టి వాటి పొడవు మారుతుంది. పౌనఃపున్యం ఎక్కువైన కొద్దీ పొడవుతగ్గి తరంగాల చొచ్చుకొనిపోయే సామర్థ్యం పెరుగుతుంది. ఒకవిధంగా చెప్పకోవాలంటే ఎక్కువ పౌనఃపున్యాలవద్ద కణస్వభావాన్ని, తక్కువ పౌనఃపున్యాలవద్ద తరంగ స్వభావాన్ని శక్తి ప్రదర్శిస్తుంది. అందుచేత రకరకాల ఫోటాన్లు ఉన్నాయి. మామూలు కాంతి ఫోటాన్లకంటె X కిరణ ఫోటాన్లు, అంతకంటె గామా కిరణ ఫోటాన్లు ఎక్కువ సమర్థవంతమైనవి. ఫోటాన్లకు కణధర్మాలున్నా వాటిని ప్రాథమికంగా శక్తిగానే భావిస్తారు.

ఎలెక్ట్రానుకి ఆవేశంలోతప్ప సర్వసమమైన కణముంది. అది పాజిట్రాను. ఎలక్ట్రాను ఆవేశం ఋణాత్మకమైతే పాజిట్రాను ఆవేశం ధనాత్మకము. అంతకంటె వాటి కెట్టి భేదంలేదు. అవి ఒకే సారి జన్మిస్తాయి. జన్మించి వ్యతిరేకదిశలలో పరుగెత్తి పోతాయి. ఆరెండు కలుసుకొన్నప్పుడు హఠాత్తుగా లయమై ఫోటానుగా రూపాంతరం పొందుతాయి. వాటి సృష్టిలయాల చరిత్ర అద్భుతం!

ఎలెక్ట్రాను పాజిట్రాన్ల జంట సృష్టి, లయాలతో కాలం ధరించే పాత్ర మన ఊహకందనట్లుంది. నిజానికి కాలమేమిటో మనకు సరిగ్గా తెలుసు ననలేము. సృష్టికీలకం కాలంలో దాక్కొని ఉందని విజ్ఞులంటారు. మన జీవితాలన్నీ అనంత సూక్ష్మమైన వర్తమానంలో చిక్కుకొని ఉన్నాయి. అవిచ్ఛిన్నంగా ప్రవహించడమే కాల లక్షణ సారము. గతాన్ని మానసికంగా దర్శించగల అవకాశాన్ని జ్ఞాపక శక్తి ప్రసాదిస్తుంది కాని, గడచిన కాలభాగంలో అడుగు పెట్టగల భాగ్యం జనసామాన్యానికి లేదు. గతం గతమే కాని గతాన్ని వర్తమానం లోకి తెచ్చుకోగల సామర్థ్యం మనకు వైజ్ఞానికంగా లేదు.

కాని, ఒక చిత్రం జరుగుతుంది అంటారు విజ్ఞానులు. కాలంలో వెనక్కు ప్రయాణంచేసే సామర్థ్యం జీవ జాలానికి లేక పోయినా జడద్రవ్యానికి ఉన్నట్లు నిదర్శనం కనిపిస్తూందట!

ఒక కణం ఉనికిని కాలాకాశాలలో గ్రాఫు మూలంగా నిరూపించవచ్చు. ఆకాశాన్ని అడ్డంగావున్న అక్షం నిరూపిస్తే కాలాన్ని నిలువు అక్షం నిరూపిస్తుంది. ఒక కణం స్థిరంగా ఉంది, కొన్ని గమనంలో ఉన్నాయి. వాటి నేవిధంగా సూచించడం ?

కాలం నిరంతరం ముందుకు పోతూంది. మనకు తెలిసేది వర్తమానం మాత్రమే. అది అత్యంత స్వల్పము. గమనంలో ఉన్న కాలంలో వర్తమానాన్ని దర్శించాలి దానికొక కిటుకుంది. ఒక అట్ట ముక్కలో అడ్డంగా సన్నటి చీలికను కోసి ఆ అట్టను ఏకరీతి వేగంతో గ్రాఫుమీద జరుపుతూ ఉంటే, ఆ చీలికలో వర్తమానం కనిపిస్తుంది.

ఒక కణం ఆకాశంలో స్థిరంగా ఉన్నా కాలంలో వ్యాపించి ఉంది. అందుచేత కాలాకాశాలలో దాగి స్థితిని ఒక గీతతో సూచించాలి అట్టి గీతను ప్రపంచరేఖ (Word line) అంటారు. కణం స్థిరంగా ఉంటే దాని ప్రపంచ రేఖ నిట్టనిలువుగా ఉంటుంది కణం గమనంలో ఉంటే దాని ప్రపంచ రేఖ గమన దిశకు అనుగుణ్యంగా కుడికో ఎడమకో వాలి ఉంటుంది. కణం అడదిడ్డంగా తిరుగుతూంటే రేఖ కూడా క్రమరహితంగా ఉంటుంది.

Y
1
2
3
K
L
M
N
కాలము
4
5
6
O
X
ఆకాశము

పటము 1లో KL అట ముక్క. దానిలో వర్తమానాన్ని సూచించే చీలిక MN. అదెప్పుడూ అడ్డంగా ఉంటుంది. అట్టను

ఒకే వేగంతో—అంటే నిరంతరంగా—నిలకడగా జరుపుతూ ఉండాలి. కణాల ప్రపంచ రేఖలు 6 ఉన్నాయి. 1వ రేఖ స్థిరంగా ఉన్న కణాన్ని, 2వ రేఖ కుడివైపు పోతూన్న కణాన్ని, 3వ రేఖ ఎడమవైపు పోతూన్న కణాన్ని, 4వ రేఖ అడ్డదిడ్డంగా గమించే కణాన్ని విరూపిస్తాయి. V ఆకారంలో ఉన్న 5వ రేఖ కణాలజంట ఉత్పత్తికి, Λ ఆకారంలో ఉన్న 6 వ రేఖ కణాల జంటలయాన్ని నిరూపిస్తాయి.

అట్టముక్కను నిలువుగా జరుపుతూఉంటే ఒకటోకణం చలన రహితంగా స్వస్థానంలో ఉన్నట్టు కనిపిస్తుంది. రెండోకణం కుడివైపు, మూడోకణం ఎడమవైపు, నాలుగోకణం క్రమరహితంగాను గమిస్తూన్నట్టు కనిపిస్తాయి. 5 వ దాంట్లో ఒక స్థానం నుంచి రెండు కణాలు ఉత్పన్నమై చెరోవైపూ పోతూన్నట్టూ, 6వ దాంట్లో రెండు కణాలు ఒకచోట కలిసి లయమైనట్టూ కనిపిస్తుంది.




ఇప్పుడు రంగస్థలం సిద్ధంగాఉంది. నాటకం ప్రారంభం అవుతుంది. ఇందులో పాత్రవహించేవి మూడు కణాలు, రెండు ఎలెక్ట్రాన్లు $E_1$, $E_2$, ఒక పాజిట్రాను $P_2$ - పటము2. వర్తమానమనే చీలికను పైకి జరుపుతుందంటే A వద్ద ముందొక ఎలెక్ట్రాను $E_1$ కనిపిస్తుంది. అదికుడివైపు పోతూంది. కొంచెం సేపటికి C వద్ద కణాల జంట ఉత్పన్నమైనట్టు $P_2$, $E_2$, అవి కుడి ఎడమలకు చెదిరిపోకున్నట్టు చూస్తారు. వాటిలో పాజిట్రాన్ $E_1$ వైపు పోతూంది. మరికొంత సేపటికి B వద్ద $E_1$, $P_2$ కణాలు కలుసుకొని లయమైపోతాయి మిగిలిపోయిన $E_2$ మాత్రం తనదారిని D వైపు పోతుంది. ప్రారంభంలో ఒకే కణం $E_1$ ఉంది, అంతంలో ఒకేకణం $E_2$ ఉంది. సంప్రదాయసిద్ధంగా AB, CB, CD లు మూడు కణాల ప్రపంచరేఖలను నిరూపిస్తాయి. ఇందులో విపరీత మేదీలేదు. మనదృష్టిలో ఒక ఫోటాన్‌నుంచి C వద్ద కణాల జంట పుట్టడం, B వద్ద కణాలజంట ఫోటానుగా రూపాంతరం పొందడం జరిగింది.

అయితే, నిజానికి ఉన్నది ఒక్కటే కణం, అది మూడు కణాలుగా భాసిస్తూంది అన్నాడొక విజ్ఞాని. $E_1$ ఒక్క కణమే ఉందట. అది A నుంచి B దాకా పోయేసరికి దానికొక తలపు తగిలి కాలంలో వెనక్కు పోయిందట. C దాకా కాలంలో తిరోగమించే సరికి మరో గట్టి తాపు తగిలి కాలంలో ముందుకు CD వెంబడి పోయిందట. B నుంచి C కి కాలంలో వెనక్కుపోయిన ఋణావేశంగల ఎలెక్ట్రానే మనకు కాలంతో ముందుకుపోతూన్న ధనావేశంగల పాజిట్రాముగా భాసించిందట.

దీనిని బాగా అర్థంచేసుకోడానికి A, B, C,ల సంఘటన కాలాలు వరసగా 5 గం; 5–10 గం.లు; 5–20 గం.లు అనుకొందాము. 5 నుంచి 5–20వరకు $E_1$ ఎలెక్ట్రాను కాలంలో ముందుకు పోయింది. 5–20కి ఒక గట్టి తాపు తగిలి ఆ ఎలెక్ట్రాను కాలంలో వెనక్కుపోయింది, అంటే B నుంచి C దాకా పోయింది. ఆ విధంగా కాలంలో 5 10ని చేరుకొంది. C వద $E_1$ కు సమయం 5-10 అప్పుడు, మరొక గట్టి తాపుతగిలి కాలంలో ముందుకు CD మార్గాన్న పోయింది. 5 నుంచి 5–20 వరకు గడిచే 20 నిమిషాలలో $E_1$ కనిపిస్తుంది, 5 10 నుంచి 5-20 వరకు గడిచే 10 నిమిషాలలో కాలంలో వెనక్కు వస్తూన్న ఋణావేశంగల $E_1$ ధనావేశంగల $P_2$ గా కాలంలో ముందుకు పోతున్నట్టుగా కనిపిస్తుంది. అదే సమయంలో కాలంలో ముందుకు పోతూన్న $E_2$ గా కనిపిస్తుంది. దీనిని అంగీకరిస్తే మూడు కణాలకు బదులు ఒకే కణాన్నికూడా అంగీకరించాలి. అప్పుడు మూడు ప్రపంచరేఖలు కలిసి ఒకే ప్రపంచరేఖ అవుతుంది. అందుకోసం BC బాణంగుర్తు మీదికి ఉన్నదానిని కిందికి మార్చాలి. అట్టు మార్చిస్తే కణ గమనం A నుంచి B కి, B నుంచి C కి, C నుంచి D కి అవిచ్ఛిన్నంగా జరిగినట్టూ, ABCD ఒకే ప్రపంచరేఖగా మారినట్టు స్పష్టమౌతుంది. ఈమధ్యప్పులో కణం కాలంలో వెనక్కు పోయినట్లు

అంగీకృతమయింది.

మనం చూచేమనుకొన్న దేమిటి ? మూడు కణాలు మూడు ప్రపంచరేఖలు. C వద్ద శక్తిఫోటాను నుంచి కణాలజంట ఉత్పత్తి. B వద్ద కణాలజంట లయము.

నిజంగా ఉన్నదేమిటి ? ఒకేకణం, ఒకే ప్రపంచ రేఖ B వద్ద C వద్ద కణానికి గట్టితాపులు. కొంత సేపు కణం కాలంలో వెనక్కు ప్రయాణం చేయడం.

కాలంలో తిరోగమన మనే భావం వీలర్ (Wheeler) శాస్త్రజ్ఞునికి తట్టినపుడు ఒక్క త్రుటిలో అద్భుతమైన విశ్వవ్యూహాన్ని దర్శించేడట. అది బహుశా విశ్వంలో ఉన్న ఎలెక్ట్రాన్లను పాజిట్రాన్లను ఇముడ్చుకొన్న మంజుల చిత్ర యవనికను నేయడానికి కాలం అనే మగ్గంలో ఒకే ఎలెక్ట్రాను ముందుకూ వెనక్కూ ముందుకూ వెనక్కూ ముందుకూ వెనక్కూ కండెలాగ ఆడటం !

—*శ్రీ వసంతరావు వేంకటరావు.*

## "మానవల్లి కవి రచనలు"

పోయిన నెల "భారతి"లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు వెలయించిన మానవల్లి కవి రచనలను సమీక్షించుచు సుగృహీత నామధేయులు తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వ్రాసిన వ్యాసమును జదివితిని. అందు వారు నూతనవిషయము లెన్నియో తెలియఁజేసిరి. కాని కోదండరామయ్యగారు చెప్పిన యొక గొప్పమాట సవరణను గోరుచున్నది.

కోదండరామయ్యగారు మానవల్లి రామకృష్ణకవిగారు తెలిఁగించిన భాసనాటకములను గూర్చి వ్రాయుచు కవిగారు "అవిమారకము" "కర్ణభారము" అను వానిని మాత్రమే తెలిగించి ప్రకటించిరని నిర్ణయించిరి. కాని వెంటనే

"... అలాకాక వారు ఆయేడు నాటకాలను ప్రకటించి ఉండి, వాటిలో ఏ ఒక్కటైనా ఏదైనా గ్రంథాలయంలో గానీ, ఎవరిదగ్గరనైనా గానీ లభిస్తే ఈ అభిప్రాయం మార్చుకోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అలాగే వారు అనువదించామని చెప్పుకొన్న యితర నాటకాల అనువాదాల తాలూకు లిఖిత ప్రతులు వారిపుత్రుల దగ్గరో, బంధువుల దగ్గరో ఉండి వాటిని సంపాదించగలిగితే ఆ అభిప్రాయం కూడా మార్చుకోవడానికి నేను సిద్ధం. ఏతావతా మానవల్లికవిగారు భాస నాటకాల్లో ఒక్క "కర్ణభారం" "అవిమారకం" అన్న రెండురూపకాలనే అనువదించి ప్రకటించారనీ, తక్కినవాటిని కూడా అనువదించి ఉండడమూ, వాటిలో ఏడింటిని ప్రకటించి ఉండడమూ సందేహాస్పదమనీ, వాటిని అన్నిటినీకూడా అనువదించి ప్రకటించాలనే సంకల్పం మాత్రం వారికి ఉండి ఉండవచ్చునీ నా దృఢమైన అభిప్రాయం"

అని వ్రాసిరి. కోదండరామయ్యగా రీదృఢాభిప్రాయమును మార్చుకోవలయును. దానికి హేతువు లివి.

కవిగారు ప్రకటించిన మిగిలిన భాసనాటకముల మాట నాకుఁ దెలియదుగాని, వారు "బాలచరితము" నాంధ్రీకరించి ప్రకటించిరి. దాని ప్రతి నాకడనున్నది. అది నాచేతికందిన తీరు తెలియఁజేయుదును.

ఇప్పటి కిరువదియేండ్ల నాటిమాట. నేను మద్రాసు రాజధానీ కళాశాలా విద్యార్థిని. డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారు మాయాచార్యులలో నొకరు. మానవల్లి రామకృష్ణకవిగారు చరమ దశలో దుర్భరదైన్యము ననుభవించుచుండఁగా, అప్పారావుగారు కవిగారిని తిరుపతినుండి మద్రాసునకుఁ దోడ్కొని వచ్చిరి. ట్రిప్లికేన్‌లో విక్టోరియా హాస్టలునకు దగ్గఱ నొకయింట కవిగారిని నిలిపిరి. కవిగారి కప్పులకు రాజధాని కళాశాలలో నాంధ్రభాషాసాహిత్యములు ప్రధాన విషయములుగాఁ జదువుచున్న విద్యార్థినీ విద్యార్థులు విరాళములిచ్చిరి. అప్పారావుగా రొకపదిరోజులపాటు కళాశాల కార్యక్రమము ముగిసిన పిదప కవిగారికి సేవచేయుటకు నన్ను నియమించిరి. ఆ పది రోజులలో రామకృష్ణకవిగారు మద్రాసులోనే పేటకుఁ దీసికొని వెళ్లుమని కోరిరో వారి నక్కడికెల్లఁ దీసికొనిపోయితిని. ఈవిధముగా నానాటి యాంధ్రభాషాసాహిత్య విద్యార్థులు తమకుఁ జేతనైనట్లు కవిగారికి నూడిగము చేసిరి.

ఆ సందర్భముననే అప్పారావుగారు కవిగారు ప్రకటించిన గ్రంథములు మూఁడు నాత్సల్యముతో నాకిచ్చిరి. అవి 1. కుమార సంభవము ద్వితీయ భాగము (కవిగారు నన్నెచోడని కుమార సంభవమును రెండు భాగములుగా వెల్లడించిరి) 2. బాలచరితము. 3. భైరవకవి రచియించిన "శ్రీ రంగమహత్త్వము" ద్వితీయాశ్వాసము.

"బాలచరితము"! మద్రాసునందలి "వేపేరి"లో నున్న సి.యస్

ఆర్ఫనేజు ప్రెస్సులో ముద్రిత మయ్యెను. దాని ముఖ పత్రము పయి భాగమున నాంగ్లాక్షరములలో "బాల చరిత్ర ము," అని యున్నది. క్రింది భాగము కుడి వైపున Translated by M Rama krishna kavi M. A. అని యున్నది. ఇంత కంటె వేఱు సమాచారము మన కీరూపకమును గూర్చి తెలియదు. కవిగారు దీనికి పీఠికయు వ్రాయలేదు. ఈ రూపక మే సంవత్సరమున నాంధ్రీకృతమో, యే సంవత్సరమున ముద్రితమో మనకుఁ దెలియుటలేదు.

ప్రథమాంకాదిని ప్రస్తావనానంతరము నారదుఁడు ప్రవేశించి
"అహం గగన సంచారీ త్రిషు లోకేషు విశ్రుతః
బ్రహ్మలోకా దిహ ప్రాప్తో నారదః కలహప్రియః"
అని పలికినట్లు మాతృకలో నున్నది. కవిగారాశ్లోకము నిటు తెలిఁగించిరి.

ఆ. వె. నన్ను ముజ్జగంబు లెన్ను, నాకసమున
రాకపోక లెపుడు నాకుఁ గలుగు
సత్యలోక మెడలి చనుదెంచు చున్నాఁడఁ
గలహ మొకడ నాకుఁ గామితంబు

ఇప్పట్లనే మాతృక యందలి "నారాయణాయ నరకలోక పరాయణాయ" యను శ్లోకమును యథాతథముగా రామకృష్ణ కవిగా రాంధ్రీకరణమునఁ జేర్చిరి. కవిగారి బాలచరితాను వాదమును గూర్చిచెప్పవలసిన విశేషములు పెక్కులు గలవు.

కవిగారి భాస నాటకానువాదములను గూర్చి వ్రాయుచు అప్పారావుగారు "తెలుగు నాటక వికాసము" (పారట 319)లో "వీరి కర్ణభారము" మున్నగు అనువాదములు భాసనాటకముల సంస్కృతమూలములు 1913 లో ప్రకటితము లైనంతనే వెలువడిన"వని వ్రాసిరి.

ఇక శ్రీరంగ మహత్త్వము విషయము. అది మొట్టమొదట 1912 సం.లో వెలుఁగు చూచెను. కవిగారా కావ్యమునకు మద్రాసులో 1912 సం. జూన్ 5 వ తేదీనాఁడు పీఠిక వ్రాసిరి. ఆ కావ్యము ముఖ పత్రము పై భాగమున "విస్మృత కవులు" అని యెడమ వైపునను. "సంపుటము8" అని కుడివైపున నున్నది. మధ్య భాగము నుండి ఈ క్రింది విధముగా నున్నది.

ఇది
వనపర్తి సంస్థానాధీశ్వరులగు
సవై రాజారామేశ్వరరావు
బహిరీ జర్వంతు మహా భూపాలరావు బహద్దరువారి
యాజ్ఞానుసారముగా
మా. రామకృష్ణ కవిగారిచేఁ
బరిష్కరింపబడెఁ
—
—చెన్నపురి
జ్యోతిష్మతీ ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడియె.
—
1912

ముఖపత్రము పయి నున్నట్లే మూఁడవ పారటలోఁ గూడ నున్నది. ఈ "శ్రీరంగ మహత్త్వము" సంపూర్ణముగా ద్వితీయ ముద్రణము పొందినదా? యనునదొక ప్రశ్నము. అప్పారావుగారు శ్రీరంగ మహత్త్వము', ద్వితీయాశ్వాసమును నా కిచ్చిరని మనవి చేసితిని' అది యొక పత్రిక భాగము. దాని ముఖపత్రము పై భాగము కుడి వైపున "The Intermeediate Examination 1931" అని యున్నది. మూఁడవ పారటలో నీ క్రింది విధముగా నున్నది.

శ్రీ
శ్రీరంగమహత్త్వము
భైరవ కవి ప్రణీతము
(ద్వితీయాశ్వాసము)

మా. రామకృష్ణకవిగారిచేఁ
బరిశోధింపఁబడి

చెన్నపురి
"హిందూరత్నాకర" ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె
1929

ఈ గ్రంథము పీఠిక ప్రథమ ముద్రణ పీఠికయే కాని కవిగారు ప్రథమముద్రణ పీఠికయందలి కొన్ని వాక్యములను గొలఁదిగా మార్చిరి. ఎడనెడఁ గొన్నివాక్యము లెత్తివైచిరి. కొన్నిచోట్ల వాక్యముల నెన్నిటినో తొలఁగించిరి. ప్రథమముద్రణము పీఠికలో రామకృష్ణకవిగా రుదాహరించిన వరదరాజకవి పద్యములు వేఱు: 1929 సం. నాఁటి ముద్రణపీఠికలో నుదాహరించిన వరదరాజకవి పద్యములు వేఱు.

మొదటిదానిలో "...... భైరవకృతిలో మూడవ యాశ్వాసమున 729 వ పద్యమునుండి గల కథాభాగము ననుసరించి ......" వరదరాజ కవి పద్యము లుదాహృతములు కాఁగా, రెండవదానిలో "...భైరవ కృతిలో రెండవయాశ్వాసమున విభీషణ కథాభాగము ననుసరించి..." వరదరాజ కవి పద్యములు దాహృతములైనవి. కవిగారు నిర్ణయించిన భైరవుని కాలము ప్రథమ ద్వితీయముద్రణ పీఠికలలో రెండువిధము లుగా నున్నది. 1929 సం. నాఁటి ముద్రణము పీఠికాంతమున కోదండరామయ్యగా రుదాహరించినట్లే కవిగారు "ఇది వనపర్తి రాజా గారి సహాయమున మొదట ముద్రింపఁబడి, ప్రాచీనగ్రంథముఁ బూరక యిచ్చినను జదువువారు లేని యీ కాలమున నీభాగమైనఁ బునః ప్రచురమగుటకు సంతసించుచున్నాఁడ" నని వ్రాసిరి.

1929 సం. నాఁటి ముద్రణము వెనుకయట్టమీఁద "మాయొద్ద వెలకు దొరకు గ్రంథములు" అను శీర్షిక క్రింద రామ కృష్ణకవిగారు ప్రకటించిన సంస్కృతాంధ్రగ్రంథముల గుంపు. ఆంధ్ర గ్రంథములలో "బాలచరితము [నాటకము] ...... 0.6.0" అని యున్నది. ఈ గ్రంథములపట్టిక క్రిందఁ గుడివైపున కవిగారి చిఱునామా "మా. రామకృష్ణకవి, 366, టంకసాలవీధి, మదరాసు" అని యున్నది. ఈ వెనుక యట్ట క్రిందిభాగమున "Title Pages Printed at Tirupati Sri Mahant's Press, Madras" అని కలదు.

ఇంతకు "శ్రీరంగమహత్త్వము" సంపూర్ణముగా ద్వితీయ ముద్రణ భాగ్యము పొందినదా? లేక యొక ద్వితీయాశ్వాసమును మాత్రమే యింటర్మీడియట్ విద్యార్థుల కుపయోగకారియగునట్లు పీఠికతో రామకృష్ణకవిగారు ముద్రించిరా? రెండవసారి సంపూర్ణ ముగా శ్రీ రంగమహత్త్వమును ప్రకటించినచో వారు పీఠికాంతమున "...ఈ భాగమైనఁ బునః ప్రచుర మగుటకు సంతసించుచున్నాఁడ" నని వ్రాయనేల? వారి మాటను బట్టి యొక్క ద్వితీయాశ్వాసమును మాత్రమే తిరిగి ముద్రించితిరను నర్థము వచ్చుచున్నదిగదా! అట్టిచో ద్వితీయాశ్వాస పునర్ముద్రణమును సంపూర్ణ కావ్య ద్వితీయ ముద్రణ ముగా సంభావించుట తగదు గదా!

కేవలము శ్రీ రంగమహత్త్వ ద్వితీయాశ్వాసము పునర్ముద్రణ భాగ్యమేల నోఁచుకొన్నది? 1929 వ సం.లో నింటర్మీడియట్ విద్యార్థులకుఁ బాఠ్య గ్రంథముగా సమకూర్చుటకు సంకల్పించి ద్వితీయాశ్వాసమును మాత్రమే కవిగారు ముద్రించిరా? వారి సంకల్పము 1931 సం. నాఁటికిఁగాని నెఱవేఱ లేదా? అందువలననే వారి ద్వితీయాశ్వాసము-అట్టను వేఱొక ముద్రాక్షరశాలలో ముద్రించిరా? పరిశోధకులు నిర్ణయింతురు గాక!

—శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

* * *

1975 ఏప్రిల్ 'భారతిలో' శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు మానవల్లి కవి రచనలను గూర్చి వ్రాస్తూ, ఎక్కువగా వారి ముద్రిత రచనలను గూర్చి ప్రస్తావించారు. ఈ సందర్భంలో కవిగారు ఇచ్చిన తెలుగు సాహిత్య పరిణామము అను వ్యాప్తి ఉపన్యాసము (Extensiou lecture) ను గూర్చి ప్రస్తావించి యున్నారు. (పు. 24) తూర్పు గాంగ, గజపతి రాజుల నాటి పరిపాలన, సాంఘిక వ్యవస్థలను గూర్చిన నాసిద్ధాంత వ్యాసము (పి. హెచ్. డి. థీసిస్) నకై సంకల్పించిన 'Telugu literature under the later Eastern Gangas and the Suryavamsa Gajapatis' అనే అధ్యాయంలో, మానవల్లివారు ఆంగ్లమున వ్రాసిన 'History of Telugu Literature' వ్రైపు ప్రతినుండి, శ్రీనాథ కవికి సంబంధించిన సమాచారం కొంత ఉటంకించియున్నాను. కవి గారి అభిప్రాయంలో శ్రీనాథుడు తన చివరిరోజుల్లో పడ్డ కష్టాలకు గజపతులు బాధ్యులుకారు. ఆ వ్రైపు ప్రతిలో కవిగారు ఇట్లా వ్రాశారు:

"He (Srintha) died a miserable death probably at the hands of Mahommedans being unable to pay 700 coins for which be took a village on contract and which he failed to pay."

ఈ వ్రైపు ప్రతిలో కవిగారు వారి దస్తూరిలో కొన్ని దిద్దుబాట్లు చేసియున్నారు. శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులవద్ద ఉన్న ఈ ప్రతి వారిసౌజన్యంతో, శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారి ద్వారా 1972 లో నేను తెప్పించుకొని, మరల శ్రీ కృష్ణమూర్తి గారికి చేర్చాను.

ఇప్పుడు చెప్పవచ్చేదేమంటే, కవిగారి అముద్రితరచనలు వారి సన్నిహితులుగా ఉన్న వారివద్ద, అంతేవాసులయొద్ద చాల కలవని తెలియుచున్నది. వానిని సేకరించి, ప్రకటించవలసిన బాధ్యత, ఆంధ్రుల మీద, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మీద ఉన్నది.

-డా. సి. వి. రామచంద్రరావు

# గ్రంథ విమర్శలు

## లఘుసిద్ధాంత కౌముదీ

[తెలుగు వివరణము : శ్రీ ఆర్. శ్రీహరి, ఎం.ఏ. క్రౌను సైజు 176 పుటలు. వెల రూ. 4-80 ప్రకాశకులు—పతంజలి పబ్లికేషన్స్, హైదరాబాదు కాలనీ, హైదరాబాదు. ప్రతులకు 1. ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులకుంట, హైదరాబాదు. 2. ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు. 3. మాధవి బుక్ సెంటర్, ఆర్యసమాజ మందిర్ ఎదుట, సుల్తాన్ బజార్, హైదరాబాద్. 4. టాగూర్ పబ్లిషింగ్ హౌస్, కాచిగూడా చౌరాస్తా, హైదరాబాదు.]

సంస్కృతభాషలో ప్రవేశం కలగడానికి ఆ భాషను సంబంధించిన వ్యాకరణం చదవడం ఎంతో అవసరం. ఆ వ్యాకరణాలు సంస్కృతంలో ఎన్నో ఉండినవి. వాటిలో పాణినీయవ్యాకరణమే బహుళ ప్రచారానికి వచ్చి తక్కినవి మూల పడిపోయాయి. కొన్ని నామమాత్ర శిష్టములు మాత్రమే! పాణినీయ వ్యాకరణపు సౌలభ్యమే దీనికి కారణం.

వ్యాకరణ జిజ్ఞాసువులు తొలుత లఘు సిద్ధాంత కౌముదిని అభ్యసించి, ఆ పైని భట్టోజి దీక్షితుని సిద్ధాంత కౌముదిని, ఆ మీద ప్రౌఢమనోరమా శబ్దరత్నాలు పరిభాషేందు, లఘుశబ్దేందు శేఖరములు, లఘుమంజూష, పతంజలి మహాభాష్యం అభ్యసించి గట్టి వ్యాకరణ పాండిత్యాన్ని సంపాదిస్తారు. లఘు సిద్ధాంత కౌముదిని తొలుత అభ్యసిస్తే సిద్ధాంత కౌముది సులభంగా అర్థమవుతుంది. లఘుసిద్ధాంత కౌముదీ విషయాలనే విపులీకరించే మధ్యసిద్ధాంత కౌముదికూడా ఉన్నది కాని దానిని చాలామంది చదవరు. దానికి ఎక్కువ ప్రచారం లేదు. ఈ లఘు సిద్ధాంతకౌముదినీ, మధ్య సిద్ధాంత కౌముదిని కూడా వరదరాజ పండితుడు రచించాడు.

లఘు సిద్ధాంతకౌముది సులభపద్ధతిలో రచించబడినా తెలుగు వారికి సులభంగా బోధపడదనే భావంతో యిదివరకు వావిళ్లవారు రమారమి నలభైయేళ్ల కిందట తెలుగుటీకతో ప్రకటించారు. ఆ టీక లఘుసిద్ధాంతకౌముదివలెనే లఘువుగానే ఉన్నది. అది అయినా ఇప్పుడు లభ్యంకాదు. కాబట్టి దానికి మరో తెలుగుటీక ఎప్పుడైనా ఎంతో అవసరం. దీనిని గ్రహించి సంస్కృతాంధ్రభాషలలో పండితులు సంస్కృత వ్యాకరణంపై ప్రత్యేకాభిమానంగలవారు అయిన శ్రీ ఆర్. శ్రీహరిగారు లఘుసిద్ధాంతకౌముదికి తగిన తెలుగు టీకతో రచించి ప్రకటింప బూనుకున్నారు. అందులో తొలిభాగం యిది. ఇందులో సంజ్ఞా, సంధి, కృదంత ప్రకరణాలుమాత్రం ఉన్నవి. స్త్రీ ప్రత్యయ, కారక, సమాస, తద్ధితప్రకరణాలు గల రెండవభాగం అచ్చులో ఉన్నట్లు తెలుస్తున్నది.

సంస్కృత వ్యాకరణంలో పారిభాషికపదాలు, సాంకేతిక విషయాలు అడుగడుగునా తిరమకలు పెడుతూ వుంటాయి. వాటిని అవగాహన చేసుకోవడం కష్టసాధ్యంగా ఉంటుంది. అట్టిచోట్ల శ్రీహరిగారు ఇచ్చిన వివరణ జిజ్ఞాసువులకు ఎంతో సహాయకారిగా ఉంటుంది. కొంతవరకూ సంస్కృత భాషాప్రవేశం ఉన్నవారు స్వయంగా దీన్ని చదువుకుని, కృతార్థులు కావచ్చును.

డాక్టర్ వేంకటావధానిగారు దీనిపై ఇచ్చిన అభిప్రాయంలో సంస్కృతవ్యాకరణగ్రంథాల పరిచయం, దీని ప్రత్యేకత వివరింపబడినది. ఇది శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి ప్రశంసను కూడా అందుకున్నది.

రచయిత దీని మిగిలిన భాగాలను కూడా ఈ విధంగానే రచించి ప్రకటిస్తే ఆంధ్రులకు ఎంతో మేలు కూర్చిన కీర్తిని పొందగలరు.

*—శ్రీ బులుసు వేంకటరమణయ్య*

## కల్యాణ మందిర్ (నవల)

[రచన: అరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి ప్రచురణ: నవభారత్ బుక్‌హౌస్, ఏలూరురోడ్డు- విజయవాడ-2 వెల రూ. 6. పేజీలు- 280.]

నేటి నవలా సాహిత్యంలో శ్రీమతి కౌసల్యాదేవికి గల స్థానమేమిటో ఆంధ్ర పాఠక లోకానికి తెలుసు. నవలగా మాత్రమేగాక కథలు కూడ వ్రాసి ప్రఖ్యాతి పొందారు. శాంతినికేతన్, చక్రభ్రమణం, చక్రనేమి, చక్రవాకం మున్నగు నవలలు వ్రాసారు. ఏవో సంవత్స

తప్ప అన్నీ ఒకే మూసలో పోసిన అచ్చులవలె కానవస్తాయి నవలల్లో విచిత్రాలు విడ్డూరాలు చిత్రిస్తారు. అయితే వాటన్నింటిని ప్రక్కకు పెట్టి చదువుదురు.

ప్రతి నవలలోని కథ ధనవంతుల చుట్టూ తిరుగుతూ ఉంటుంది. ధనవంతులకు ధనమే ప్రధానం కాని గుణం కాదు. ఈ ధనవంతులకు సమస్యలుంటే ఆ సమస్యలకు పరిష్కార మార్గంగా ధనాన్ని వినియోగిస్తారు. మంచి తనం మాత్రం వ్యక్తం చేయరు. ధనిక స్వాముల దీపకాంతులలో మధ్య తరగతి మానవులు శలభాలలా విముక్తి కలుగక మాడిపోవలసిందే.

వీరు శైలికిచ్చినంత ప్రాధాన్యం శిల్పానికీయరు. రచనలో ఆవేశంకంటె అధికార దాహం ఎక్కువ. సామాన్యంగా పురుష పాత్రలు తమ అధికారాన్ని చెలాయించి లేనిపోని అనవసర ఘటనలకు లోనవుతూ ఉండును. సినిమాలలో జరిగే సంఘటనలు నవలల్లో దర్శనమిస్తాయి. ఆయా సంఘటనలు చూచిన సినిమాలు చూచి అట్టి ఘటనలు కల్పించారనే సందేహం కలుగుతుంది.

కల్యాణమందిర్ ఒక అభాగ్యురాలి స్మృతి చిహ్నంగా వెలసినది. ఆ మందిరం వెనుక విషాదగాథ ఉన్నది.

సమాజంలో ధనం ఉన్నవారు స్త్రీలతో దాగుడుమూతలాడి ఆట బొమ్మలుగ చేసి ఆడి, ఆడి, అలసి అహంకారంతో ప్రగ్గి ఆ బొమ్మలను చివరకు ముక్కలు చేసి అవతలకు పారివేస్తారు. అలాగుననే పారవేయబడింది కల్యాణి. ధనవంతుల బిడ్డ ప్రకాశ్. అతనికి ముందుగానే మైత్రితో వివాహం నిర్ణయమైంది. మైత్రి స్నేహితురాలు కల్యాణిపై మోజుపడ్డాడు. పరస్పరం కలిసికోవటం, పొంగిపోవటం, గాలిమేడలు కట్టుకోవటం జరగాయి. మధ్యతరగతి సంసారాల స్థితిని గమనింపని కల్యాణి కాలు జారింది. దానితో కష్టాలు ప్రారంభమయ్యాయి. కన్నవారికి దూరమయ్యింది. కట్టుకొనని ప్రియునకు ఆట బొమ్మగా అయ్యింది. నిజం తెలిసికొని బయటపడి కష్టానుభవించింది. ప్రియుడు కావాలని సంబరపడిందో తుదకతన్ని వదలి గమ్యం లేని మార్గంలో పయనించింది. ఎదురుదెబ్బలు తగిలినా తట్టుకొని కష్టాలతో ప్రాణాన్ని ఈడ్చింది. అనాథాశ్రమంలో బిడ్డను కన్నది. ముచ్చటలు తీర్చుకొనకనే బిడ్డను వదలి పారిపోయింది. డాన్సు ట్రూపులో చేరింది. ఆశ్రమంలో తన పాప భారాన్ని మైత్రి కప్పగించింది. క్షయవ్యాధికి గురియయ్యింది. తనవారిని వెదుక్కొంటూ బయలుదేరింది. అందరూ చీదరించుకొని బయటకు నెట్టారు. చివరకు మైత్రి దగ్గరకు చేరి పాపను చూచి మురిసింది. వ్యాధి ప్రభావం వలన, కష్టాలవలన కల్యాణి శుష్కించింది. మైత్రి ఆదరించినా ప్రయోజనం లేకపోయింది. కల్యాణి మరణించింది. ఆమె పేరుమీదుగా కల్యాణ మందిరం నిర్మాణమయ్యింది.

ఈ నవలలో కల్యాణి, మైత్రి, ప్రకాశ్ చెప్పుకోదగిన పాత్రలు. కల్యాణి మధ్యతరగతి సంసారుని కుమార్తె. ఒకప్రక్క బీదరికం, మరియొకప్రక్క కీర్తి ప్రతిష్ఠల మధ్య పెనుగులాడిన వ్యక్తి కల్యాణి తండ్రి రామ్మూర్తి. పెద్ద పెద్ద భవంతులను చూచి మురిసిపోయి అదే లోకమని భ్రమపడి అక్కడ ఉండాలని తపించింది. సిరిసంపదలు కావాలని కోరుకున్నదేకాని గుణం కావాలని కోరుకోలేదు. మగవాడి మాయలకు తలవంచింది. ప్రకాశ్ అంటే పొంగిపోయింది. అతని పొందుకు తహతహలాడింది. కన్న తల్లిదండ్రులను లెక్కచేయకుండా, వారి బీదరికాన్ని చూడక, తన సంతోషమే ముఖ్యమని భావించి అతనితో లేచిపోయి కాపురం సాగించింది.

సంతోషం లేని జీవితం ఆమెది. ప్రకాశ్ తనను మోసగిస్తాడనే విషయం గ్రహింపని అయోమయపుజీవి. గర్భవతి అయ్యింది. అప్పటినుండి కష్టాలుప్రారంభమయ్యాయి. మదనపడింది. తనవారిని గూర్చి ఆలోచనలు ప్రారంభించినా ప్రయోజనం లేకపోయింది. ప్రియుడు గర్భాన్ని సహింపలేకపోయాడు. ఆమె మనసులో సందేహం గూడుకట్టుకొన్నది. అన్నింటిని వదలి ఆ యింటినుండి పరారయ్యింది. మరణం కొరకు ప్రయత్నించింది కాని అనుకొనిన వెంటనే మరణం ప్రాప్తించలేదు. తుదిక్షణాలలో బిడ్డకొరకు మైత్రి

ప్రక్క చేరింది. చేసిన తప్పుకు పశ్చాత్తాపం పొందింది. చేతులుకాలిన తరువాత ఆకులు పట్టుకొన్న అభాగ్యురాలు. జీవితంలో ప్రకాశ్‌తో లేచి రావటమే పెద్దతప్పు చేసింది. కాని శీలాన్ని బజారుపాలు చేయలేదు. ఈ సమాజం లేచిపోయిన దానిని పతితగానే చూస్తారు. పతివ్రతగా తిరిగి సమాజంలో చేర్చుకోలేరు. అట్టి ఘటనే కల్యాణికి జరిగింది. ప్రకాశ్‌తో మాట్లాడింది. మనసు గ్రహించింది. అతని ఇంటిలోనే కన్ను మూసింది.

మైత్రేయి ధనవంతుల కుమార్తె. స్నేహమంటే ఆమెదే స్నేహం. ఈ స్నేహం కొరకు ఏదైనా చేయగలదు. తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీరు అని నమ్మే స్వభావం యీమెది. కష్టం సంగతి తెలియదు సుఖం కూడ పూర్తిగా అనుభవించని అమాయకురాలు. కల్యాణి ప్రకాశ్‌ను మోహించిందంటే అసూయపడక తనలో తాను కుమిలిపోయింది. ఏనాటికైనా ప్రకాశ్ తన బావేనని భావించింది. అలాగ జరిగింది. అయితే ప్రకాశ్ జీవితాన్ని రెండువైపులా చూచి పరిశీలింపక మిన్నకున్నది. ఆమెలో త్యాగం ఉన్నది. ఆ త్యాగమే మైత్రిని ఔన్నత్య వంతురాలుగా తయారు చేసింది. కల్యాణి తనబిడ్డ పోషణభారం వహింపమని అర్థించింది అందుకామోదించటంలో ఆమె యొక్క ఔదార్యం వ్యక్తమయ్యింది.

ఎదుట వ్యక్తి తప్పు చేసినా ప్రతీకారం చేయకుండా ఉదారం చూపించే స్వభావం ఆమెది. ఏస్త్రీఅయినా తనభర్తను అన్యస్త్రీ వలలో వేసికొన్నదంటే భరింపలేదు మైత్రి కల్యాణి చేసిన ద్రోహాన్ని గ్రహించినా అపకారం చేయక ఉపకారంచేసి మన్నించింది. మైత్రిచేసే ప్రతిపనిలో స్వార్థంకంటె పరార్థమే అధికం. ఆమె నిజాయితీయే ఆమెను కాపాడింది.

ప్రకాశ్ నేటి సమాజానికి ప్రతీక. గుణంకంటె ధనమే ముఖ్యం. ఆ ధనంకొరకు నీచాతినీచాలకు పాల్పడతాడు. మోసం క్రౌర్యం అతని శరీరంలో కరుడుకట్టి ఉన్నాయి. ఎంతసేపూ తన మాటే నెగ్గించుకోవాలని తాపత్రయపడతాడు. పశ్చాత్తాపమనేది మచ్చుకకైనా కాన్పింపదు. ధనమదం చేత కల్యాణి జీవితాన్ని నాశనం చేసాడు. ఆమెలో ఉండే నిజాయితీని గుర్తింపక, తనను తాను పరిశీలించుకొనక భవంతుల మధ్య జీవితాన్ని సాగించాడు. కట్టుకొన్న భార్యకు సంతానం కలగలేదు. దానధర్మాలు ప్రారంభించాడు. మారినట్లుగా లోకాన్ని నమ్మించాడు. కల్యాణి శీలాన్నే పాడుచేసినవాడు మనసారా ఆమెను గౌరవించలేకపోయాడు. ఆమెకే గనుక ధనం ఉన్నట్లయితే చేతులు కట్టుకొని ముందు నిలబడి దాసోహం అనేవాడు. అబద్ధాలతో కాపురంచేసి న్యాయం గొంతునొక్కి పెద్దమనిషిలా ప్రవర్తించాడు.

ప్రకాశ్‌కు ఋజుమార్గ ప్రవర్తనలేదు. మైత్రిలో స్త్రీ సహజమగు మాతృత్వం, సహనం, ఓర్పు, సానుభూతి సంపూర్ణంగా ఉన్నాయి. కల్యాణి త్రాడులేని బొంగరం: తెగిన గాలిపటం. ముళ్ళబాటలో నడచి క్షణక్షణం బాధకు వ్యధకు లోనై నరకం అనుభవించి ప్రాణాలు వదిలింది.

నేటి రచయిత్రులు సినిమాలను చూచి అందులో కానవచ్చే ఘటనలను కాపీకొట్టి తమ నవలలందు చూపిస్తున్నారు. ఆయా సన్నివేశాలు నిజ జీవితంలో సంభవమా అసంభవమా అనే ఆలోచన లేకుండా సృష్టిస్తున్నారు. ఇట్టి సన్నివేశాలు ఈ నవలలో రచయిత్రి సృష్టించారు.

కల్యాణికి కావలసిన భర్త శేషు బట్టల వ్యాపారి వేషంలో వచ్చి విషయాలు గ్రహించి మైత్రికి కల్యాణికి, ప్రకాశ్‌ల ప్రేమ వ్యవహారం గూర్చి లెటరు వ్రాయుట మున్నగు విషయాలు రచయిత్రి 62-64 పేజీలో చిత్రించారు. ఈ నవనాగరకతా సమాజంలో ఇలాంటి వేషాలకు చోటు లేదు. ఈ వేషాలు సినిమాల్లో సాధ్యమే కాని యథార్థ జీవితంలో సాధ్యంకాదు. ఇట్టి వేషాలు చిత్రించినట్లయితే నవలకున్న ప్రాధాన్యం కాస్తా కాలగర్భంలో కలిసిపోతుంది.

ప్రకాశ్‌నువదలి కల్యాణి వచ్చింది. గోదావరి దాటుటకు పడవ ఎక్కింది. చేతిలో డబ్బులులేవు. దానికి బదులుగా వజ్రాల నక్లెస్ ఇచ్చింది. అది పడవవాడుగాక మరొకడు తీసుకొని పరారయ్యాడు. తరువాత అక్కడే శిల్కు లాల్చీవాడితో పరిచయం కలిగి హైదరాబాద్ ప్రయాణమయ్యింది. ఈ ఘటనలన్నీ (156-162) చాల అసహజంగా ఉన్నాయి.

శిల్కులాల్చీవాడి నుండి తప్పుకొన్నది మరణించాలని నదిలో మునిగింది. పిక్నిక్‌కు వచ్చిన స్త్రీలు కల్యాణిని రక్షించి అనాథ శరణాలయానికి తీసికొనిపోయారు. అక్కడే బిడ్డను ప్రసవించింది. వదలి

మారిపోయింది. ఈ సన్నివేశాల కలో నిజమో పాఠకులూహించుకో వచ్చును.

కల్యాణి డాన్సు ట్రూపు వారి కారు క్రిందపడి రక్షింపబడ్డది. రాధా కృష్ణస్వామి ఆ ట్రూపు సంరక్షకులు. కల్యాణిని అత్యంత సన్నిహితంగా చూచుకొన్నారు. మేనక–విశ్వామిత్ర నాటికలో కల్యాణి మేనక పాత్ర ధరించి ప్రేక్షకులను మెప్పించింది. కృష్ణస్వామి నాట్యాచార్యునిగా ప్రకాశ్‌తో పరిచయం కలిగించుకొనుట.

స్వంత కుమార్తెను రక్షింపబోయి కారుక్రిందపడి మైత్రి ఇంటిలో పరిచర్యలు పొందింది. ప్రకాశ్‌కు కల్యాణికి వాగ్యుద్ధం ప్రారంభమయ్యింది. ఆ యుద్ధంలో ప్రకాశ్ పిస్టల్ తీసాడు. దానిని మైత్రి లాక్కొని దాచి సర్ది చెప్పింది.

ఇట్టి సన్నివేశాలింకా ఉన్నాయి. వాటన్నింటిని ఏకరువు పెట్టటం సమీక్షలో సాధ్యంకాదు. ఈ పై సన్నివేశాలు రచయిత్రి ఊహాలోకంలో ఉండి సత్యాసత్యాలను గమనింపక చిత్రించారు. నవల యొక్క ప్రయోజనం గ్రహించి ఉంటే ఈ విధమగు కల్పనలను తావులేకుండా చేసి ఉండేవారేమో అనిపిస్తున్నది. నవలలో జీవితం వంటి కథ చెప్పాలిగాని కథవంటి జీవితంచెప్పకూడదు. నవల సమాజానికి ప్రతిబింబం అని మనసారా నమ్మినట్లయిన ఇట్టి అభూతకల్పనలకు తావులేదు. ఏవో నమ్మరాని సంఘటనలు కూర్చి నవలగా వ్రాసి లోకంమీద విసరివేసినంతమాత్రాన రచయితలు — రచయిత్రులు తమ కర్తవ్యం నెరవేరిందని భావింపకుండా ఉంటే చాల మంచిది.

రచయిత్రికి ఆధునిక నాగరికంపై మోజుకంటె తిరస్కారమే అధికం. అందుచేతనే మైత్రేయి ముఖ్యంగా ధనిక దర్పాలతో ఇటు మనసంప్రదాయాన్ని విస్మరిస్తున్నాం. అటు విదేశీ సంస్కృతిని గుడ్డిగా అనుకరించి మహామనమే సంస్కారవంతులం అనుకొని విర్రవీగుతున్నాం. ఫలితంగా మంచిచెడుల వివక్షతా యుక్తాయుక్తాల విమర్శనా తప్పొప్పుల భేదమూ తెలియని హీనదశకు దిగజారిపోతున్నాం." (73–74 పేజి) అని రచయిత్రి విమర్శనాస్త్రాన్ని సమాజంపై ప్రయోగించారు.

నవలలో కథను రచయిత్రి పొడిగించారు. రెండువందల ఏనబది పేజీలవరకు కథను సాగించినా ముగింపు దెబ్బతిన్నది. కల్యాణిని నానావిధాలుగా త్రిప్పి చివరకు మైత్రి దగ్గరకు చేర్చుట భావ్యంగా లేదు. ఇందులో మొదటినుండి చివరివరకు ఉన్న పాత్రలు కల్యాణి, మైత్రి, ప్రకాశ్. వీనినే **Round Character** గా నవలా విమర్శకులు పేర్కొన్నారు.

నవభారత్ బుక్ హౌస్ వారు నవలకు మంచి గెటప్ ఇచ్చారు. గెటప్‌లో శ్రద్ధ చూపించిన వారు ముద్రారాక్షసాలు దొర్లనీయకుండా చేయలేకపోయారు.

శ్రీమతి కౌసల్యాదేవి నవలా ప్రపంచంలో ఒక స్థానాన్ని సంపాదించిన రచయిత్రి. ఆమె నవలలు సినిమాలుగా రూపొందింపబడ్డాయి. కేవలం సినిమాకొరకే ఈ నవల వ్రాస్తున్నామనే మాట రచయిత్రి మరచిపోవాలి. లోకంలో జరిగే వాస్తవికతను దర్శించి దానిని వివరిస్తూ ఒక పరిష్కారమార్గాన్ని చూపించి కథను ఆదర్శంగా తీర్చినట్లయిన రచన పదికాలాలపాటు సాహిత్యంలో నిలుస్తుందని తలంపు [illegible]

శ్రీ రామమోహన్

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

అనుకోని రాగాలు వినిపించెనే! కనరాని స్వర్గాలు దిగి వచ్చెనే!.....

సురేష్ ఇంటర్నేషనల్

# అమ్మాయిల శపథం

నిర్మాతలు:
డి.వెంకటేశ్వర్లు, బి.శకుంతలమ్మ

దర్శకత్వం:
జి.వి.ఆర్.శేషగిరిరావు



NVKR

ఆంధ్ర-సీడెడ్ నవయుగ నైజాం విజయా సురేష్ పిక్చర్స్

ఈశ్వర్

BCI

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M121 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 2,4 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | naveeda |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |